

# ‘శ్రీవారికి ప్రేమలేఖ’

## పాటల తేనెతేటలు

కన్నెపిల్లల చిలిపి వూహలు చిలికి చిలికి వలపుల గాలివానలు రేపుతాయి. సిగ్గుల సుడిలో చిక్కుకున్న కన్నెమనసు ఉక్కిరి బిక్కిరై లెక్కలేని భావతరంగాలలో ఓలలాడుతుంది. అలా ఓలలాడే ప్రాయంలో ఈలవేసి గోలచేసే మధురోహల సుధా బిందువులే అక్షర రూపం ధరించి ప్రేమ లేఖగా రూపాంతరం చెందుతాయి. సనాతన సంప్రదాయ సరళిలో సాగిన ఈ ప్రేమలేఖ స్త్రీ మనోభావాలకు పట్టిన అద్దం. ఈడొచ్చిన హృదయాలలో స్పందించే శబ్దం. ఈ సంబోధన, అక్షరాల మనోవేదన, ప్రేమాంతరంగ పరిశోధన చదివి చూడండి.

"శ్రీమన్ మహారాజ! మార్తాండ తేజ
ప్రియానందభోజ! మీ శ్రీచరణాం
భోజములకు
ప్రేమతో నమస్కరించి
మిమ్ము వరించి, మీ గురించి
ఎన్నో కలలుకన్న కన్నె బంగారు
భయముతో
భక్తితో, అనురక్తితో శాయంగల
విన్నపములు..."

ఇలా ఆరంభమైన ప్రేమలేఖ చదువు కుంటే ఏ మగాడి గుండెల్లో ఉగాదు

లుదయించవో చెప్పండి! మతి చెదరిపోదా! మది అదిరిపోదా!! మరో రెండక్షరాలు ముందుకు వెడదాం...

"తొలిసారి మిమ్మల్ని చూసింది
మొదలు
కదిలాయి మదిలోన ఎన్నెన్నొ
కథలు"

ఇలా అన్నప్పుడు యువ హృదయంలో రగిలిన ప్రేమానలం ఆ అమ్మాయి ఆచూకీ తెలిసేదాకా నిలువునా దహించకుండా వుంటుందా! అందులోనూ కన్నెపిల్ల రాసిన ఉత్తరం కదా....!

ఇంకో చరణం ముందుకు వేద్దాం...

"వలచి వచ్చిన వనితను చులకన
చేయక తప్పులుంటే
మన్నించి, ఒప్పులుగా భావించి...
మీ జతనే కోరుకుని లతలా అల్లుకునే
నాకు
మీరు మనసిస్తే ఇచ్చినట్లు మాటిస్తే
ఇప్పుడే బదులివ్వండి!"

వలచి వచ్చిన వనితను మగమహారాజులు చులకన చేస్తారనే భయం, రాసిన ఉత్తరంలో తప్పులున్నాయేమో నన్న సంశయం... ఆశించిన విధంగా జవాబు కోసం ఎదురుతెన్నులు చూసే తాపత్రయం (తాప-త్రయం) కలబోసిన ఈ ఉత్తరం చదివితే తత్తరపడి బిత్తరపోని మగధీరుడెవడుంటాడు?



మగ మన స్తత్వాన్ని కాచి వడబోయ గల సామర్థ్యాన్ని ఉగ్గుబాలతో రంగరించు కుంది స్వర్ణ.

ఎవరీ స్వర్ణ? 'శ్రీవారికి ప్రేమలేఖ'లో కథానాయకి. ఇదీ టూకీగా ఆమె పాత్ర పరిచయం. ఇకపోతే ఆడపిల్ల ఆశలు, ఆశయాలు, మనోభావాలు ఒక్కసారి తరచి చూద్దాం. హృదయం తెరచి చూద్దాం.

పెళ్లిచూపుల పేరు చెబితే చాలు కన్నెకలలు వెల్లువలౌతాయి. రాబోయే వరుడు కాబోయే సహచరుడన్న ఆలోచన తట్టగానే పుట్టెడు ఆనందం పెల్లుబుకు తుంది. తీయని ఊహల ఊయల్లో ఊగు తుంది. ఇది కన్నెతనం, ఇది కలలగుణం. వచ్చిన వరుడు ఏదో ఒక వంకమీద అమ్మాయిని తిరస్కరిస్తే బేలహృదయం ఎంతగా కృంగిపోతుందో, ఎంతగా కుమిలి పోతుందో చెప్పడం కష్టమేమరి. అది ఏ అక్షరాలకూ అలవిగానిపని. అది కేవలం అనుభవైక వేద్యం! ఇందులో తప్పెవరిదీ? - అన్న మీమాంసఅనవసరం. అర్థంపర్థంలేని పెళ్లిచూపుల ప్రహసనాన్ని నిందించడం తప్ప మనం చేయగలిగిందేమీలేదు.





"కక్కొచ్చినా
కళ్యాణమొచ్చినా ఆగదు"
అన్న సిద్ధాంతాన్ని నమ్ముకుని కూర్చోవలసిందేనా మరి! అలాంటి సిద్ధాంతాలు ఎన్ని వల్లించుకుని మనం తృప్తిపడ్డా కలలుగనడం తప్ప మరోటి తెలీని మనసు ఓపట్టాన ఆగదుగా! అందుకే దాని ఆశలు కట్టలుతెంచుకుంటై. వాటిని అదుపులో పెట్టుకోడానికి, తన పరిస్థితులతో ఆనకట్టలు కట్టుకోడానికి ప్రయత్నిస్తోందో బేలమనసు.

"మనసా తుళ్ళిపడకే
అతిగా ఆశపడకే
అతనికి నీవు నచ్చావో లేదో!
ఆ శుభఘడియ వచ్చేనా రాదో
తొందరపడితే అలుసే మనసా
తెలుసా!"

అని తన మనసుని తానే హెచ్చరించుకుంటూ, తన అందచందాలను ఆస్థి అంతస్తులను అంచనా వేసుకుంటూ ఆరాటపడే మనసుకి ఊరట కల్గించుకునే ప్రయత్నం చేస్తోంది ప్రపంచ జ్ఞానంతో పరిఢవిల్లుతున్న ప్రాయంలోని పడుచు. అందం చందం, చదువు సంధ్య, తళుకు కులుకు ఇవన్నీ తనకు లేవని తెలిసినా- తన జీవిత భాగస్వామి అన్నివిధాలా తనకన్నా ఉన్నతమైనవాడుగా, సకల భోగభాగ్యాలతో తులతూగేవాడుగా, హుందాతనంతో వెలుగొందే రాకుమారుడిలా వుండాలనే కాంక్షిస్తుంది స్త్రీమనసు. ఆది సహజం. అయినా-

"ఏ నోము నోచావు నీవని దొరికేను
ఆ ప్రేమ ఫలము
ఏ దేవుడిస్తాడు నీకని అమదైన అంత
వరము"



ఎన్ని నోములు నోచినా, ఎందరు దేవుళ్ల దీవనలందుకున్నా ఆశించిన వరుడు చేతికి అందిరావడం అరుదైనవరం. ఈ సత్యం ఇంతో అంతో తెలిసినా తన తాహతుకు మించిన కలలు గనడం, గగన కుసుమాలను అందుకోవాలని ఆశపడడం అవివేకమే అవుతుందని తెలీక అత్యాశకు లోనై అందని తీయని ద్రాక్షల కోసం అర్రులుచాచే బేలమనసుకు జోలపాడుకుంటూందో స్వర్ణకమలం. ఇలా అంతర్లీనంగా ఆడవాళ్ల అంతరంగాల్లో పొంగిపొరలే భావతరంగాలను ఔపోసన పట్టి చిత్ర రూపంలో మీ ముందుంచే నాద, మోద, వినోద సంభరిత చిత్రం ఉషా కిరణ్ మూవీస్ తొలి వెలుగు రేఖ 'శ్రీవారికి ప్రేమలేఖ'.

కంటబడకుండా వెంటాడే ప్రేయసి ఊహాసుందరిలా మనో నేత్రంముందు సాక్షాత్కరిస్తే యువకుని ఆలోచనాంబరంపై మెరసే కోరికల తారకల తోరణాలు....

"సరిగమపదని స్వరధారా
రససాగర యాత్రకు ధృవతార
వీణవై, జాణవై
వేణువై, వెలదివై
మువ్వవై, ముదితవై
వర్ణమై, నా స్వర్ణమై
నెలవంక పల్లకిలో
ఇలవంక దిగిరావే..."

సప్తస్వరాల సంగమంలా, నాద, వేద, మోదాల సమన్వయంగా అణువణువణువులోనూ ఆమెనే ఊహించుకుంటూ ఆరాధించుకుంటూ వుండే ప్రియుని మనోవేదనకు మకుటాయమానం ఇది. స్త్రీ సహజమైన సింగారింపుల శృంగార తరంగాలను కదలించి చూద్దాం.

"అరుణం అరుణం ఒక చీర
అంబరనీలం ఒక చీర
..................
..................
హరితం హరితం ఒక చీర
హంసల వర్ణం ఒక చీర''

అంటూ రంగులు పొంగారే చీరల రకాలలో చిందాడే సౌందర్యాలను రూపు

కట్టించుకుంటాడు ప్రియుడు.

"లిపిలేని కంటిబాస
తెలిపింది చిలిపిఆశ
నీ కన్నుల కాటుక లేఖలలో
నీ సొగసు కవితా రేఖలలో
ఇలా ఇలా చదవనీ నీ లేఖనీ
ప్రణయరేఖనీ''

మాటలురాని కళ్లతో మాట్లాడించగల ప్రతిభ ఒక్క వేటూరికీ, దర్శకుడు జంధ్యాలకూ తప్ప మరెవ్వరికీ సాధ్య పడదేమో అనిపిస్తుంది.

ప్రేమైకజీవుల మూగ సంకేతాలకు, శ్వాసలకు సైతం ప్రాసలు నేర్పే ప్రేమ కౌగిళ్లకు ప్రతిరూపంగా నిలబడుతుంది 'శ్రీవారికి ప్రేమలేఖ'.

నరేష్, పూర్ణిమ, అరుణ, నూతన్ ప్రసాద్, శ్రీలక్ష్మి, సుత్తి వీరభద్రరావు, పి.యల్. నారాయణ, రాళ్ళపల్లి, సంగీత, కె. విజయ, అత్తిలి లక్ష్మి, మిశ్రో, పొట్టి ప్రసాద్, సత్తిబాబు, ఛమ్ ప్రధాన పాత్రలు పోషించిన ఈ చిత్రం ద్వారా మెల్కొటే, విద్యాసాగర్ అనే నూతన నటులు పరిచయం అవుతున్నారు.

కథ:పి. విజయలక్ష్మి;రచన, దర్శకత్వం: జంధ్యాల; పాటలు : వేటూరి; సంగీతం : రమేష్‌నాయుడు; కెమేరా : యస్. గోపాల రెడ్డి; కళ : భాస్కరరాజు; కూర్పు : గౌతమ్‌రాజు; నృత్యాలు : శివసుబ్రహ్మణ్యం; ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ : అట్లూరి రామారావు. ఈ చిత్రం మయూరి ఫిలింస్ ద్వారా ఫిబ్రవరిలో విడుదలవుతోంది.



జంధ్యాల



గోపాలరెడ్డి



రమేష్‌నాయుడు



జానకి



బాలు

# చతుర

సంపుటి : 7 ఫిబ్రవరి 1984 సంచిక : 1


## ఈ నెల సమగ్ర నవల

జీవితంపట్ల గాఢానురక్తి, వృత్తిలో అపారనైపుణ్యం ఉన్న యువ డాక్టర్ అతను. సమాజంలో ఉన్నత స్థానంలో ఉన్న ఉత్సాహవంతుడు. కోరుకున్నఅందాలరాశిని పరిణయమాడగల్గిన కార్యశీలి. అయినా ఆమెను భార్యగా మలుచుకోలేక విఫలుడయాడు. తనను మౌనంగా ఆరాధించే మరో యువతిని అసలు గుర్తించనే లేకపోయాడు. తీరా గుర్తించగలిగిన సమయానికి... ఉరి



# శిక్ష

అనుభవించవలసిన స్థితిలో జైలులో బందీగా ఉండిపోయాడు. అతనిని ఆ దుస్థితినుండి తప్పించేందుకు ఆ ప్రేమికురాలు చేసిన ప్రయత్నం ఎలాంటిది? దాని పర్యవసానం ఏమిటి? ప్రాణం పోసే డాక్టర్ స్వయంగా మూడు నిండు ప్రాణాలను అంతం చేయవలసిన దుస్థితి ఎలా ఎదురయింది?

## వందన

రచించిన ఉద్వేగభరిత నవల 'శిక్ష' ఈ నెల చతుర సమగ్ర నవల. చివరివరకూ హృదయాల్ని కదలించేలా తీర్చిదిద్దిన జీవన కావ్యం 'శిక్ష'

ముఖచిత్రం : ఎస్. శివన్నారాయణ

రెండవ కవరు : డి. సుధీర్‌బాబ్జి

మూడవ కవరు: సూరజ్ ఎన్. శర్మ

# రచయితలకు ఆహ్వానం

వైవిధ్యంగల ఇతివృత్తాలతో, ఆసక్తికరమైన రచనా సంవిధానంగల నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. ప్రచురించే ప్రతి నవలకు రు.1500/-, అత్యుత్తమ నవలకు రు. 2000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే!

'చతుర'లో బొమ్మలు, ఇతర శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్కన నవల వ్రాత ప్రతిలో మొత్తంమీద 26 వేల పదాలకు తక్కువ కాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో ఒక పేజీలో ఎన్ని పదాలు వచ్చాయనేదానినిబట్టి మొత్తం నవలలోని పదాలను సుమారుగా లెక్క చూసుకోవచ్చును. ప్రస్తుతం వివిధ మాస పత్రికలు ప్రచురిస్తున్న 112 పేజీల నవలలు 'చతుర'లో 70 పేజీలు మాత్రమే అవుతాయి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలించబడతాయి.
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించ వలసి వచ్చే పక్షంలో అందుకు అభ్యంతరంలేనివారే నవలలను పంపించగలరు.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షం లోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.




# Artists...

If you think you can visualise, paint, illustrate an idea, then you are the man for us. May be you can design, do a layout or a cartoon too. Then we are on the look-out for creative people like you, painters, illustrators, cartoonists and artists.

Naturally we expect you to be excellent at English and Telugu lettering and free hand drawing. Salary depends on your experience and talent. If you think your etchings are quite fetching, then do write to us with a detailed resume, a recent photograph and a few specimens of your work.

**To,**

**The Personnel Department**
**Vasundhara Publications**
**Eenadu Compound**
**Hyderabad - 500 004**

**Within 10 days**





## మానవ హోమం

ప్రస్తుతం ప్రపంచంలో అందరినీ ఆకర్షిస్తున్న అంశాలలో మూడో ప్రపంచ యుద్ధం ఒకటి. జ్యోతిష్కులమాట అటుంచి శాస్త్రవేత్తలే స్వయంగా ప్రపంచ యుద్ధం గురించి జోస్యం చెపుతున్నారు. మూడో ప్రపంచ యుద్ధం 1985 జూన్ 15న మొదలవుతుందట. అప్పుడు న్యూయార్క్‌లో ఉదయం 11గంటలు, మాస్కోలో సాయంత్రం 6 గంటల సమయం అవుతుంది. యుద్ధం మొదలయిన 24గంటలలో అమెరికా, రష్యాలు 14,746 అణ్వాయుధాలను ఉపయోగిస్తాయి. 7,500 లక్షలమంది మరణిస్తారు. 3,500 లక్షలమంది గాయపడతారు. ఇది శాస్త్రవేత్తల అంచనా.

అమెరికా, యూరప్ శాస్త్రవేత్తలు. స్టాక్‌హోమ్‌లో రెండేళ్ళపాటు పరిశోధించి పై నిర్ణయానికి వచ్చారు.

ఈ పరిశోధనకు అయ్యే వ్యయాన్ని స్వీడన్ సైన్స్ అకాడమి భరించింది. వీరు ఈ అంచనాలను పత్రికల్లో ప్రచురించారు కూడా.

వీరు మరికొన్ని భయంకరమయిన నిజాలను కూడా వెల్లడించారు. మూడో ప్రపంచయుద్ధ సమయంలో పేలే మొదటి బాంబు హీరోషిమా మీద వేసిన బాంబు కన్నా పదిలక్షల రెట్లు శక్తిపంతమైనది. ఈ అణుబాంబులు పేలడంవలన విడుదలయే అణుధార్మికత సముద్రాలను ప్రభావితం చేయదు. కనుక చేపలు మాత్రం వినియోగానికి వీలుగా మిగులుతాయి.

అమెరికాలో గాయపడినవారిలో ఇరవై శాతం మంది కొన్ని వారాలలోపలే చనిపోతారు. మిగిలిన 80శాతంమంది క్రమంగా కేన్సర్‌వలన చనిపోతారు. అనేక పరిశ్రమలు, విద్యుదుత్పాదక కేంద్రాలు నాశనమయి వీటినుండి వెలువడే నల్లనిపొగ సూర్యుడిని కప్పేయడంవలన కొన్ని నెలలపాటు మనకు సూర్యరశ్మి లభించదు.

జంతువులతోసహా ప్రపంచంలోని వృక్షజాతి సమస్తం నశిస్తుంది. అయితే ఈ విధ్వంసంలో ఎలుకలు మరణించవు. కనుక వీటిసంఖ్య భయంకరమయిన స్థాయిలో పెరుగుతుంది. ప్రపంచంలోని వాణిజ్య కార్యకలాపాలన్నీ నిలిచి

పోతాయి. ఈ అవకాశాన్ని వినియో గించుకొని కొందరు నియంతల్లా వ్యవహ రించి జనాన్ని పరిపాలిస్తారు. మరి ఈ మానవహోమాన్ని ఆపే నాథుడెవరో?

## అచోరకం ప్రేమ

ఏంథోని టోట్టో తన పడగ్గదిలో గాఢ నిద్రలో వున్నాడు. అంతలో ఆ గది తలుపులు చప్పుడుచేయకుండా తెరుచు కున్నాయి. ఏంథోని కూతురు పదిహే డేళ్ళ ఎలిజబెత్, ఆమె బాయ్ఫ్రెండ్ బ్రునో నిశ్శబ్దంగా లోపలికి అడుగు పెట్టారు. నెమ్మదిగా రివాల్వర్ తీసి ఏంథోని తలకు గురిపెట్టి కాల్చి పారి పోయారు.

దురదృష్టవశాత్తు ఏంథోని మరణించ లేదు. ఈ గొడవ విని ఏంథోని భార్య భర్త పడగ్గదిలోకి పరిగెత్తుకు వచ్చి ఎక్కువ మోతాదులో నిద్రమాత్రలను బలవంతంగా మింగించింది అతని చేత. అయినా గట్టిపిండమయిన ఏంథోని చని పోలేదు. ఇది పనికాదని అతని భార్య ఓ ఇద్దరికి చెరో 500 డాలర్లు ఇచ్చి భర్తను చంపమని పంపింది. వారిలో ఒకడు



ఏంథోని పక్కగదిలోకి వెళ్ళి మళ్ళీ రివాల్వర్‌తో కాల్చాడు. గుండు సరిగ్గా గుండెకి కొంచెం కిందగా తగిలింది. కాల్చినవాడు పారిపోయాడు పనయిపోగానే.

ఈ ప్రయత్నాలు జరుగుతుండగానే పోలీసులకి ఓ ఆకాశరామన్న ఫోన్ చేశాడు. ఫలానా వ్యక్తి మీద హత్యాప్రయత్నాలు జరుగుతున్నాయి, పరిగెత్తండని హెచ్చరించాడు. పోలీసులు హుటాహుటిన ఆకాశరామన్న చెప్పిన చోటకి పరిగెత్తారు. ఏంథోని ఇంటిని చుట్టుముట్టి అతని భార్యని, కూతుర్ని అరెస్ట్ చేశారు. ఏంథోని గదిలోకి పరిగెత్తుకెళ్ళి చూస్తే అతనిలో ఇంకా కొనప్రాణం వుంది. వెంటనే అతన్ని ఆస్పత్రికి చేర్చారు. డాక్టర్లు శతవిధాలా ప్రయత్నించి అతని ప్రాణాలు కాపాడారు. అసలీ పెద్దమనిషి బతికేవాడే కాదు. 'ఏదో వాళ్ళావిడ నిద్రమాత్రలు మింగించడం వలన గాయాలనుండి పూర్తిగా రక్తం కారడం ఆగిపోయింది. అందుకే బతికాడు' అని చెప్పారు డాక్టర్లు.

ఏంథోని మరో పదిహేను రోజుల్లో ఆరోగ్యవంతుడై ఆస్పత్రి నుంచి బయటపడ్డాడు. ఇంకా అతని తలలో ఇరుక్కున్న గుండును తొలగించాల్సివుంది. హత్యాప్రయత్నం చేసిన భార్యా కూతుళ్ల మీద కోర్టులో విచారణ జరుగుతోందని తెలిగానే ఏంథోని కోర్టుకి పరిగెత్తాడు. 50 వేల డాలర్లు చెల్లించి వారిని బెయిల్ మీద విడిపించాడు.

ఈ వార్త తెలిసిన జడ్జి, పోలీసులు, పాత్రికేయులు, ప్రజలు షాక్ తిన్నారు. రెండు సార్లు చంప ప్రయత్నించిన భార్యను డబ్బిచ్చి విడుదల చేయించి ఆమెకు అనుకూలంగా సాక్ష్యం చెప్ప నిర్ణయించుకున్న ఆ పతిదేవుడిని చూసి అందరూ 'ఔరా అతనిది ఎంత ఘాటు ప్రేమయో' అని ముక్కు మీద వేళ్ళేసుకున్నారు.

# దయ్యం దోపిడీ

టామ్ విల్‌మోట్ కరడుగట్టిన, క్రూరమైన దారి దోపిడీ దొంగ. తాను దేనికీ, ఎవరికీ భయపడనని ప్రకటించుకున్నాడు కూడా. ఇంగ్లండ్‌లో ఐదుగురు సభ్యులుగల ఒక కుటుంబాన్ని, వారి పనిమనిషినీ హత్యచేసి, ఆ నేరానికిగాను పొరపాటున మరో ఇద్దరు అమాయకులు ఉరితీయబడుతోంటే కులాసాగా నవ్వుతూ చూశాడు. ఆ తర్వాత కొన్ని ఇతర నేరాలకుగాను అతన్ని పట్టిస్తే పెద్ద బహుమానం ఇస్తామని ప్రకటించగా, ఇంగ్లండ్‌లోని చట్టాన్ని తప్పించుకోడానికిగాను స్విట్జర్లాండ్ చెక్కేశాడు.

టామ్ దుర్మార్గుడు, మోసగాడు. అయినా సెన్సాఫ్ హ్యూమర్ వున్నవాడు. స్విట్జర్లాండ్ చేరిన టామ్ ఒక లాడ్జిలో గది తీసుకున్నాడు. లాడ్జి యజమాని ఆ గదిలో రాత్రులు దయ్యం తిరుగుతుంటుందని ముందే చెప్పాడు. ఆ దయ్యం ఒక క్షురకుడిదట. అతను తాను ప్రేమించిన ఓ ఇంటి పనిమనిషి తన ప్రేమను నిరాకరించేసరికి ఆ బాధ భరించలేక తనగొంతు తానే కోసుకుని మరణించాడట. అప్పటినుంచి రాత్రిపూట దయ్యమయి ఒకచేత్తో బేసిన్, మరో చేత్తో రక్తంతో తడిసిన రేజర్ ధరించి గడ్డం చేసే అవసరమున్న మనుషులకోసం వెతుకుతుంటుండట. ఈ కథ విని నవ్వు



కున్నాడు టామ్. ఆ తర్వాత ఆ లాడ్జిలో అంతా డబ్బున్నవాళ్ళే వున్నారన్న విషయం గమనించాడు. వాళ్ళను దోచుకోడానికి తుపాకులకన్నా దయ్యం బాగా ఉపయోగిస్తుందని నిర్ణయించుకున్నాడు.

ఓ రోజున సాయంత్రం భోజనాలు అయ్యాక అందరూ ఓ గదిలో చేరి పేకాట ఆడటం గమనించాడు. బల్లమీద బాగా డబ్బు పోగయ్యాక అతను తన గదిలోకి వెళ్ళాడు. వంటగదిలోంచి తెల్ల బేసిన్ ఒకటి తెచ్చుకున్నాడు. తన గదిలోకి వెళ్ళి గోడకున్న సున్నాన్ని ముఖానికి రాసుకుని దుప్పటి కప్పుకున్నాడు. చేతిని రేజర్‌తో కొద్దిగా కోసుకుని ఆ రక్తాన్ని చేతులకి, బేసిన్‌కి రాశాడు. నెమ్మదిగా చప్పుడు చేయకుండా పేకాట ఆడుతున్న గదివద్దకు వచ్చాడు.

పేకాటలో మునిగిపోయివున్నందున అక్కడివాళ్లు తమకి కాస్త దగ్గరకి వచ్చే వరకూ ఆ దయ్యాన్ని గమనించలేదు. తీరా దయ్యాన్ని చూడగానే గందరగోళం మొదలయింది. ఎవరికి వారు కాలిసత్తువ కొద్దీ పారిపోయారు. దయ్యం వారందరినీ బయటికి తరిమికొట్టింది. అందరూ వెళ్ళిపోయాక దయ్యం వేషంలోవున్న టామ్ నవ్వుకుంటూ పేకాటలో పెట్టిన డబ్బునంతా మూటగట్టుకుని ఆ తర్వాత లాడ్జిలో వున్న మిగిలిన గదులుకూడా వెతికి డబ్బు పోగేశాడు.

మర్నాడు ఉదయం అందరికీ దయ్యం తనను మంచంమీద నొక్కిపెట్టి ఎలా గడ్డం చెయ్యడానికి ప్రయత్నించిందో ఒళ్లు జలదరించేలా వర్ణించి చెప్పాడు. సాక్ష్యంగా తన చేతిమీది గాయాన్ని కూడా చూపించాడు. ఆ దయ్యం బేసిన్‌లో బంగారునగలు, డబ్బు వేసుకొని గోడ లోకి అదృశ్యమవుతుండగా చివరిసారి చూశానని చెప్పాడు. అతని మాటలు ఇట్టే నమ్మేశారు మిగిలినవారు.

వాళ్లందరికీ టోపీవేసి టామ్ హాయిగా దోచుకున్న డబ్బుతో కొత్త గుర్రాన్ని, పిస్టల్‌ని కొని దారిదోపిడీకి బయలు దేరాడు.

స్విట్జర్లాండ్‌లో దోపిడీలు వెలగబెట్టి మళ్లీ ఇంగ్లండ్ చేరాడు టామ్. ఈసారి బకింగ్‌హామ్ డ్యూక్‌నే కొల్లగొట్ట బోయాడు. ఇదే అతని చివరి దోపిడీ. తర్వాత పట్టుబడి 1670 ఏప్రిల్ 30న ఉరితీయబడ్డాడు. అంతటితో అతని కథ ముగిసింది.

## శునకరాజాలు

నమ్మండి నమ్మకపోండి .... కుక్కలు కూడా మాట్లాడతాయి. లండన్‌లోని ఐదేళ్ళ వయసుగల ఓ శునకరాజం ప్రతి ఫోన్‌కాల్‌కు 'హలో' అని మొరుగుతూ జవాబిస్తుంది. ఈ హలో అచ్చం ఆ



కుక్కగారి యజమానురాలు పలికే 'హలో'ను పోలి వుంటుందట. బెన్ నామధేయం గల మరో కుక్కగారు బిస్కట్లు కళ్ళబడినప్పుడల్లా 'నాకో బిస్కట్ కావాలి' అని అరుస్తుందట నిర్మొహమాటంగా. ఈ బెన్‌గారు మాట్లాడేపుడు నాలుకను ఉపయోగించే తీరు, పదాలను స్పష్టంగా పలికే విధానం వెటర్నరీ ఎడ్యుకేషన్ ట్రస్ట్ (జంతు విద్యా సంస్థ) శాస్త్రవేత్తలనే ఆశ్చర్య చకితులను చేసింది.

లండన్ తపాలా ఉద్యోగి బాబ్‌స్మిత్ దగ్గరవున్న వండర్ డాగ్ అనే సార్థక నామధేయురాలైన ఆల్సేషియన్ 'రీటా' బి.బి.సి.లో ప్రదర్శనలు ఇస్తుంది కూడా. ఈమెగారు సమయాన్ని చెప్పడమేగాదు సులభమైన లెక్కలు చేసి 12వ సంఖ్యవరకూ చెప్పగల దిట్ట. ఇందులో ట్రిక్కులేమీ లేవు. ఇదంతా టెలీపతివలన సాధ్యమవుతోంది అని ప్రకటించాడు రీటాయజమాని. రీటా గడియారం వంక చూసి టైము చెబుతుంది. బోర్డుమీద ఆరు ప్లస్ నాలుగు అని రాస్తే జవాబుగా పదిసార్లు అరుస్తుంది. రెండు రెళ్ళెంత అని అడిగితే నాలుగు సార్లు మొరుగుతుంది. ఇలా రెండార్ల పన్నెండువరకూ జవాబు చెబుతుంది.

కుర్వెనెల్ అనే మరో శునకంతో పోలిస్తే రీటా ఆఫ్టర్‌ఆల్ అన్నమాట. నున్నటి జుత్తున్న ఈ శునకరాజంగారిని జంతురక్షణ సొసైటీ అధికారులు క్షుణ్ణంగా పరీక్షించారట. ఈయనగారు 'ఎ' అక్షరానికి ఒకసారి, 'బి'కి రెండు సార్లు, 'సి'కి మూడుసార్లు ఇలా అరుస్తూ ప్రశ్నకు జవాబు చెపుతారట. కుర్వెనెల్‌గారు ప్రశ్నల అర్థాలను అవగాహన చేసుకోడమేగాక పరిశీలన, ఆలోచనాశక్తి కలిగి ఉన్నారని అధికారులు నిర్ణయించారు. ఈ కుక్కగారి తెలివితేటలు 9 ఏళ్ళ పిల్లల తెలివికి సమానంగా వున్నాయట.

కుర్వెనెల్ తాను మనుషుల గురించి ఏమనుకుంటున్నది యజమానితో చెప్పడమేగాక, సంగీతం పరమబోరని, ఫలానా పక్షి పాట చాలా అందంగా వుందని వివరించడమేగాక ఏదన్నా తప్పుపని చేసినపుడు 'ప్లీజ్' అని క్షమించమన్నట్లు చూసేదట. ఇదంతా ట్రిక్కా లేక కుక్కగారి ఒరిజినల్ తెలివేనా అంటే ఏం చెప్పగలం!?

'ఫెలో' అనే పేరున్న డెట్రాయిట్‌కు చెందిన కుక్కకు 400 పదాలు వచ్చుట. కొలంబియా విశ్వవిద్యాలయంలో ఒక ప్రముఖ ప్రొఫెసర్, మరో 72 మంది సైకాలజీ విద్యార్థుల ముందు ఒక గంట పదజాల పరీక్షలో నెగ్గిందట. ఫెలోకి 400 పదాల అర్థాలు తెలుసని తేలిందట. ఫెలోగారిని 'చివరి వరసలో వున్న అమ్మాయి దగ్గరకెళ్ళి ఆమె ఒళ్ళో తల పెట్టు' అనగానే సైగల అవసరం లేకుండానే బుద్ధిగా చెప్పినపని చేసిందట.

బెస్సి అనే ఓ స్కూల్ టీచర్‌గారి కుక్క సులభమైన లెక్కలు చెప్పడమేగాక వివిధ రంగుల్లో రాసిన నంబర్ల మధ్యగల తేడాను గుర్తుపడుతుందట. ఇకపై కుక్కలు కూడా కాలర్లు ఎగరేసుకో వచ్చునన్నమాట.



నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
దంత క్షయాన్ని ఎదుర్కోండి.
Colgate
DENTAL CREAM
Colgate
ఎలాగో చూడండి:
మీ పళ్లలో ఇరుక్కుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.
కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా దొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.
ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుండి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.
కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.
గుర్తుంచుకోండి, ప్రతిసారీ భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.
దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!
GKGE.562.86 TL

మధ్యాహ్నం భోంచేసాక కటికనేలమీద వెల్లకిలా పడుకుని పైకప్పుకేసి చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు గౌతమ్.

ఆలోచనల మధ్య అనుకున్నాడు - "టైమెంతయిందో" అని.

మనస్సు బరువుగా మూలిగింది.

ఒకప్పుడు తన జీవితంలో టైంకెంతో ప్రాధాన్యత ఉండేది. ప్రతి పని టైం ప్రకారం జరగాల్సిందే. లేకుంటే ఎన్నో అప్పాయింట్ మెంట్స్, కార్యక్రమాలు తప్పిపోయే ప్రమాదం ఎదురయేది. అంత పని రద్దీలో ఉండేవాడెప్పుడూ. మరి ఇప్పుడో...? టైంతో నిమిత్తం లేకుండా గడిచిపోతున్నది జీవితం. అసలు తన జీవితానికే విలువ లేకుండా పోయింది.

దీర్ఘంగా నిట్టూర్చాడు గౌతమ్.

అతడుఆ డెత్ సెల్లులో బంధింపబడి దాదాపు పదకొండు నెలలయింది.

ఈ పదకొండు మాసాల జీవితం అత్యంత బాధాకరమయినదీ, భారమయినదీ, దీర్ఘమయినదీ,దుస్సహమయిందీనూ.

క్షణాలు యుగాలుగా గడపటం అంటే ఏమిటో ఇక్కడికి వచ్చాకే అతడికి అర్థమయింది. ఒకప్పుడు పొద్దున అయిదు గంటలకు లేచింది మొదలు రాత్రి పడుకునేదాకా ఊపిరి సలపనంత పని రద్దీలో ఉండేవాడు. హాస్పిటల్, రోగులు, ఆపరేషన్లు...సాయంత్రాలు క్లబ్బు, టెన్నిస్, పార్టీలు, వినోదాలు - తన వ్యక్తిగత సమస్యలను గురించి ఆలోచించేందుక్కూడా తీరిక ఉండేది కాదు. ఇప్పుడు తనవాళ్లకు దూరంగా హంతకుడన్న అపఖ్యాతిని మోస్తూ మృత్యువు రాక కోసం ఎదురు చూస్తూ కటకటాలు లెక్కిస్తూ, మనస్సుని ఛిద్రం చేసే ఆలోచనలతో సతమతమవుతూ, ఈ రాతి గోడలమధ్య దోమలు నల్లులతో సహజీవనం చేస్తూ, ఓహ్....

దుస్సహమయిన తన నిరీక్షణ ఇపుడు దాదాపు పూర్తయినట్టే.

హైకోర్టు, తర్వాత సుప్రీంకోర్టు తన అప్పీలు తోసివేసి మరణశిక్షను ధృవీకరించాయి. ప్రాణభిక్ష పెట్టమని రాష్ట్రపతికి తను దయా విన్నపం చేసుకోలేదు కనక ఆయన నిర్ణయం కోసం ఎదురు చూసే ప్రశ్నే లేదు. తన ఉరిశిక్షను అమలు జరపాల్సిన తేదీ నిర్ణయిస్తూ ఏరోజయినా హోం డిపార్ట్ మెంట్ నుండి జైలు సూపర్నెంటుకి బ్లాక్ వారెంట్ రావచ్చు.

ఆ తర్వాత తన జీవితం గంటల్లోనే!

ఆ ఆలోచనతో గుండెల మీద మంచు ముద్దపెట్టి నొక్కినట్లు ఫీలయ్యాడు గౌతమ్. అతడెంత గుండెనిబ్బరం కలవాడయినప్పటికీ, చావుని ఎదుర్కొనేందుకు తనని తానెంతగా సంసిద్ధపరచుకున్నప్పటికీ చావు తనకతి సమీపంలోకి వచ్చేసిందన్న నగ్న సత్యం అతడిని శాంతికి దూరం చేస్తున్నది. ముఖ్యంగా తన ప్రణయదేవత స్పందనను శాశ్వతంగా వదిలి వెళ్ళిపోవాలనుకుంటేనే దుస్సహమయిన వ్యథతో గిలగిల్లాడిపోతోందతడి మనస్సు. తను ఆమెను ఎంతగా ప్రేమిస్తున్నాడో అంతకు వెయ్యింతలు ఎక్కువగా ఆమె తనను ప్రేమిస్తున్నదన్న నిజం ఈ మృత్యుకూపంలోకి వచ్చాకనే తెలుసుకోగలిగిన తను ఎంత దురదృష్టవంతుడు? ప్రేమ కోసం తపిస్తున్న తనమీద ప్రణయ వర్షం కుంభవృష్టిగా వర్షిస్తున్న సంగతి ఆనాడే తెలుసుకోలేని మందభాగ్యుడు తను! కనకనే ఈనాడీ దుస్థితి...

'స్పందనా! నువ్వు నన్ను ప్రేమి స్తున్న సంగతి ముందే ఎందుకు చెప్ప లేదు?' అనుకున్నాడు వ్యథగా.

హఠాత్తుగా నీరవ నిశ్శబ్దాన్ని తరిమి కొడుతూ దూరంగా కొన్ని జతల బూట్ల చప్పుడు లయబద్ధంగా వినిపిస్తూ క్రమంగా దగ్గరవుతూ వచ్చింది.

చివ్వున లేచి కూర్చున్నాడు గౌతమ్.

అణువణువున అవ్యక్తమయిన ఏదో ఉద్వేగం, అలజడి...

గొంతుకకు ఏదో అడ్డుపడ్డట్లు అనుభూతి.

ఆ సమయంలో జైలు సిబ్బంది ఆ కండెం బ్లాక్‌లోకి రావడం అంటే దాని అర్థం... ఎవరో అభాగ్యుడికి బ్లాక్ వారంట్ తెలియపరచేందుకేనని! ఆ సంగతి ఆ డెత్ సెల్స్‌లో ఆశా నిరాశల మధ్య ఊగులాడుతున్న ఖైదీలందరికీ తెలిసినదే.

'ఆ నిర్భాగ్యుడు ఎవరు?' అనే ప్రశ్న మనసుల్లో భయంకరంగా సుళ్ళు తిరుగు తుండగా భయంగా, దిగులుగా కటకటాలు పట్టుకుని జీవచ్ఛవాల్లా నిలబడిపోతారు వారు.

జైలు సూపరింటెండెంట్ నిరంజనరావు సిబ్బంది సమేతంగా వచ్చి గౌతమ్ సెల్ ముందు నుంచున్నారు.

ఒక వార్డర్ చేతిలో ఇంత పెద్ద రికార్డ్ బుక్...అదిచూసిన గౌతమ్ పెదవులమీద నిర్జీవహాసం.

ఇన్నాళ్ళూ సమాజానికి దూరంగా ఇక్కడ సాలిటరీ కన్‌ఫైన్‌మెంటులో ఉందారు. ఇప్పుడిహ సమాజం నుండి... కాదు...ఈ లోకంనుండే సాగనంపే ప్రయత్నాలు ప్రారంభిస్తారేమో...!

"హల్లో గౌతమ్! హౌ ఆర్ యూ?"

నిరంజనరావు కంఠంలో ఏదో జీర.

"ఫైన్... థాంక్యూ!" ముభావంగా అన్నాడు గౌతమ్.

"భోంచేసావా?"

తల ఊపాడు గౌతమ్.

అతడి వయిపు చూశారు నిరంజన రావు.

ఆయన చూపుల్లో అభిమానం, కరుణ, జాలి, వ్యథ...

దీర్ఘంగా నిట్టూర్చి, "ఈ ప్రశాంత సమయంలో ఒక దుర్వార్త చెప్పవలసి వచ్చినందుకు చింతిస్తున్నాను" అని ఆగారు.

"బ్లాక్ వారెంట్ వచ్చిందా?"సూటిగా అడిగాడు గౌతమ్.

విషాదంగా తల ఊపారు నిరంజన రావు.

"తేదీ?" నిర్వికారంగా అడిగాడు గౌతమ్.

"ఇరవయి అయిదు...."

"ఈరోజు?"

"పదిహేను..."

"అంటే ఇంకా పదిరోజులు...అంటే దాదాపు రెండువందల నలభయిగంటలు గడపాలన్నమాట" ఏదో ఆలోచిస్తూ అన్నాడు గౌతమ్.

"అయామ్ టెర్రిబ్లీ సారీ" చిన్నగా అన్నారు నిరంజనరావు.

"మధ్యలో మీరేం చేస్తారు. నేను చేసిన నేరానికి శిక్ష అనుభవించక తప్పదుగా" నిర్లిప్తంగా అన్నాడు గౌతమ్.

అతడి ముఖంలో కనిపిస్తున్న నిర్లి ప్తత నిరంజనరావుకి విభ్రాంతి కలిగిం చింది. జైలు ఉద్యోగిగా ఆయనకు దాదాపు ముప్ఫయ్యేళ్ళ సర్వీసు ఉంది. ఈ ముప్ఫయ్యేళ్ళలో మనిషి రక్తంతాగే

నరరూపరాక్షసులు, కూలీకి ఖూనీ చేసే హంతకులు, దోపిడీదొంగలు, చదువు సంస్కారాలు ఉన్నవాళ్ళు, పొట్టకోస్తే అక్షరం ముక్కరానివాళ్లు, పొద్దున్న లేచింది మొదలు రాత్రి పరుండేదాకా సూక్తులు వల్లించే వేదాంత శిఖామణులు, ఇంకా ఎందరినో చూసారు. ఎవరయి నప్పటికి తనను ఫలానారోజు ఫలానా సమయంలో ఉరితీస్తారన్న దుర్వార్త తెలిసిన క్షణం మనస్సు చెదిరిపోయి 'వీల్లేదు వీల్లేదు' అని ఆక్రోశిస్తూ నుంచున్న చోటనే కూలిపోతారు. నూటికి తొంభయి మందికి ఆక్షణమే సగంప్రాణం పోతుంది. ఇతదేమిటి ఇంత నిర్లిప్తంగా, నిర్వికారంగా ఉన్నాడు? ప్రాణాలమీద తీపిలేదా? లేక వైరాగ్యభావం ముదిరిపోయిందా? జైలు డాక్టర్ గౌతమ్ పల్స్‌రేటు, బి. పి. చెక్ చేసాడు.

నార్మల్‌గా ఉంది.

డాక్టర్ మొహంలోనూ కించిత్ విస్మయం....

సాధారణంగా ఆ సమయంలో భయోద్వేగం వలన బి. పి. పెరుగుతుంది. పల్స్‌రేటులో మార్పు కనపడుతుంది. మానసికంగా దుర్బలులయిన వారికి స్పృహ తప్పడం కూడా జరుగుతుంది. కాని గౌతమ్‌లో ఎటువంటి మార్పూలేదు. ఎప్పట్లాగే నిర్వికారంగా నిశ్చలంగా ఉన్నాడు.

"మీ అన్నయ్యకు టెలిగ్రాం ఇచ్చాను" నిరంజనరావు అన్నారు.

"థాంక్యూ!" ఉదాశీనంగా అన్నాడు గౌతమ్.

"పిలునామా...?"

"అన్ని వ్యవహారాలు ఎపుడో సెటిల్ చేసేసాను"

"ఎవరికయినా ఉత్తరాలు రాయదలచుకుంటే చెప్పు. కవర్లు తెప్పించి పెట్టాను"

"నో థాంక్యూ!"

"ఏదయినా తినాలని ఉంటే..."

"మామూలుగా మీరిచ్చే భోజనమే చాలు" నిరంజనరావుగారి మాటలు తుంచేస్తూ అన్నాడు గౌతమ్

"భగవద్గీత..."

"చదివే ఆసక్తి లేదు"

'స్ట్రేంజ్ ఫెలో!'

గౌతమ్ వయిపు పరిశీలనగా చూస్తూ అనుకున్నారు నిరంజనరావు. కాసేపు తర్వాత సిబ్బంది సమేతంగా వెళ్ళిపోయారాయన.

వెళ్ళే ముందు త్రీఫైవ్స్ సిగరెట్ పాకెట్టు ఇచ్చారు.

"థాంక్యూ" అని అందుకున్నాడు గౌతమ్.

నిజానికి సిగరెట్టు కోసం తపించిపోతున్నది అతడి మనస్సు.

అందరూ వెళ్ళిపోయాక మళ్ళీ నేల మీద పడుకుని సిగరెట్ వెలిగించాడు.

సాధారణంగాబలహీనమనస్కులయిన నేరస్థులతో వాళ్ళ ఎక్సిక్యూషన్ సంగతి ముందుగా చెప్పరు. కానీ దృఢచిత్తులకు పదిరోజులు ముందే చెప్పేస్తారు. కొందరికి ఆస్తి తదితర వ్యక్తిగత సమస్యలు పరిష్కరించవలసిన అవసరం ఉంటుంది. ఆ సౌలభ్యం కోసరమే ముందుగా చెప్పడం జరుగుతుంది. అయితే ఖైదీ ఎంత గుండె నిబ్బరం కలవాడయినప్పటికీ ఫలానారోజు, ఫలానా సమయంలో ఉరి తీస్తారన్న నిజం తెలిసాక అతడిలో అనూహ్యమైన మార్పు వస్తుంది. పుట్టి బుద్దెరిగింది మొదలు పొరపాటుగానయినా

భగవంతుడిని స్మరించనివాడు అపర భక్తుడవుతాడు. ఇరవయి నాలుగ్గంటలూ భగవన్నామ స్మరణలోనే గడుపుతాడు. కొందరు మృత్యుభయంతో తల్లడిల్లుతూ, మూగగా రోదిస్తూ దయనీయమైన స్థితిలో ఉంటారు. మరికొందరు జరిగేది జరక్క మానదు, భయపడి ప్రయోజనమేమిటను కుని గుండె నిబ్బరం చేసుకుని చావునెదు ర్కొనేందుకు తమని తాము సంసిద్ధం చేసుకుంటారు. కొందరు చివరిక్షణందాకా ఏదో విచిత్రంజరిగి తమ ఉరిశిక్ష రద్దు కావచ్చునన్న ఆశాభావంతో ఉంటారు. కొందరికి భయాందోళనలు తీవ్రమైనందుకున్న ఫలితంగా మతిస్థిరం తప్పడం



జరుగుతుంది. ఏది ఏమయినప్పటికీ దాదాపు అందరూ ఈ చరమదశలో తాము చేసిన తప్పులు, నేరాలు, హత్యలు తలచుకుని తలచుకుని పశ్చాత్తాపంతో కృంగిపోతారు. అయితే గౌతమ్‌లో అటు వంటి భావమే ఏర్పడలేదు.

"గౌతమ్!"

ఆర్ద్రంగా పిలుపు వినిపించి ఆలో చనలనుండి బయటపడి చూసాడు గౌతమ్.

ఎదురుగా స్పందన!

"హల్లో డార్లింగ్. గుడీవెనింగ్" చిరునవ్వుతో గ్రీట్ చేసాడు గౌతమ్.

అతడివంక నిర్నిమేషంగా చూసింది స్పందన.

కంఠాన్ని ఉరితాడు కావలించుకుని ఉండగా ఇంత ప్రశాంతంగా నవ్వగలగడం ఒక్క ఇతడికే చాతనవునేమో.

"కబురు తెలిసిందా?" అదే చిరు నవ్వుతో అడిగాడు గౌతమ్.

ఇక ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడవ సాగింది స్పందన.

ఆమె తలమీద చెయ్యి ఉంచాడు గౌతమ్.

''ఏయ్, సిల్లీ. ఏడుస్తున్నావా?" లాలనగా అన్నాడు.

''నాకు ఏడుపే మిగిలింది" ఏడుస్తూనే అంది స్పందన.

"నాకు ధైర్యం చెప్పాల్సిందిపోయి నువ్వే ఏడిస్తే ఎలా?"

అతడి చేతుల్లో మొహం దాచుకుంది స్పందన.

"మనిషి జీవితం ఎంత అశాశ్వత మయిందో డాక్టరువైన నీకు తెలీదా? పుట్టిన ప్రతిఒక్కరూ చావకతప్పదు. కాకుంటే కాస్త ముందు వెనకలవుతుంది. అంతేగా!"

"కానీ...కానీ..." దుఃఖం స్పందనను మాట్లాడనివ్వలేదు.

"నాది బలవన్మరణం. అదేగా నీ బాధ. చావు ఎవరికి ఎలా రావలసి ఉంటుందో అలాగే వస్తుంది. బాధపడి ప్రయోజనమేమిటి?''

అనునయింపబడవలసిన వ్యక్తి అనున యిస్తున్నాడు.

ఎంత విచిత్రం!

దుఃఖిస్తున్న స్పందనను చూస్తుంటే ఎన్నో చేదుఅనుభవాలతో కఠినమయిన గౌతమ్ హృదయం విచలితమైంది.

ఈ నరకంలోకి వచ్చిపడిన ఈ పది కొండు నెలలుగా ఈ రాగమయి తనకి కంఠగానిలిచి, తన తప్తహృదయానికి ఎంతో ఉపశమనం కలిగిస్తున్నది. ఒక్క తల్లి, తోబుట్టువులు అందరూ తనంటే దయగా, ఆదరణగానే ఉంటున్నారు. అయినప్పటికి వ్యక్తావ్యక్తంగా తనుచేసిన నేరం గుర్తుచేస్తూనే ఉంటారు. 'చేయరాని నేరంచేసి నిప్పులాంటి వంశానికి తీరని కళంకం తెచ్చావు. సాటివారిలో తలెత్త నివ్వకుండా చేసావు' అన్న ధోరణి వాళ్ళ మాటల్లో స్పష్టాస్పష్టంగా వ్యక్త మవుతూనే వుంటుంది. ఒక్క స్పందనే తనలో హంతకుడిని చూసే ప్రయత్నం చేయలేదు. ఒక్క ఆమె సమక్షంలోనే తను ఉరిశిక్ష పొందిన ఖైదీనన్న సంగతి మరచిపోతాడు. ఆమె ఉన్నంతసేపూ తను ఒక ప్రేమికుడు, ఆమె ప్రేయసి. అనురాగపూరితమయిన మాటలుమనసుని పన్నీటిజల్లులయి హాయి గొలుపుతూంటే తన నిజస్థితిని ఆ కాసేపూమరచిపోతాడు.

కష్టాలు చుట్టుముట్టినపుడే ఆత్మీయు లనుకున్నవారి నిజస్వరూపాలెటువంటివో తెలుస్తుందంటారు. తను నేరం చేసాడు.

సభ్యసమాజం క్షమించని ఘోరాపరాధం చేసాడు. తనుచేసింది నేరంకాదనీ, తనని సమర్థించి అందరూ తనని తమలో కలి పేసుకోవాలనీ తను ఎన్నడూ ఎదురు చూడలేదు. అయితే తన గాలి సోకితేనే తమ బతుకు కలుషితమయి పోతుందేమో అన్నట్లు దూరం దూరంగా ఉండిపోతున్న ఆ ప్తమిత్రులనుకున్న వారి ప్రవర్తన మాత్రం అసలే గాయపడిన తన హృద యానికి మరింతగా గాయపరుస్తున్నది.

"గౌతమ్!"

"ఆలోచనల్లోంచి బయటపడి స్పందన వేపు చూసాడు.

ఆమె గుండెల్లో ప్రణయ దీపమై వెలుగుతున్న తనెంత అదృష్టవంతుడు. మరొకరిని జీవితంలోకి ఆహ్వానించడం ఇష్టంలేక పెళ్ళిమాటే తలపెట్టక వంటరిగా మిగిలిపోయిన ఈ అనురాగమయి తనకు పెళ్ళికాకముందే తారసపడి వుంటే తన జీవితంలో ఈ అవాంఛనీయ పరి ణామాలు ఏర్పడి ఉండేవికావేమో. ప్చ్... ఇప్పుడేమనుకుని ఏం ప్రయోజనం?

స్పందన వయిపు చూడసాగాడు.

కనుగవ శ్రావణ మేఘాలయి వర్షి స్తుండగా అతడినే చూస్తున్నది స్పందన.

"సారీ డార్లింగ్. నిన్ను మరీ ఏడి పిస్తున్నాను" ఆర్ద్రంగా అన్నాడు.

అదురుతున్న పెదవులు కొరుకుతూ అలాగే మౌనంగా చూస్తున్నది స్పందన.

గౌతమ్ కూడా మరి మాట్లాడే ప్రయత్నం చేయలేదు.

పరస్పరం ఎంతగా కోరుకుంటున్న ప్పటికీ చేరువకాలేని ఆ దురదృష్టవంతులు హృదయాలు మూగగా రోదిస్తుంటే ఒకరివయిపొకరు ఆర్తిగా చూసుకుంటూ బాహ్య ప్రపంచాన్నే మరచారు.

"బేబీ, ఇంకా ఇక్కడే ఉన్నావా?" అంటూ వచ్చాడు నిరంజనరావు.

తండ్రి వచ్చారంటే ప్రియుడిని వదిలి వెళ్ళే సమయం ఆసన్నమయిందన్న మాట.

స్పందనను మళ్ళీ దుఃఖం చుట్టేసింది.

"అరే, నువ్వు మరీ ఇంత బేలవను కోలేదు. విడిపోయే స్నేహితుడికి నవ్వుతూ గుడ్‌బై చెప్పాలని తెలీదూ?" లాలనగా అన్నాడు గౌతమ్.

ఏడ్చేసింది స్పందన.

"స్పందనా! నువ్విలా ఏడుస్తుంటే నాకు మనశ్శాంతి ఉండదు. ప్లీజ్... ఊరుకో" మళ్ళీ లాలనగా అన్నాడు గౌతమ్.

ఆ ప్రేమికులను చూస్తున్న నిరంజన రావు మనస్సు బరువెక్కిండి.

గౌతమ్ ఉరిశిక్ష పొంది ఇక్కడికి వచ్చినప్పటినుండి కూతురు మూగగా అనుభవిస్తున్న క్షోభ ఆయన గుండెలను పిండేస్తున్నది. తన ముద్దుల కూతురు జీవి తంలో ఈ శోకం శాశ్వతంగా నిలిచి పోతుందేమోనని ఆయన పితృహృదయం తల్లడిల్లుతున్నది. గౌతమ్ సమక్షంలో ఉన్నకొద్దీ ఆమె దుఃఖం మరింత ఎక్కు వవుతుందని బలవంతంగా ఇంటికి తీసుకు పోయారు.

వెళ్ళేముందు స్పందన అంది "రాత్రికి కేరియర్ పంపుతాను. ప్లీజ్ కాదనకండి"

వెళ్తున్న స్పందన వయిపు బాధాతప్త నేత్రాలతో చూస్తూ అలాగే నిలబడి పోయాడు గౌతమ్.

ఆలోచనలలా అనంతంగా కొనసాగు తుండగానే కేరియర్ వచ్చింది.

జైలు సూపరెంటెంట్ ఇంటినుంచే వచ్చి నప్పటికీ ఆ ఆహారం కూలంకషంగా

పరిశోధింపబడి ఉంటుందని గౌతమ్‌కి తెలుసు. నిర్వేదంగా నవ్వుకుని కేరియర్ తెరిచాడు.

అతడికెంతో ఇష్టమయిన చికెన్ సాండ్ విచెస్, పరోటాలు, ఫిష్ ఫ్రై, పొటాటో చిప్స్, పిస్తా అయిస్‌క్రీం.

తన గుండెల్లో అనురాగమంతా రంగరించి స్పందనే అవన్నీ చేసి ఉంటుందని అతడికి తెలుసు. అందుకే ఆప్యాయంగా తిన్నాడు.

ఎంతో తృప్తి...

పడుకుని సిగరెట్ వెలిగించిన అతడి మనస్సులో సుళ్లు తిరుగుతూ ఆలోచనలు ...

విధి విచిత్రమయిందంటారు. ఎంత నిజం.

భార్యగా తన జీవితంలోకి అడుగు పెట్టిన స్త్రీకి తనేమీకాడు. తన ఇష్టాలేమిటో, అభీష్టాలేమిటో, అభిరుచులేమిటో తెలుసుకునే ప్రయత్నమే చేయలేదామె! తన సమస్యలతో, సుఖదుఃఖాలతో నిమిత్తంలేకుండా దూరందూరంగా ఉండిపోయింది. ఒక్క రూపంలోతప్ప తక్కిన అన్ని విషయాల్లో ఆమెకన్న ఉన్నతురాలయిన మరో స్త్రీ తనను ఆరాధిస్తున్నది. తనే ప్రాణంగా బతుకుతోంది. తనకోసం రేయింబవళ్ళు అశ్రువులు చిందిస్తూ జీవితాన్ని విషాదభరితం చేసుకుంటోంది.

గౌతమ్ మనస్సు వికలమయింది. ఆ రాగమయిని ఈ జన్మలో తను కలుసుకోలేడు. ప్చ్...తను ఆశించిన సంసార సౌఖ్యం లభించకపోగా అతి నికృష్టమయిన చావు తనకోసరం కాచుకునుంది.

ఉరితాడుకి వేలాడుతూ గిలగిల్లాడుతున్న తన రూపం అతడి అంతర్నేత్రాలముందు గోచరించింది.

అతడి పిడికిళ్లు బిగుసుకున్నవి.

ఉన్నత వంశంలో పుట్టి సర్జనుగా సమాజంలో ఎంతో ఉన్నతంగా హోదాతో బతికిన తను హత్యానేరానిగ్గాను ఉరితియ్యబడతానని కలలోనయినా ఊహించాడా?

ఈనాటి తన దుర్దశకు కారణం...?

లావణ్య!

ఆగ్రహావేశాలతో అతడి మొహం ఎర్రబడింది.

లావణ్య...

తన జీవన సహచరి, తన అడుగులో అడుగువేస్తూ తన సుఖదుఃఖాలు పంచుకుంటూ, తన తోడుగా, నీడగా, భార్యగా, ప్రియురాలుగా, నెచ్చెలిగా, అభిమానంతో, అనురాగంతో తనని లాలిస్తూ, మురిపిస్తూ మనస్సు, దేహం సర్వస్వం తనకర్పించి తనే సర్వస్వంగా బతకాలని ఎంతగా ఆశించాడు.

ఆమె మెళ్ళో మూడుముళ్లు వేస్తూ ఆమెతో జీవితాన్ని ఎంత సుందరంగా, దీప్తిమంతంగా ఊహించుకున్నాడు. పాలు నీళ్ళలా ఇద్దరి జీవితాలు కలిసిపోయి సంసారసుఖాలు సంపూర్తిగా అనుభవించాలని ఎంతగా ఆకాంక్షించాడు.

తమ ఇల్లు ఒక స్వీట్‌హోమ్‌గా భాసిల్లాలని ఎంతగా కోరుకున్నాడు.

కానీ జరిగిందేమిటి ?

గౌతమ్ అణువణువు కోపంతో ప్రజ్వరిల్లింది.

తన జీవితాన్ని నందనవనం చేయవలసిన భార్య తన జీవితంతో ఆడుకుంది. తనను దారుణంగా వంచించింది. తన ఆశల సౌధాన్ని నిలువునా కూల్చేసింది.

అతడి స్థానంలో మరో మగాడుంటే

ఏం చేసేవాడోకానీ తను లావణ్యను హత్య చేసి అత్యల్పంగానే శిక్షించాననిపించింది గౌతమ్‌కి.

ఆమె తనకు చేసిన ద్రోహానికీ, వంచనకు అంతకన్నా ఎలా శిక్షించాలో అతడికాసమయంలో స్ఫురించలేదు.

ఆనాటి ఆవేశానికి ఫలితమే తను ఉరి కంబం ఎక్కవలసి రావటం!

అశాంతిగా, ఆరాటంగా అటు ఇటు పొర్లాడు.

ఆ రాత్రికిహ నిద్రాదేవి తన దరి చేరదని తెలిసిపోయింది.

చీకట్లోకి చూస్తూ గతంలో కలసి పోయిన తన జీవితంలో సంఘటలను నెమరువేసుకుంటూ నిశ్శబ్దంగా పడు కున్నాడు.

ఔట్ పేషెంట్‌లో అడుగుపెడుతూ చేతి గడియారంలో టైం చూసాడు గౌతమ్. ఏడూ నలభయ్.

అంతకు ముందే వచ్చేసిన డాక్టర్లు రవీంద్ర, శేషగిరి, గోపాలరావులను ఉత్సాహంగా గ్రీట్ చేస్తూ వెళ్ళి తన సీట్లో కూర్చున్నాడు.

చామనఛాయగా ఎత్తుగా, బలిష్ఠంగా ఉండే గౌతమ్ గొప్ప అందగాడేంగాదు. కాని ఆడపిల్లను ఇట్టే ఆకట్టుకునే ఏదో ఆకర్షణ ఉంది. అది అతడి ఎత్తుకావచ్చు. ఆరోగ్యం కావచ్చు. అణువణువున చిందులువేస్తున్న మగసిరి కావచ్చు. అస్తమానం నుదుటిమీదికి పడుతూ అల్లరి చేసే అందమయిన నొక్కుల జుట్టుకావచ్చు. విశాలమయిన ఛాతీ కావచ్చు. విజ్ఞానంతో దీప్తిమంతమయిన కళ్ళు కావచ్చు. తన వృత్తిపట్ల అతడు చూపే శ్రద్ధ, గౌరవాలు కావచ్చు. అతడి ప్రవర్తనలో హుందాతనం, నడకలో ఠీవి, ప్రతి కదలికలో ప్రస్ఫుటంగా కనిపించే చురుకు దనం, టెన్నిస్‌లో అతడికున్న నైపుణ్యం.. కారణం ఏమయినప్పటికీ హాస్పటల్లో పెళ్ళికాని లేడీ డాక్టర్లు, నర్సులు, మెడికల్ కాలేజీ విద్యార్థినులు....చాలామంది అతడి కేసి ఆకర్షితులయ్యారంటే అతిశయోక్తి కాదు.

వాళ్ళకు తనపట్ల ఉన్న గ్లామర్‌ని తనకనుకూలంగా మలచుకునేందుకు గౌతమ్ ఎన్నడూ ప్రయత్నించలేదు. తన కొలీగ్స్ కొందరు నర్సులతో హద్దులు మీరి చనువుగా ఉంటారని అతడికి తెలుసు.తను ఊ అంటే 'అఫేర్'సాగించేందుకు కొందరు సుముఖంగా ఉన్న సంగతీ అతడికి తెలుసు. అయితే అతడికి జీవితంపట్ల నిర్దిష్టమయిన అభిప్రాయాలున్నవి. యవ్వనంలో ఉన్న పురుషులందర్లాగే అతడికీ సెక్స్ అన్నా, స్త్రీ అన్నా ఎంతో ఆసక్తి ఉంది. అయితే 'సెక్స్ ఓన్లీ ఆఫ్టర్ మేరేజ్' అన్న సిద్ధాంతానికి కట్టుబడి ఎన్ని అవకాశాలు ఎదురయినప్పటికీ మనస్సును అదుపు తప్పి పోనివ్వలేదు"

"ఈరోజుల్లో ఆడపిల్లలే దొరికిన అవకాశా లను 'కాష్' చేసుకుంటూ జీవితాల్ని జోరుగా హుషారుగా గడిపేస్తుంటే నువ్వే మిటోయ్ ఇలా అపర ప్రవరాఖ్యుడిలా మడికట్టుకు కూర్చుంటావు" అని స్నేహి తులు ఎద్దేవా చేసినప్పటికీ చలించలేదు. అందుకే అతడికి హాస్పటల్లో మంచి పేరు.

"గౌతమ్! మీ చెల్లాయి కలవరిస్తోంది. ఓసారి ఇంటికి వచ్చి పలకరించిపోరాదూ?" అన్నాడు రవీంద్ర.

"నిజమే..చెల్లాయిని చూడక పదిహేను రోజులు పైనే అయింది. వీలయితే సాయంత్రం వస్తానని చెప్పు...."

"నో...నో! ఈ రాత్రి నువ్వు మాకు

అతిథివి"

"తప్పదంటావా?" నవ్వి అన్నాడు గౌతమ్.

"మరేం పర్లేదు. ఈరోజు మా కోసం టెన్నిస్ మానెయ్!"

"ఇంటల్లుడివి. నువ్వాజ్ఞాపించాక తప్పుతుందా? అలాగే వస్తాను" చిర్నవ్వుతో అన్నాడు గౌతమ్.

సాయంత్రం గౌతమ్ వెళ్ళేటప్పటికి స్వప్న పిల్లలిద్దరిని కూర్చోబెట్టి చదివిస్తోంది. అన్నగారిని చూడగానే ఆమె మొహం విప్పారింది.

"రా అన్నయ్యా" అంటూ ఉత్సాహంగా ఆహ్వానించింది. "అంకుల్" అంటూ పిల్లలు అతడిని చుట్టేసారు.

వాళ్ళ చేతికి చాకొలెట్ టిన్ ఇచ్చి ఇద్దరినీ చెరో వేపు కూర్చోబెట్టుకుని, "ఏమిట్రా విశేషాలు?" అన్నాడు గౌతమ్.

సుధీర్, సునీల్ కవల పిల్లలు. వయస్సు అయిదేళ్లు. బొద్దుగా, ఆరోగ్యంగా ముద్దొస్తుంటారు. గౌతమ్‌కి వాళ్ళంటే ప్రాణం. వాళ్ళతో సమానంగా అల్లరిచేస్తూ నవ్వుతూ తుళ్ళుతూ, కేరింతలు కొడుతూ ఆడుకుంటాడు. వాళ్ళు చెప్పే కబుర్లు ఓపిగ్గా వింటాడు. పుట్టిన రోజనీ, చిల్డ్రెన్స్‌డే అనీ, క్రిస్మస్ అనీ, దీపావళి అనీ ఎప్పుడూ ఏవేవో కానుకలు తెస్తుంటాడు. వాళ్ళక్కూడా గౌతమ్ మామయ్యంటే ఎంతో ఇష్టం.

పిల్లలు చెప్తున్న స్కూలు కబుర్లు వింటూ "బావ ఏరీ?" అనడిగాడు గౌతమ్.

"స్నానం చేస్తున్నారు" అతడి చేతికి నిమ్మరసం ఇస్తూ అంది స్వప్న.

"ఏమిటి విశేషాలు?" నిమ్మరసం సిప్‌చేస్తూ అన్నాడు గౌతమ్.

"మాంచెస్టర్‌లో జరిగిన మూడవ టెస్టులో ఇండియా క్రికెట్ జట్టుమీద ఎమ్.సి.సి. జట్టు ఘన విజయం సాధించింది. ఈ నెలాఖర్లో ప్రధానమంత్రి అమెరికా సందర్శించవచ్చు. ఈ సంవత్సరం జ్ఞానపీఠ అవార్డు మహాదేవివర్మకు లభించింది. రాష్ట్ర నీటిపారుదల శాఖ మంత్రిగారు రేపు విశాఖపట్టణం విజయం చేస్తున్నారు...."

పకపకమని నవ్వాడు గౌతమ్. "తల్లీ! నేను అవి అడగలేదు. మీ 'స్వీట్ హోం' విశేషాలు చెప్పు!"

"మా స్వీట్ హోం ఎప్పట్లాగే ఆనంద నిలయంగా ఉంది"

జవాబు చెప్పిన స్వప్న మొహంలో ఎంతో సంతృప్తి. అంతకు మించిన సంతోషం.

చెల్లెల్ని చూస్తున్న గౌతమ్ హృదయం అనురాగంతో పొంగిపొరలింది.

చామనఛాయకు తెలుపుకి మధ్యస్థంగా ఉండే శరీరఛాయతో, చక్కటి అవయవ సౌష్టవంతో సంసారపక్షంగా ఉండే స్వప్న స్వభావరీత్యా గంభీర స్రవంతి లాంటిది. ఆమె మాటల్లో, ప్రవర్తనలో పొరబాటుగానయినా అల్పత్వం గోచరించదు. ఒక మహారాణిలో కనిపించే నిండుదనం, గాంభీర్యం కనిపిస్తుంది. ఈనాడు చాలామంది స్త్రీలలో కనిపించే పెడసరితనం ఆమెలో మచ్చుకయినా కనిపించదు. అన్నిటిని మించి ఆమె భర్తను ప్రేమించే తీరు గౌతమ్‌ని ముగ్ధుడిని చేస్తుంది. నది సాగరంలో సంగమించే రీతి ఆమె అతడిలో కలిసిపోయింది. ఆమె జీవితం అతడి జీవితంతో పెనవేసుకుపోయింది. ఆమె వ్యక్తిత్వం అతడి వ్యక్తిత్వంలో అంతర్లీనమయింది. ఆమె

ఇష్టాలు, అభీష్టాలు, రుచులు, అభిరుచులు ఆశలు, ఆశయాలు - అతడి ఇష్టాలు, అభీష్టాలు, రుచులు, అభిరుచులు, ఆశలు, ఆశయాలతో సమ్మిళితమయింది. ఒక్క మాటలో చెప్పాలంటే ఆమెకంటూ ప్రత్యేక జీవితం లేదీనాడు. భర్తే సర్వస్వంగా, పిల్లలే ప్రపంచంగా, ఇల్లే కైలాసంగా బతుకుతున్న ఇల్లాలు. భర్తవేరు, తనువేరు అన్న ధ్యాసలేని ఉత్తమఇల్లాలు. భర్తను సుఖపెట్టడమే ఆమె జీవితలక్ష్యం. భర్తకు నచ్చిన విధంగా తనను, తన వ్యక్తిత్వాన్ని, తన ఇంటిని తీర్చిదిద్దుకుంటూ-సంసారంలో కలతలు,కీచులాటలు రాకుండా సంసారాన్ని స్వర్గధామం చేసుకోవడం ఎలాగో ఆచరణలో చూపుతున్న ఆదర్శగృహిణి. కాస్తకూస్త చదువుకున్న ప్రతి ఆడపిల్ల 'ఆడదేం తక్కువ. మగాడేం ఎక్కువ' అంటూ వితండవాదం చేసే ఈరోజుల్లో ఎమ్మే చదువుకున్న స్వప్న తనను తాను సంపూర్తిగా భర్తకు,సంసారానికి అర్పణచేసుకోవడం నిజంగా అపురూపం. ఆమె తననుతానే సంసారానికి అంకితం చేసుకుంది కనకనే పెళ్ళికి ముందు స్వేచ్ఛగా తిరిగిన రవీంద్ర పెళ్ళయాక కలలోనయినా మరో స్త్రీకి చోటివ్వకుండా జాగ్రత్త పడ్తున్నాడు. అట్టే రూపసికాని భార్యను ప్రాణాధికంగా ప్రేమిస్తున్నాడు. కలలోనయినా భార్య మనస్సునొప్పించడం అతడికిష్టంఉండదు. అందుకే వారంలో ఆరు రోజులు, రోజులో పద్దెనిమిది గంటలు హాస్పిటల్ ధ్యాసలోనే ఉన్నా ఏడవ రోజు పూర్తిగా భార్యా బిడ్డలతోనే గడుపుతాడు. ఆరోజు వారికి పండగలా గడిచిపోతుంది.

భార్యాభర్తలందరూ తన చెల్లెలు,బావగారిలాగే ఉంటే సంసారాల్లో అసలు కలతలే రావేమో...ప్రతి గృహమూ ఒక స్వీట్ హోంగానే భాసిల్లుతుందేమో!

"అన్నయ్యా!"

ఉలిక్కిపడి చూసాడు.

"ఏమిటంతదీర్ఘంగాఆలోచిస్తున్నావ్?" అన్నగారిని వింతగా చూస్తూ అడిగింది స్వప్న.

"ఏమీ లేదు .... ఇందాక ఏమిటి అడిగావు?"

"ఇంట్లో అందరూ కులాసా?"

"ఆఁ. అందరూ నిక్షేపంగా ఉన్నారు...."

స్నానం చేసి వచ్చాడు రవీంద్ర. తల తుడుచుకుంటూ గౌతమ్ పక్కనే కూర్చుని "స్వప్నా! వేడిగా ఓ కప్పు టీ కావాలోయ్" అన్నాడు.

"అన్నయ్యా.... నీకు?"

"నో.... థాంక్యూ!"

స్వప్న టీ తెచ్చేందుకు వెళ్ళిపోయింది.

రవీంద్ర వచ్చాక గదిలో ఉత్సాహం రెట్టింపయింది.

హాస్పిటల్లో ఎవరితోనూఅట్టేమాట్లాడక గంభీరంగా ఉండే రవీంద్ర ఇంట్లో తద్భిన్నంగా ఉంటాడు. గలగల మాట్లాడుతూ నవ్వుతూ తుళ్ళుతూ హుషారుకి మారుపేరులాగుంటాడు.

"అన్నట్లు గౌతమ్! నీకో విషయం తెలుసా?" భార్య చేతి నుండి టీ అందుకుంటూ అన్నాడు రవీంద్ర.

"ఏమిటి బావా?"

"మా తమ్ముడు ఐ. ఎ. ఎస్. కి సెలక్టయాడు" సంతోషంగా అన్నాడు రవీంద్ర.

"నిజమా?"

"ఊఁ...ఫోర్త్ రాంక్ వచ్చింది."

"అంటే ఫారిన్ సర్వీస్‌కి వెళ్తాడన్న

మాట. అదృష్టవంతుడు!"

"ఊహ తెలిసింది మొదలు వాడు ఐ.ఎ.ఎస్.కే వెళ్ళాలని ఆకాంక్షించేవాడు. అనుకున్నది సాధించడం కోసం ఎంతో కృషిచేశాడు. దేవుడి దయవలన వాడి కృషి ఫలించింది. అనుకున్నదిసాధించాడు ఇహ వాడికి తిరుగులేదు"

రవీంద్ర కంఠంలో సంతోషం పర వళ్ళు తొక్కుతున్నది.

ఒక వ్యక్తి విజయం ఒక్క అతడికే కాదు – అతడి ఆత్మీయులందరికీ సంతోష కారణమవుతుందని ఆ క్షణం రవీంద్రను చూస్తే అర్థమవుతుంది.

తర్వాత వారి సంభాషణ క్రికెట్ మీదికి మరలింది. తర్వాత టెన్నిస్, మెడిసిన్, సినిమా, పాలిటిక్స్....అన్నీ ఆ సంభాషణలో చోటు చేసుకున్నాయి. మాట్లాడుతూనే భోజనాలకు కూర్చున్నారు.

భోజనాలయాక వక్కపొడి ఇస్తూ– "అన్నట్లు చెప్పడం మరచిపోయాను. మొన్న మాధవి వచ్చి వెళ్ళింది" అంది స్వప్న.

"ఎలా ఉందిట?" అనాసక్తిగా అడి గాడు గౌతమ్.

"కొత్త కాపరం కదా... తియ్యగా హాయిగానే ఉంటుంది" అని నవ్వింది స్వప్న.

గౌతమ్ మాట్లాడలేదు.

స్వప్న మళ్ళీ అంది– "ప్చ్, మాధవిని కాదని నువ్వు పొరబాటు చేశావేమో అన్నయ్యా! అన్నివిధాలా తను నీకు ఈడుజోడుగా ఉటుంది. గుణవంతురాలు. అన్నిటిని మించి నువ్వంటే ఆరాధన. ఆమె సాహచర్యంలో నువ్వు తప్పక సుఖ పడి ఉండేవాడివి....."

"స్వప్నా! పెళ్ళయిన స్త్రీ గురించి మనం అలా మాట్లాడుకోవడం తప్పు కదూ!" మందలింపుగా అన్నాడు గౌతమ్.

"నిజమే! కానీ మంచి సంబంధం తప్పిపోయిందన్న బాధనిత్యం తొలుస్తూనే ఉంది" విచారంగా అంది స్వప్న.

"పోనిద్దూ, దేశంలో అంతకన్న మంచి సంబంధాలు ఇంకా చాలానే ఉన్నాయ్!" నిర్లక్ష్యంగా అన్నాడు గౌతమ్.

"నిజమే. అమ్మాయిలు చాలామందే ఉన్నారు.. కాదనను కాని ఎవరూమాధవికి సాటిరాలేరు"

"మాధవి... మాధవి.... మాధవి! ఆమెలో మీరంతా ఏంచూసి ఇంతగా కొట్టుకుపోతున్నారు?"

"ఒకస్త్రీలో ఉండదగ్గ మంచి గుణా లన్నీ ఆమెలో వున్నాయి. అందుకే నువ్వు కాదన్నందుకు ఇంత బాధ"

"నాకు మేనరికం ఇష్టంలేదని లక్షా తొంభయి సార్లు చెప్పాను. అయినా పదే పదే ఆ ప్రసక్తి తెస్తూ నన్ను విసిగిస్తారేం?

"ఏం? మేనరికం చేసుకున్న వాళ్ళెవరు చెడిపోయారు? నాకు తెలిసి నంతమటుకు మేనరికాలు చేసుకున్న అందరూ చక్కగా కాపరాలు చేస్తూనే ఉన్నారు. వాళ్ళకు పుట్టిన బిడ్డలు ఎటువంటి అపకరం లేకుండా ఆరోగ్యంగా సలక్షణంగానే ఉన్నారు..."

"తనకు మేనరికం ఇష్టం లేదని అతను మొత్తుకుంటుంటే ఎందుకలా విసిగిస్తావు? పైగా ఆ అమ్మాయికి మరొకరితో పెళ్ళయిపోయింది కూడాను. అయినా ఆ సంబంధం తప్పిపోయినంత మాత్రాన గౌతమ్‌కిహ ఈ జన్మలో పెళ్ళికాదేమో అన్నట్లు మరీ ఫూలిష్‌గా

మాట్లాడుతున్నారు మీరందరూ" విసుగ్గా అన్నాడు రవీంద్ర.

"మీరెన్ని చెప్పండి. మరే అమ్మాయీ మాధవికి సాటిరాదు''

"నిజమే. మాధవి బుద్ధిమంతురాలు. ఆ అమ్మాయిని చేసుకుంటే గౌతమ్ సుఖపడ్తాడని నేనూ ఎంతగానో అనుకున్నాను. కాని అతడికిష్టంలేకపోయాక ఆ ఊసు ఎత్తక ఊరుకోవడం మంచిది"

"ఏమిటో వరస చూస్తే చేతిలో వెన్నను పరుల పాల్జేసి ఊరంతా వెదికినట్లుంది" గులాం ఆలీ గజల్స్ వింటూ మౌనంగా కూర్చున్న అన్నగార్ని నిష్ఠూరంగా చూస్తూ అంది స్వప్న. స్వప్నకు గౌతమ్ అంటే ప్రాణం. చిన్నన్నయ్యా అంటూ అతడిని క్షణం వదిలేదికాదు చిన్నప్పుడు. భోంచేయడం, చదువుకోవడం, పడుకోవడం... ప్రతిదానికి అన్నగారు పక్కనే ఉండాలి. అతడిని వారం పది రోజులు చూడకుంటే ఇప్పటికీ బెంగ పెట్టుకుంటుంది. అతడితో ఆమె అనుబంధం అంత గాఢమయింది. స్త్రీ సహజంగా స్వసుఖంకంటె తను ప్రేమించే వారి శ్రేయస్సును ఎక్కువగా కాంక్షిస్తుంది. అటువంటి తపన స్వప్నలో ఒకింత అధికంగా కనిపిస్తుంది. ఆ తాపత్రయంతోనే గౌతమ్ మాధవిని చేపట్టాలని ఆమెఆరాటపడింది. వాళ్ళ మేనమామకూతురు మాధవి. వాళ్ళ అమ్మమ్మ పరిభాషలో బంగారుబొమ్మ. సహనం, వినమ్రత ఆమె నేస్తాలు. ముఖాన చెరగని చిరునవ్వు ఆమెకు అమూల్యాభరణం. పరిస్థితులను తనకనుగుణంగా మలచుకోగలగడం ఆమె ప్రత్యేకత. తల్లి ఇచ్చిన సుశిక్షణతో గృహకృత్యాల్లో ఆరితేరింది. అందుకే మేనకోడల్ని కొడుక్కి చేసుకోవాలని తన తల్లి సుందరమ్మ ఎంతగానో ఉబలాటపడింది. డాక్టరుగా రెండు చేతూలా ఆర్జిస్తున్న కొడుక్కి గొప్ప సంబంధం చూడాలన్న కోరిక తండ్రిగారికున్నప్పటికీ కొడుకు సుఖంకోరి బడిపంతులయిన బావమరిదితో వియ్యానికి సిద్ధపడ్డారు. అయితే మాధవిని చేసుకోనని మొండికెత్తాడు గౌతమ్. ఎవరెంత నచ్చజెప్పినా వినిపించుకోలేదు. 'మేనరికం నాకిష్టంలేదు. వేరే సంబంధం చూడండి' అని నిష్కర్షగా చెప్పేసాడు. ఆ కారణంగా తల్లి కోపానికి పాత్రుడయాడు. అయినా లక్ష్యపెట్టలేదు. తను తన సుఖసంతోషాల నిమిత్తం పెళ్ళిచేసుకుంటాడే తప్ప తల్లిదండ్రులను, తోబుట్టువులను ఇంకా ఊళ్ళో అందరిని తృప్తిపరచడం కోసం తన మనస్సు నాకర్షించని స్త్రీ మెళ్ళో తాళి కట్టలేడు. మాధవి ఎంత రూపసి అయినప్పటికీ ఆమె సమక్షంలో తన మనస్సు స్పందించదు. ఆమెను తాకినప్పుడు మేనిలో ఎటువంటి పులకరింత ఉండదు. ఎప్పుడయినా ఆమెతో ఏకాంతంలో ఉండటం తటస్థించినా తనలో ఎటువంటి కదలిక వుండదు. మనస్సు నిశ్చలంగా, నిర్వికారంగానే ఉండిపోతుంది. అటువంటప్పుడు ఆమె నుండి తనాశించే శారీరక సుఖంపొందలేనేమో అనిపించిందతడికి. అందుకే మాధవితో పెళ్ళికి అతడిష్టపడలేదు. దానికితోడు అతడి మనస్సు దగ్గరి సంబంధం చేసుకునేందుకు తీవ్రంగా వ్యతిరేకించింది. పెళ్ళి విషయంలో అతడు ఎవరితోనూ కాంప్రమైజ్ అయ్యేందుకు సిద్ధంగాలేదు. అతడి దృష్టిలో పెళ్ళి పూర్తిగా వ్యక్తిగత సమస్య. ఆ విషయంలో తల్లిదండ్రులకయినా తనను

శాశించే అధికారంలేదు. తన పెళ్ళి పూర్తిగా తన ఇష్టానుసారమే జరుగుతుంది.అందులో ఇతరుల ప్రమేయం ఉండదు, ఉండబోదు!



చాలారోజుల తర్వాత ఒకనాటి భోజనాల సమయంలో, ''డాడీ ! నెల్లూరు హాస్పిటల్లో యమ్. యస్. చేసేందుకు సీటొచ్చింది" అన్నాడు గౌతమ్.

"కంగ్రాచ్యులేషన్స్!'' సంతోషంగా అన్నారు పరాంకుశంగారు.

ఇంట్లో అందరూ గౌతమ్‌ని అభినందించారు.

''గౌతమ్!" అన్నంలోకి గోంగూర పచ్చడి కలుపుకుంటూ పిలిచారు పరాంకుశంగారు.

"యస్ డాడీ?"

"లాయర్ విశ్వనాథంగారు నిన్ను వాళ్ళమ్మాయికి చేసుకోవాలని ముచ్చట పడుతున్నాడు. ఉమ నీకు తెలుసుకదూ? ఆలోచించు. అన్నివిధాలా అనుకూలమైన సంబంధం. నువ్వు సరేనంటే ఈ నెల్లోనే ముహూర్తాలున్నాయి..."

''నా పెళ్ళికిప్పుడేమి తొందర డాడీ?"

"ఆలోచించు. వెళుతున్నది అన్యభాషా ప్రాంతం. అక్కడ ఆచారాలు, ముఖ్యంగా ఆహారపుటలవాట్లు ఎటువంటివో ఏమిటో! అటువంటి నూతన ప్రదేశాల్లో భార్యాభర్తలు ఒకరికొకరు ఎంత తోడో నీకు తెలీదు"

"క్షమించండి డాడీ యమ్.యస్. అయ్యేదాకా పెళ్ళి చేసుకునే ఉద్దేశం లేదు నాకు" స్థిరకంఠంతో అన్నాడు గౌతమ్.

''నీ ఇష్టం'' నిట్టూర్చారు పరాంకుశంగారు.

ఆయనవేపు కోపంగా చూసింది సుందరమ్మ.

'ఎందుకలా చూస్తావు. నేనేం చేసాను' అన్నట్లు హడలిపోతూ చూసారు పరాంకుశంగారు. క్రిమినల్ లాయరుగా ఆయనకు ఊళ్ళోనే కాదు - జిల్లాలోనే ఎంతో పేరుంది. తన వాదనతో ఎదుటి వ్యక్తిని ముప్పుతిప్పలుపెట్టి ముప్పయిమూడు చెరువుల నీళ్లు తాగించగల వాగ్ధాటి ఆయనది. అటువంటి పెద్దమనిషి భార్యముందు నోరుతెరిస్తే ఒట్టు.

''ప్రతి విషయాన్ని పిల్లల ఇష్టానికే వదిలేస్తే మనం ఇంకా ఈ సంసారాన్ని పట్టుకు పాకులాడటం ఎందుకు? బయలుదేరండి... రేపే ఏ కాశీకో వెళ్ళిపోదాం" కోపంగా అంది సుందరమ్మ.

"ఇప్పుడేమయిందే?"

"నా శ్రాద్ధమయింది" కస్సుమంది సుందరమ్మ.

"అబ్బ, తిన్నగా మాట్లాడుదూ?''

పెద్దకొడుకు శ్రీధర్, కోడలు రాజేశ్వరి కూడా హఠాత్తుగా ఆమెకంత కోపం ఎందుకొచ్చిందో అర్థంకాక అయోమయంగా చూసారు.

"మీకర్థం కాలేదా డాడీ ? మీరు చెప్పడం ఆలస్యంగా ఎగిరిగంతేసి నేను పెళ్ళిపీటలమీద కూర్చోలేదని అమ్మకు కోపం" అన్నాడు గౌతమ్.

"నీ ధోరణి నాకూ అర్థం కావడంలేదు నాన్నా. ఏ వయస్సుకా ముచ్చట

అన్నారు"

"డాడీ! ఆకలయినప్పుడే అన్నంమీదికి మనస్సు పోతుంది. అలాగే పెళ్ళి చేసుకోవాలన్న కోరిక గాఢంగా కలిగినప్పుడే చేసుకోవాలని నా అభిమతం"

"అప్పటికి నీ తల పండి పోతుందేమో?" దిగులుగా అంది సుందరమ్మ.

"అలా ఎందుకనుకోవాలి?"

"ఏమో నాయనా! బిడ్డలు పెళ్ళిళ్లు చేసుకుని కళకళ్లాడుతూ కాపరం చేస్తుంటేనే తల్లిదండ్రులకు మనశ్శాంతి. నీ స్నేహితులందరూ గృహస్థులయ్యారు. బిడ్డలకు తండ్రులయ్యారు కూడాను. నువ్వొక్కడివీ ఇలా వంటరిగా మిగిలిపోయావు. నీ జీవితంలో మంగళవాద్యాలుమోగే శుభఘడియ ఎప్పుడొస్తుందో!"

"ఎప్పుడో ఒకప్పుడు వస్తుంది. ఈలోగా ఆలోచనలతో నువ్వు మనస్సు పాడుచేసుకోకు. మళ్ళీ బి. పి. పెరిగితే బాధపడాలి" అనునయంగా అన్నాడు గౌతమ్.

మర్నాడు సాయంత్రం గౌతమ్ ఇంటికి వచ్చేటప్పటికి వంటింట్లో తల్లితో మాట్లాడుతూ కనిపించాడు సూర్యం.

"హాయ్! అమ్మను ఏడిపించి పకోడీలు చేయించుకు తింటున్నావా?" ఉత్సాహంగా పలకరించాడు గౌతమ్.

"నేనేం చేసిపెట్టమని అడగలేదు. నన్ను చూసి పిన్నే పిండి కలిపింది. కదూ పిన్నీ?"

సుందరమ్మ నవ్వి వేడి వేడి పకోడీలు ఒక పళ్లెంలోపెట్టి కొడుకు చేతికిచ్చింది.

"ఏమిటి విశేషాలు?" పకోడీలు తింటూ అడిగాడు గౌతమ్.

"భారత క్రికెట్ జట్టు వెస్టిండీస్ క్రికెట్ జట్టుమీద ట్రినిడాడ్‌లో జరిగిన మూడవ టెస్టులో ఘనవిజయం సాధించింది"

"ఆతర్వాత పోర్ట్ ఆఫ్ స్పెయిన్, కింగ్‌స్టన్‌లలో జరిగిన నాల్గవ, అయిదవ టెస్టుల్లో వెస్టిండీస్ చేతిలో చావు దెబ్బలు తింది"

"దీన్నుండి మనం తెలుసుకోవలసిన నీతి ఏమిటంటే...."

"గెలుపు వెనకే ఓటమి ఉంటుంది" అని మాట పూర్తిచేసాడు గౌతమ్.

ఇద్దరూ హాయిగా నవ్వుకున్నారు.

బేంకి ఉద్యోగి సూర్యంతో మూడు సంవత్సరాల్కితం క్లబ్బులో పరిచయం ఏర్పడింది గౌతమ్‌కి. పరిచయం గాఢస్నేహంగా పరిణమించింది. సూర్యంది చొచ్చుకుపోయే స్వభావం. ఎప్పుడూ నవ్వుతూ తుళ్లుతూ హుషారుకి మారుపేరులాగుంటాడు. మాటల గారడీతో ఎదుటివారిని మంత్రముగ్ధులను చేయగల మాటకారి. అందుకే డ్రాయింగ్‌రూం నుండి వంటింట్లోకి వెళ్ళిపోగలిగాడు. ముఖ్యంగా సుందరమ్మ హృదయంలో ప్రత్యేక స్థానం సంపాదించుకోగలిగాడు. ఇంటి భోజనం మీదికి మనస్సు మళ్ళినప్పుడు సరాసరి ఇంట్లోకి వచ్చేసి డైనింగ్ టేబిల్‌ముందు కూర్చుని 'పిన్నీ! ఆకలేస్తోంది. అన్నంపెట్టు' అని కావలసింది అడిగి పెట్టించుకుతింటాడు. ఆ ఇంట్లో అతడికంత చనువుంది. పకోడీలు తిని కాఫీ తాగాక స్నేహితులిద్దరూ టెన్నిస్ ఆడేందుకు క్లబ్బుకి వెళ్లారు. గౌతమ్‌తో సమానంగా ఆడగలడు సూర్యం. ఇద్దరూ పందెం వేసుకు ఆడితే ఆరోజు టెన్నిస్ ప్రియులకు పసందయిన కాలక్షేపమే. ఆరోజు పందెం వేసుకో

సప్పటికీ బలాబలాలు తేల్చేసుకోవాలన్న ధోరణిలో అయిదు సెట్స్ ఆడేరు. గౌతమ్ మూడు సెట్స్ గెలిస్తే, సూర్యం రెండు గెలిచాడు.

"ఈరోజు నిజంగా నీ ఆట అద్భుతంగా ఉంది" సూర్యం ప్రశంసగా అన్నాడు.

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంట్" స్టామినెడ్ సిప్ చేస్తూ అన్నాడు గౌతమ్.

అతడివేపు తదేకంగా చూడసాగాడు సూర్యం.

"ఏమిటోయ్... అలా కొత్తగా చూస్తున్నావ్?"

"ప్రిన్స్‌చార్మ్‌లాగున్న నీ మనో మందిరంలో పూజలందుకుంటున్న అదృష్టవంతురాలెవరా అని ఆలోచిస్తున్నాను"

"కొంపదీసి కథలు రాయడం ప్రారంభించావా?" పరిహాసంగా అడిగాడు గౌతమ్.

"డామిట్... నేను కథలు రాయడమేమిటి?"

"లేకుంటే మనోమందిరాలు, పూజలు అంటూ ఏమిటా భాష?"

"ఓకే! మామూలు భాషలోనే అడుగుతాను. నువ్వు ఎవరినయినా ప్రేమిస్తున్నావా?"

"నాకు ప్రేమించే ఓపిక, తీరికా లేదు బ్రదర్!"

"మరయితే పెళ్ళిచేసుకోకుండా ఎందుకు పిన్నిని సతాయిస్తున్నావు?"

గౌతమ్ ముఖం చిట్లించాడు. "ఊహ్.. అమ్మ నిన్ను రాయబారం పంపిందా?"

"అలా తేలిగ్గా మాట్లాడకు గౌతమ్! పిన్ని చాలా బాధపడుతోంది"

"అమ్మకు ఈమధ్య చాదస్తం ఎక్కువయింది. ప్రపంచంయొక్క భవిష్యత్తే నా పెళ్ళిమీద ఆధారపడి ఉన్నట్లు అస్తమానం పెళ్ళో పెళ్ళో అని మొత్తుకుంటుంది. రాన్రాను ఇంటికి వెళ్ళాలంటేనే విసుగనిపిస్తోంది"

"పెళ్ళితో తప్ప జీవితానికి పరిపూర్ణత సిద్ధించదని మన పెద్దల నమ్మకం"

"ఆ నమ్మకంతోనే ఊహతెలీని వయస్సుల్లోనే పెళ్ళిళ్ళు చేసుకుని సెక్స్ గురించి సరయిన అవగాహన ఏర్పడకముందే పిల్లల్ని కనడం ప్రారంభించి ఈనాడు దేశాన్ని పట్టి పీడిస్తున్న ఎన్నో సమస్యలకు కారణభూతులయ్యారు"

"అందుకని నువ్వసలు పెళ్ళే చేసుకోకుండా దేశాన్ని ఉద్ధరిస్తావా?"

"నేనసలు పెళ్ళే చేసుకోనని అన్నానా?"

"మరయితే వచ్చే ప్రతి సంబంధాన్ని తిరగ్గొట్టేస్తున్నావెందుకు?"

"ఏం చేయను. ఇంతవరకు నేను చూసిన అమ్మాయిల్లో ఎవరూ నాకు నచ్చలేదు"

"ఎలాంటి అమ్మాయి అయితే నీకు నచ్చుతుంది?"

"చూడగానే పెళ్ళిచేసుకుని స్వంతం చేసేసుకోవాలి అన్న కోరిక కలిగించాలి"

సూర్యం ఆలోచనలోపడ్డాడు.

కాస్సేపుతర్వాతఅన్నాడు–"గౌతమ్! మా ఊళ్ళో ఒక అమ్మాయి ఉంది. పేరు లావణ్య. రూపం, చదువు, ఆస్తి, అంతస్థులు–అన్నిటా నీకు ఈడు జోడుగా ఉంటుంది. నీకు తప్పక నచ్చుతుందనుకుంటాను. నువ్వు సరేనంటే పెళ్ళిచూపుల కేర్పాటు చేయిస్తాను"

"చూద్దాం!" నిరాసక్తిగా అన్నాడు

గౌతమ్.

"చూద్దాంకాదు. ఎల్లుండి మంచిరోజు. ఆరోజు పెళ్ళిచూపులకు నువ్వు నూజివీడు వస్తున్నావు"

"మధ్య నీకేమిటి ఇంట్రెస్ట్?" సూటిగా అడిగాడు గౌతమ్.

గౌతమ్ మాటలు విని ఖంగుతిన్నాడు సూర్యం. వెంటనే సర్దుకుని అన్నాడు- "నువ్వు నా ప్రాణమిత్రుడివి. లావణ్య మా ఊరి ఆడబడుచు. మీరిద్దరూ ఓ ఇంటి వాళ్ళయితే నేను స్వేచ్ఛగా రాకపోకలు సాగించవచ్చు"

గౌతమ్ నవ్వేసాడు. "అదా నీ ఆలోచన"

"పెళ్ళిచూపులకేర్పాటు చేయమని కబురంపనా?"

"ఇప్పుడే పెళ్ళిచేసుకుంటే అనుకున్న విధంగా యం.యస్. పూర్తిచేయలేనేమో!"

"మగవాడి ప్రతి విజయం వెనక స్త్రీ ఉంటుందంటారు. అటువంటప్పుడు నీ అభివృద్ధికి అడ్డు నిలుస్తుందా నీ భార్య? అనుకూలవతి అయితే అడుగడుగున ప్రోత్సహిస్తూ జీవితంలో నువ్వు మరింత అభివృద్ధి సాధించే అవకాశంఉంది. కాదంటావా?"

"నా మాటకేంగానీ నాకన్న పెద్దవాడివి. నీ పెళ్ళెప్పుడు?"

సూర్యం మొహంలో నవ్వు మంత్రించినట్లు మాయమయింది. ఎటో చూస్తూ తగ్గుస్వరాన అన్నాడు - "ఈ జన్మలో కాదు"

అదిరిపడి చూసాడు గౌతమ్. "సూర్యం?"

సూర్యం ఏదో ఆలోచిస్తూ మౌనంగా కూర్చున్నాడు.

"సూర్యం...చెప్పు - నీ పెళ్ళి ఈ జన్మలో ఎందుకు కాదు?" ఆరాటంగా అడిగాడు గౌతమ్.

శుష్కహాసం చేసాడు సూర్యం. "ఎందుకంటే నేను పెళ్ళి చేసుకోవడమే జరిగితే ఒక స్త్రీ జీవితం నాశనమవుతుంది. అది నాకిష్టంలేదు. అందుకే... అందుకే ఈ జన్మలో నేను పెళ్ళి చేసుకోకూడదని నిర్ణయించుకున్నాను"

అతడివేపు నిశితంగా చూస్తూ-"నాకు తెలీని రహస్యం నీ జీవితంలో ఉందని ఇపుడే అర్థమవుతోంది. నిజంచెప్పు-నీకు, వివాహానికి మధ్య నిలిచిన అడ్డేమిటి?" అన్నాడు గౌతమ్.

సూర్యం మాట్లాడలేదు.

అతడి కళ్ళలో హృదయం చదివేందుకు ప్రయత్నిస్తూ అన్నాడు గౌతమ్. "నాదగ్గరే దాపరికమా? ఇంతేకదా మన స్నేహం?"

"కొన్నికొన్ని విషయాలు మనస్సులోనే గుప్తంగా దాచుకోవడం మంచిది.."

"ఎవరికి మంచిది?"

సూర్యం జవాబు చెప్పలేదు.

"సూర్యం! కొన్నికొన్ని సమయాల్లో మనస్సుని వేధించే సమస్యలను గురించి ఆత్మీయులతో చెప్పుకుంటే కనీసం హృదయభారం తగ్గుతుంది. అసలు విషయమేమిటో చెప్పు" అనునయంగా అన్నాడు గౌతమ్.

అతడివంక చూసాడు సూర్యం.

ఆ క్షణం అతడిమొహంలో మెరుపులా కనిపించి మాయమయిన భావమేమిటో గౌతమ్‌కంతుబట్టలేదు.

"సంవత్సరం క్రితం నేనో ఏక్సిడెంటులో ఇరుక్కున్నాను గుర్తుందా?" అడిగాడు సూర్యం.

తల ఊపాడు గౌతమ్.

"అప్పుడు...అప్పుడు నా వెన్నెముక దెబ్బతింది..." మాటలు ఆపి గౌతమ్ వేపు చూసిన సూర్యం మొహంలో పుండు కెలుకుతున్నప్పుడు కలిగే బాధ కనిపించింది. "గౌతమ్! కొన్ని పరిస్థితుల్లో వెన్నెముక దెబ్బతింటే ఫలితం ఎంత దారుణంగా ఉంటుందో డాక్టరువయిన నీకు నేను విడమరచి చెప్పక్కరలేదనుకుంటాను"

"సూర్యం! నువ్వు..."

"నేను సంసార జీవితానికి పనికి



రాను" నిర్వేదంగా చెప్పాడు సూర్యం.

తనకత్యంత ఆప్తుడైన స్నేహితుడు సంసార జీవితానికి పనికిరాడు. ఆ కఠోర సత్యం విని గౌతమ్ చలించిపోయాడు. ఒక మగాడికి అంతకన్న దారుణమయిన శిక్ష మరొకటుంటుందా?

అవ్యక్తమయిన ఆవేదనతో మనస్సు మొద్దుబారిపోగా స్తబ్దుగా కూర్చుండిపోయాడు.

స్నేహితుడివేపు ఆర్ద్రంగా చూసాడు గౌతమ్.

"ఇంత వ్యధను గుండెల్లో దాచుకుని నవ్వుతూ తుళ్ళుతూ ఎలా ఉండగలుగుతున్నావు?"

"సంతసాన్ని పదిమందికి పంచు, విషాదాన్ని నీలో నువ్వే దాచుకో అన్నారు!"

"మీ ఇంట్లో తెలుసా ఈ సంగతి?"

"ఊహూ... ఒక్క నీకుతప్ప ఇంకెవరితోనూ చెప్పలేదు"

"నన్ను ఒకసారి చూడనీ!"

"నో... థాంక్యూ!"

దెబ్బతిన్నట్లు చూసాడు గౌతమ్.

"సూర్యం!"

పేలవంగా నవ్వాడు సూర్యం. "తెలిసిన చేదునిజాన్ని పదేపదే వినడం... అదెంత గుండె కోతో నీకు తెలీదు"

గౌతమ్ మాట్లాడలేదు.

మేగజైన్ చేతిలోకి తీసుకున్నాడు సూర్యం.

అతడినే రెప్పవాల్చకుండా చూస్తున్నాడు గౌతమ్.

తనకు పూర్తిగా అపరిచితుడయిన మరోవ్యక్తిలా అతడిలోకన్పిస్తుంటే కొత్తగా, నిశితంగా, దీర్ఘంగా చూస్తూ కాలగతినే మరచిపోయాడు.

* * *

గోధుమవన్నె శరీరఛాయ. చంద్రబింబం లాంటి వదనం. పదే పదే చూడాలనిపించే శరీర నిర్మాణంతో కావ్యనాయికలను గుర్తుకుతెచ్చేలాగున్న లావణ్యను చూసినక్షణం ఎటువంటిదోకానీ మొదటి చూపులోనే గౌతమ్‌ని అపరిమితంగా ఆకర్షించింది. పెళ్ళిచేసుకుని ఆమెను శాశ్వతంగా తన స్వంతం చేసేసుకోవాలనిపించింది. ఆమె తల్లిదండ్రులకూ, నలుగురన్నలకూ గౌతమ్ కూడా అంతగానూ నచ్చాడు.

కొడుక్కి ఇన్నాళ్ళకు ఓ అమ్మాయి నచ్చి అతను పెళ్ళికి ఇష్టపడటం... కూతురికి కట్నాలు కానుకలు కింద రెండు లక్షలుపైనే ఇచ్చుకుంటానని కాబోయే వియ్యంకుడు సగౌరవంగా తెలియజేయడం, చూసి గౌతమ్ తల్లిదండ్రులు సంతోషంతో ఉప్పొంగిపోయారు. మంచి చెడ్డ మాట్లాడుకుని ఆరోజే తాంబూలాలు మార్చుకున్నారు. సరిగ్గా పదిహేను రోజుల తర్వాత ముహూర్తం కుదిరింది.

అంటే పెళ్లయిన మర్నాడే గౌతమ్ వెల్లూరు వెళ్ళిపోవాలి.

వెళ్ళినచోట ఇల్లు చూసి కాపురం పెట్టేందుకు ఎన్నాళ్ళు పడుతుందో? అందాకా భార్యకు దూరంగా ఉండాలన్న మాట...తలచుకుంటేనే దిగులనిపించింది.

ఇంత స్వల్ప వ్యవధిలో ఒక స్త్రీ తన మనస్సుని ఇంతగా ఆక్రమించుకోవడం అతడికి ఆశ్చర్యంగా ఉంది.

వెల్లూరు వెళ్ళేందుకు ఏర్పాట్లు చేసుకుంటూనే పెళ్ళిరోజుకోసం ఆరాటంగా ఎదురుచూడసాగాడు.

పెళ్ళిపనుల సందడి, పెళ్ళికి వస్తూ బంధువులు వెంటతెచ్చిన సంరంభోత్సా

హాలు ఎప్పుడూ నిశ్శబ్దంగా ఉండే ఇంట్లో కేరింతల హోరు. ఇంటికి పెళ్ళికళ వచ్చేసింది. మాధవి, ఆమె భర్త సారధితో సహా రావలసిన బంధువులందరూ వచ్చేశారు. అయితే పెళ్ళికి సూత్రధారి అయిన సూర్యం మాత్రం ఇంకా రాలేదు. ఎవరి కోసం చూడనంతగా సూర్యంకోసం ఎదురుచూశాడు గౌతమ్. ఎందుకనో సూర్యం రానేలేదు.

సూర్యం ఎందుకు రాలేదు?

ఆ ప్రశ్న గౌతమ్ మనస్సుని దొలిచేస్తోంది.

అయితే సర్వాలంకార సంశోభితయయి అందాల వెలుగులు విరజిమ్ముతున్న లావణ్యను చూసి గౌతమ్ ఆ విషయం మరచిపోయాడు. అలౌకికమయిన ఆనందంతో తేలిపోయిందాతడి మానసం.

తనెంత అదృష్టవంతుడు!

అందాల హరివిల్లులాగున్న ఈ స్త్రీ తనతో జీవితం పంచుకునేందుకు నిర్దేశింపబడింది.

ఆమె అందాలన్నీ తనవవుతాయి.

గౌతమ్ పులకాంకితుడయ్యాడు.

ఓహ్... స్త్రీ స్పర్శ ఇంత మధురంగా ఉంటుందా!

అణువణువున వ్యాపిస్తూ అలజడి కలిగిస్తున్న ఈ అనుభూతినేమంటారు?

ఇదేమిటి... హఠాత్తుగా తనలో ఈ మార్పేమిటి. రక్తంలో తేనెగాని కలిసిపోయిందా?

మంగళవాద్యాలు గుండెల్లో చిరుగంటలు మోగిస్తుండగా వేదమంత్రాల మధ్య పెద్దలు దీవిస్తుండగా అగ్నిసాక్షిగా లావణ్య మెళ్ళో మూడుముళ్ళువేసి సంసార జీవితంలోకి అడుగుపెట్టాడు గౌతమ్. అతడి బ్రహ్మచారి జీవితానికి శాశ్వతంగా తెరపడింది. ఆ క్షణం ఏదో అర్థంకాని భావోద్విగ్నతతో అతడి మనస్సు మొద్దుబారిపోయింది.

యాంత్రికంగానే పురోహితుడు చెప్పిందల్లా చేశాడు.

ఈరోజు తన జీవితానికి మరో మలుపులాంటిది.

ఆ మలుపు తన జీవితంలో రసమయ మాధుర్యానికి నాంది పలుకుతుందా?

ఇన్నాళ్ళూ వేర్వేరు మార్గంలో సాగిపోయిన ఇరువురి జీవితాలు ఇకనుండి ఒకే బాటలో సాగిపోవాలి. మరి ఆ బాట పూలబాట అవుతుందా?

అర్ధాంగిగా తన జీవిత ప్రాంగణంలోకి అడుగుపెడ్తున్న ఈ అపురూప సౌందర్యవతి తనాశించే జీవితాన్ని తనకిస్తుందా?

తమ ఇల్లు మరో స్వీట్ హోం అవుతుందా?

ఆ సాయంత్రం రిసెప్షన్.

పెళ్ళికి అరుదెంచినవారికి విందు భోజనాలతోబాటు భరతనాట్య ప్రదర్శనం ఏర్పాటు చేశారు.

వధూవరులు ప్రత్యేకంగా వేయబడిన ఆసనాల్లో ఆశీనులయ్యారు.

"పొద్దున్నుండి మళ్ళీ కనిపించలేదేం?" చిన్నగా అడిగాడు గౌతమ్.

ఒకసారి అతడివేపు చూసి తల దించుకుంది లావణ్య. "తలనొప్పిగా ఉంటే పడుకుండిపోయాను"

నిజంగానే ఆమె వదనం వాడిపోయి ఎలాగో ఉంది.

పొద్దున్న హోమగుండంలో రేగిన పొగకు గౌతమ్‌కి కూడా తల దిమ్ముగానే ఉంది. పైగా రాత్రంతా సరిగా నిద్రలేదు. ఈ రాత్రి....

అతడి పెదిమల మీద స్నిగ్ధ దరహాసం నర్తించింది.

ప్రతి స్త్రీ పురుషుడు ఎంతగానో ఎదురుచూసే తొలిరేయి!

జీవితంలో మరి తిరిగిరాని ఈ తియ్యని రాత్రిని నిదురించి నిరర్థకం చేయడం తప్పుకదూ?

చిలిపిగా ఏదో చెప్పబోయాడు. అంతలో స్నేహితులు వచ్చారు.

అందరినీ పేరు పేరునా భార్యకు పరిచయం చేసాడు.

లావణ్యను చూస్తున్న స్నేహితుల కనులలో ప్రశంస గుర్తించి అతడి హృదయం ఉప్పొంగింది. ఒక దశలో భార్యరూపం భర్తకు గర్వకారణమవుతుంది మరి!

సరిగ్గా ఆరుగంటలకు నింగిని మెరిసే తటిల్లతలా రంగస్థలంమీద ప్రత్యక్షమయింది నర్తకి. నటరాజుకి సుమాంజలి సమర్పించి నాట్యం ప్రారంభించింది.

తన అనన్యసామాన్య నాట్యకళా వైదుష్యంతో ప్రేక్షకులను మంత్రముగ్ధులను చేసింది. సరిగ్గా తొమ్మిది గంటలకు ప్రదర్శనం పూర్తయింది.

నూతన దంపతులను మరోసారి అభినందించి వెళ్ళిపోయింది నర్తకి.

భోజనాలుచేసి దొరికినచోట నిదుర కొరిగారు అందరూ.

కోరికలతో వేగిపోతున్న శోభనం పెళ్ళికొడుకు గౌతమ్ దరిదాపులకు వచ్చేందుకు సాహసించలేదు నిద్రాదేవత

మల్లెల సౌరభం మత్తెక్కిస్తుండగా, సాంబ్రాణి కడ్డీల సువాసన కోరికల హోమగుండంలో సమిధలు వేస్తుండగా భార్య రాకకోసం అసహనంగా ఎదురుచూస్తున్నాడు గౌతమ్. నిరీక్షణ ఎంత బాధాకరమయిందో ఆ రోజతడికి బాగా అర్థమయింది. చివరికి ఆ నిరీక్షణ ఫలించి పదకొండుగంటలవుతూండగా గదిలోకి అడుగుపెట్టింది లావణ్య. ఎర్రంచు తెల్లపట్టుచీర, తెల్లరవికె, పువ్వులజడ, ఒళ్ళంతా ధగధగ మెరిసిపోతూ ఆమె అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్న సరికొత్త స్వర్ణాభరణాలు—వరమివ్వ ఏతెంచిన శృంగార దేవతలాగుంది.

ఉద్వేగంతో అణువణువు విచ్చిపోతుందేమో అనిపించింది గౌతమ్‌కి.

తలవంచుకుని గుమ్మం వద్దనే నిలబడిపోయిన భార్యను సమీపించి, "నేను క్షణాలు యుగాలుగా ఫీలవుతూ ఎదురుచూస్తుంటే ఇప్పుడా రావడం?" అన్నాడు గౌతమ్.

తలెత్తి అతడి ముఖంలోకి ఒకసారి చూసి, "పాలు తీసుకోండి!" అంది లావణ్య చిన్నగా.

గ్లాసందుకుని కొంచెం తాగి ఆమె చేతికిచ్చేసాడు.

గ్లాసుని స్టూలు మీద ఉంచేసింది లావణ్య.

"అదేం, నువ్వు తాగవూ?"

"నాకు పాలు సహించవండి!"

ఏదోచెప్పబోయి ఆగాడు గౌతమ్. మొదటి రాత్రే వాదోపవాదాలెందుకు. ఇప్పటికే ఎంతోరాత్రి వృధా అయిందనుకుంటూ భార్యభుజం చుట్టు చెయ్యివేసి పొదివిపట్టుకుని మంచంవద్దకు నడిపించుకు వెళ్ళాడు.

ఇద్దరూ మంచం మీద కూర్చున్నారు.

తల వంచుకు కూర్చున్న లావణ్య చుబుకం పట్టి పైకెత్తి ఆమె తరళ నేత్రాల్లోకి చూస్తూ—

"నేను నచ్చానా?" అడిగాడు గౌతమ్.

క్షణంసేపు ఇద్దరి చూపులు కలుసుకున్నవి. మరుక్షణం కళ్ళు వాల్చేసింది. జవాబు చెప్పలేదు.

ఆమె కళ్ళమీద మృదువుగాచుంబించి "సిగ్గా?" లాలనగా అన్నాడు గౌతమ్. ఆమె జవాబుకోసం ఎదురుచూడకుండా అతడి పెదవులు ఆమె కనుల మీద నుండి క్రమంగా బుగ్గల మీదికి, అక్కడ నుండి పెదవుల మీదికి చేరాయి. ఆమె అధరామృతం జుర్రుకుంటూనే దీపం తీసేసాడు.

ఆ రాత్రి సృష్టిలోని మాధుర్యమంతా గ్రోలుతూ ఆనంద శిఖరాగ్రాన ఉండిపోయాడు గౌతమ్.

తూరుపు దిక్కున వెలుగురేఖలు విచ్చుకుంటున్న వేళ...

"జీవితానికి సరిపడాపోయి ఈఒక్క రాత్రేఇచ్చేసావు...ఏంకావాలో కోరుకో!" భార్య చెవిలో అన్నాడు గౌతమ్.

ఒకసారి అతడి కళ్ళలోకి చూసి, "నాక్కావలసిందంతా నాన్నగారే ఇచ్చేసారు. నాకు ఇంకేమీవద్దు" అంది లావణ్య.

దెబ్బతిన్నట్లు చూసాడు గౌతమ్.

'నాకేమీవద్దు. మీ అనురాగం ఉంటే చాలు'నని చెప్తుందని ఎదురు చూసిన అతడికిఆజవాబుఅసంతృప్తినికలిగించింది. సిగరెట్ వెలిగించి రాత్రి అనుభవాలు నెమరువేసుకుంటున్న అతడికి తను ఆశించినంతగా భార్య తన చేరువకు రాలేదేమో అనిపించింది. ఎంతసేపు తనే మాట్లాడాడు తప్ప తనంతట తానయి ఆమె ఏమీ మాట్లాడలేదన్న సంగతి గుర్తొచ్చింది. తను అడిగినవాటికి ముభావంగా, ముక్తసరిగా జవాబులిచ్చింది.

ఆమెకింకా తన వద్ద కొత్తదనం పోలేదా?

తననుచూసి ఇంకాసిగ్గుపడుతున్నదా? లేక ఆమె స్వభావమే అంతా?

ఒకవేళ ఆమెకిది ఇష్టంలేని పెళ్ళి కాదుగదా?

హఠాత్తుగా గౌతమ్ హృదయం కల్లోలిత కదలి అయింది.

అతడి ఆలోచనలతో నిమిత్తంలేకుండా లావణ్య గదిలోంచి వెళ్ళిపోయింది. కాసేపుతర్వాత స్నానంచేసి అపుడే కడిగిన ముత్యంలా తయారయి కాఫీ చేత పట్టుకు వచ్చిన భార్యను చూడగానే అంతసేపు వేధిస్తున్న ఆలోచనలు చెదిరిపోగా ఆమెనడుంచుట్టూ చేతులువేసి ఆమె పొత్తికడుపు మీద ముద్దు పెట్టుకున్నాడు.

"ఈ రోజు నేను ఊరు వెళ్ళిపోతున్నాను. తెల్సా?"

మృదువుగా,నాజూగ్గా, పువ్వులాగున్న ఆమె శరీరం నుండి తేలివస్తున్న పరిమళం ఆఘ్రాణిస్తూ అన్నాడు గౌతమ్.

తెలుసన్నట్లు తల ఊపింది లావణ్య.

"నిన్ను విడిచివెళ్ళాలంటే ఎంత దిగులుగా ఉందో తెలుసా?''

ఆమె ముఖంలోకి ఆర్తిగా చూస్తూ అన్నాడు గౌతమ్.

"మళ్ళీ ఎప్పుడువస్తారు?" మృదువుగా అడిగింది లావణ్య.

"అక్కడ ఇల్లు చూసి వచ్చి నిన్ను తీసుకువెళ్తాను. ఆలోగా రోజుకో ఉత్తరం రాయాలి. తెలిసిందా?" ఆమె ఒళ్ళో తలపెట్టి పడుకుంటూ అన్నాడు గౌతమ్.

"ఉత్తరం రాసేకళలో నాకు నేర్పు లేదండి'' మెల్లిగా అంది లావణ్య.

ఆమె చేతివేళ్ళు ముద్దుపెట్టుకుంటూ "ఉత్తరాలు రాయడం పెద్దకళా? రాస్తుంటె అదే వస్తుంది. అయినా నువ్వు ఉత్తరాలు రాసి ఏ పోటీకో పంపడం లేదు. నువ్వెలా రాసినా నేను చదివేది అక్షరాల వెనక నీ

హృదయాన్ని, నీ హృదయ గతభావాన్ని. కాబట్టి మరేమీ కుంటిసాకులు చెప్పక ఉత్తరాలు రాయి. తెలిసిందా?''

మౌనంగా చూసింది లావణ్య.

ఆమె వేపు తదేకంగా చూసాడు గౌతమ్.

ఆమె సుందరవదనం నిర్మలకాసారం లాగున్నది. నేత్రయుగ్మం ప్రశాంతతకు మందిరంలా విలసిల్లుతున్నవి!

అతడి హృదయం తేటపడింది.

ఛ, అనవసరంగా ఏవేవో ఊహించుకుని గాభరాపడ్డాను. కొందరి తత్వం అంతే. తమచుట్టూ హద్దులు ఏర్పరచుకుని ఆలోపలే ఉండిపోతారు. ఆ హద్దులు దాటి తాము ఇవతలికిరారు, ఇతరులను రానివ్వరు. అలాంటి స్త్రీల హృదయంలోకి ప్రవేశించడం కట్టుకున్న మొగుడికయినా అంత తేలికకాదు. అయితే అలాంటివాళ్ళు ప్రేమించడమే జరిగితే ఆ ప్రేమనందుకునే వ్యక్తికి అది అపురూప వరమే అవుతుంది.

లావణ్య ఆ తరహా మనిషిలాగుంది.

మనస్ఫూర్తిగా ఆమె తనకు చేరువ అయ్యేందుకు కొంతకాలం పట్టవచ్చు అంతవరకూ తను ఓపిక వహించక తప్పదు.




వెల్లూరు క్రిస్టియన్ మెడికల్ కాలేజి

హాస్పిటల్‌ని మినీ ఇండియా అనవచ్చు. దేశంలో ప్రసిద్ధి చెందిన హాస్పిటల్స్‌లో ప్రముఖమయింది. దేశం పలుప్రాంతాల నుండి వైద్యం నిమిత్తం రోగులు వస్తుంటారు. హాస్పిటల్ లాంజ్‌లో కాసేపు ఉంటే అన్ని జాతులు, తెగలు, మతాలు, సంస్కృతులకు చెందిన ప్రజలను చూడవచ్చు. దేశంలో వాడుకలో ఉన్న అన్ని భాషలు వినవచ్చు. డాక్టర్లు, నర్సులు కూడా దేశంలో వివిధ ప్రాంతాలకు చెందినవారే. అయితే వెల్లూరు తమిళనాడులో ఉంది కాబట్టి సహజంగా హాస్పిటల్ స్టాఫ్‌లో అధిక సంఖ్యాకులు తమిళులే. తమిళం తర్వాత ఎక్కువగా వినిపించే భాష తెలుగు. హాస్పిటల్ స్టాఫ్‌లో చాలా మందికి తెలుగు తెలుసు. అందుక్కారణం బహుశా హాస్పిటల్‌కి వచ్చేరోగులు అధికంగా ఆంధ్ర ప్రాంతం నుండి రావడమే కావచ్చు. దేశంలో ఎన్నో ప్రముఖ హాస్పిటల్స్‌లో లేని ఆధునిక పరికరాలున్నవి ఇక్కడ. దేశవిదేశాలలో కీర్తి పతాకాలు ఎగరేసిన ప్రతిభావంతులయిన డాక్టర్లు, సర్జన్లు ఉన్నారు. వచ్చిన మర్నాడే వాళ్ళలో ఒకడుగా కలిసిపోయాడు గౌతమ్. వివిధ రాష్ట్రాలకు చెందిన డాక్టర్లతో కలసిపనిచేయడం అతడికెంతో సరదాగానూ, ఉత్తేజకరంగానూ ఉంది. అయితే పక్కన ఇల్లాలు లేని లోటు అనుక్షణం అతడిని బాధిస్తూనే ఉంది. అందుకే ఊళ్ళో దిగిన మరుక్షణం నుండి ఇంటికోసం గాలింపు ప్రారంభించాడు. పట్టు విడవని విక్రమార్కుడిలా అలా రెండు నెలలు ప్రయత్నించాకగానీ ఒక బంగ్లా దొరికింది కాదు. అద్దె కాస్త ఎక్కువే అయినప్పటికి గౌతమ్‌కి ఆ ఇల్లు ఎంతగానో నచ్చింది. భార్యతో తను ఆ అందమయిన ఇంట్లో

గడపబోయే అందమయిన జీవితంగురించి కలలుకంటూ లావణ్యను కాపరానికిపంపే ఏర్పాట్లు చూడమని మామగారికి ఉత్తరం రాసాడు. ఉత్తరం పోస్టుబాక్సులో పడ వేసిన మరుక్షణంనుండి భార్య రాకకోసం కళ్లు కాయలు కాచేలా ఎదురు చూడ సాగాడు. వారం తర్వాత కాల్ బెల్ నుండి కారుదాకా తన సంసారానికి కావలసిన సమస్తమూ సమకూర్చుకుని లావణ్య కాప రానికి వచ్చేసింది. కొత్తకాపరం అమర్చి పెట్టేందుకు గౌతమ్ తల్లిదండ్రులు, లావణ్య తల్లిదండ్రులు ఆమెతోబాటు వచ్చేసారు. అందరూ తిరుపతి వెళ్ళి వెంకటేశ్వరస్వామివారికి కళ్యాణోత్సవం చేయించారు. బెంగుళూరు, మైసూరు, మహాబలిపురం, కంచి, మద్రాసులు సంద ర్శించి గౌతమ్ తల్లిదండ్రులు, అత్త మామ హౌరామెయిల్ ఎక్కితే-గౌతమ్, లావణ్యలు వేలూరు వచ్చేసారు.

ఆ రాత్రి భార్యను దగ్గరికి తీసుకుంటూ "నీకి ఊరు నచ్చిందా?" అనురాగపూర్ణ కంఠంతో అడిగాడు గౌతమ్.

"ఇంట్లోనే ఉండాల్సినదాన్ని. నాకు ఏ ఊరయినా ఒకటే" ముభావంగా అంది లావణ్య. ఆసరికి భార్య మరీ రిజర్వ్‌డ్ టైప్ మనిషన్న సంగతిగ్రహించే సాడు గౌతమ్.

ఆమె వచ్చిన సంగతి తెలిసి అతడి కొలీగ్స్ అయిదారుగురు భార్యలను వెంట బెట్టుకువచ్చారు. అందరూ ఆంధ్రులే. అందరూ సరదాగా, ఉత్సాహంగా నవ్వుతూ తుళ్ళుతూ మాట్లాడుకుంటుంటే లావణ్య ఎవరితోనూ అట్టే మాట్లాడక ముభావంగా ఉండిపోయింది. ఆమె బదులు కూడా గౌతమే మాట్లాడవలసి వచ్చింది.

"మీ శ్రీమతిగారు మాట్లాడితే ఎక్కడ నోటి ముత్యాలు రాలిపోతాయో అని భయపడుతున్నట్లున్నారు" అనేసింది ఒకావిడ.

గౌతమ్‌కి తలకొట్టేసినట్లయింది. భార్య వేపు చురచుర చూసాడు. అతడికి భార్య ప్రవర్తన నచ్చలేదు. వచ్చిన అతిథులను స్మితవదనంతో ఆహ్వానించి అతిథిసత్కా రాలు గావించి, స్నేహార్ద్రంగా మాట్లాడి సంతృప్తులను చేయడం మంచి గృహిణి లక్షణం. అప్పుడే ఒకసారి వచ్చినవాళ్లకు మళ్ళీ మళ్ళీ రావాలనిపిస్తుంది. కాని లావణ్య ఈనాడు నడచుకున్న తీరు అలా లేదు.

వాళ్ల మొహాన టీనీళ్లు పోసేసి పుస్తకం పట్టుకు కూర్చోకుంటే నాలుగు మాటలు మాట్లాడితే ముత్యాలు రాలిపో తాయా? మళ్ళీ బి. ఏ. వెలగబెట్టింది. ఎందుకు? ఈమాత్రం సంస్కారం లోపించాక చదువెందుకు, చట్టుబండ లెందుకు....?

అయితే మనస్సులో కోపాన్ని పైకి వెల్లడించలేకపోయాడు గౌతమ్. అందంగా,అమాయకంగా ఉండే లావణ్య వదనం చూస్తే ఆగ్రహం లోలోపలే అణ గారిపోయి వెల్లువలా అనురాగమే ఉరికిం దతడి హృదయం నుండి.

రోజులు గిర్రున తిరిగిపోతూ చూస్తుండగానే లావణ్య కాపరానికి వచ్చి సంవత్సరం పూర్తయింది. ఈ సంవత్సర కాలం గౌతమ్‌కి మాధుర్యంకంటె అసం తృప్తినే ఎక్కువ ఇచ్చిందేమో! పెళ్ళయి సంవత్సరం గడిచినప్పటికీ ఇద్దరిమధ్యా మానసికంగా పెళ్లయినరోజు ఎంత దూర ముందో ఈనాడూ అంతే దూరముంది. గౌతమ్ ఎంత ప్రయత్నించినప్పటికి

లావణ్య అతడికి చేరువ కాలేదు. ఆమె మొహంలో నిర్లిప్తతే తప్ప సంతోష చిహ్నాలే చూడలేకపోయాడు. తన కౌగిలిలో సైతం ఉదాశీనంగా ఉండే భార్య ధోరణి అర్థంకాక తీరని అశాంతికి గురయ్యాడు గౌతమ్. వద్దనుకున్న కొద్దీ అన్నా వదినల అన్యోన్యతే గుర్తుకొస్తూ అతడి మనస్సుకయిన గాయంమీద కారంజల్లినట్లు ఫీలవుతాడు. శ్రీధర్ ఇంట్లో ఉన్నంతసేపు అతడి నీడలాగే అతడినంటిపెట్టుకునుంటుంది రాజేశ్వరి. సాయంత్రం అతను ఇంటికి వచ్చేటప్పటికి బయటికి వెళ్ళేందుకు రెడీగా ఉంటుంది. చెట్టాపట్టాలేసుకుని ఇద్దరూ ఏ బీచికో, సినిమాకో వెళ్ళిపోతారు. ఎక్కడికీ వెళ్ళనిరోజు డాబా మీదికి వెళ్ళి చుట్టూ ప్రపంచంతో నిమిత్తం లేకుండా తమ లోకంలో తాముంటారు. ఒకరికొకరు సరదాగా అన్నం తినిపించుకోవడం గౌతమ్ ఎన్నోసార్లు గమనించాడు. ఇంతకీ వాళ్ళది పెద్దలు చేసిన పెళ్ళే. పెళ్ళికిముందు ఒకరికొకరు పూర్తిగా అపరిచితులే. ఇప్పుడు - ఒకరికోసమే ఒకరు బతుకుతున్నట్లు జీవిస్తున్నారు.

మరి అమ్మ, డాడీ మాత్రం...

పెళ్ళయి ముప్ఫయి అయిదేళ్ళయినప్పటికీ ఈనాటికీ ఒకరిని విడిచి ఒకరు ఉండలేరు. తను గుమ్మందాటిన క్షణం నుండి మళ్ళీ ఇల్లు చేరేదాకా, ఈమధ్య జరిగిన విశేషాలన్నీ పూసగుచ్చినట్లు అమ్మతో చెప్తేనే డాడీకి తృప్తి. ఇంట్లో నౌఖర్లున్నప్పటికీఆయనపనులు స్వయంగా అమ్మే చేస్తుంది. 'ఎందుకమ్మా వంటింట్లో ఆ వేడిలో ఉడికిపోతావు. వంటమనిషిని పెట్టుకోరాదా' అంటే, 'ఈ చేతుల్తో స్వయంగా వండి ఆయనకు వడ్డిస్తేనే నాకు తృప్తి' అంటుంది. ఈనాటి స్త్రీలా ఆమె భర్తతో ఏనాడూ 'డార్లింగ్ ఐ లవ్‌యూ' అనుండదు. అయితే ఆమె ప్రతి చూపులో, ప్రతి మాటలో, ప్రతి చర్యలో ఆయనపట్ల తనకున్న అనురాగం వెల్లడవుతూనే ఉంటుంది. నిష్కల్మషమయిన ఆమె ప్రేమానురాగాలే డాడీ మొహంలో సంతోషం, సంతృప్తులుగా ప్రతిబింబిస్తున్నాయేమో!

అమ్మ, వదిన, చెల్లి... ఇంకా తనకు తెలిసిన ఎందరో స్త్రీలు మనసా వాచా క్రియా భర్తకు నిజమయిన తోడునీడగా, జీవన సహచరులుగా ఉంటున్నారు.

మరి తను చేసిన పాపం ఏమిటి? తన భార్యజీవితం తన జీవితానికి సమాంతరంగానే సాగిపోతున్నది. ఆమెను హృదయానికిచేర్చుకోవాలని తను ప్రయత్నించేకొద్దీ ఆమె దూరంగానే ఉండిపోతున్నది....

గౌతమ్ అశాంతిగా నుదురు రుద్దుకున్నాడు.

బుద్ధి తెలిసినప్పటినుండి డాడీ పనులు అమ్మ స్వయంగాచేయడం చూస్తున్నాడేమో తనభార్య అలాగే చేయాలన్న కోరిక అతడి హృదయంలో గాఢంగా నిలిచిపోయింది. కాని, జరుగుతున్నది అందుకు భిన్నంగా ఉంది.

పొద్దున్న ఎనిమిది గంటలకల్లా గౌతమ్ హాస్పిటల్‌కి వెళ్ళిపోవాలి. ఏ ఒక్కరోజూ ఆ టైముకి నిదురలేవదు లావణ్య. మధ్యాహ్నం భోజనానికి వచ్చినా బెడ్ రూం నుండి ఇవతలికిరాదు. ఇక రాత్రి... అతడింటికి వచ్చేటప్పటికి ఆమె గాఢ నిద్రలో ఉంటుంది. లేపినా లేవదు. మాట్లాడిస్తే అడిగిందానికి జవాబిచ్చి పుస్తకంలో తల దూర్చేస్తుంది. ఎంత మితభాషిణి అయితేమటుకు భర్త

మితభాషిణి అయితేమటుకు భర్త సమక్షంలోనూ అలాగేనా ఉండేది?

అశాంతితో గౌతమ్ మనస్సు వేగి పోతున్నది.

భార్య తనను ప్రేమానురాగాలతో అభిషేకించాలని, తల్లిలా ప్రేమించి, సోదరిలా అభిమానించి స్నేహితురాలిలా ఆదరించి, ప్రేయసిలా లాలించాలని, ఆమె ఒళ్ళో సేదదీరాలని, ఆమె కౌగిలిలో పరవశించాలని....



ప్రతిమగాడు కోరుకుంటాడు.

గౌతమ్ కూడా అలాగే కోరుకున్నాడు.

కానీ అతి సామాన్యమయిన ఆకోరిక అతడి విషయంలో తీరని కోరికే అయింది. భార్య ఉద్దేశమేమిటో అతడికర్థంకాలేదు. ఒక్క విషయం మాత్రం స్పష్టమయింది. భార్యనుండి తను ఆశించే ప్రేమానురాగాలు ఆమెనుండి ఈ జన్మలో తను

పొందలేదు. ఎందరో అమ్మాయిలను ఆకర్షించిన తను భార్యను మాత్రం ఆకర్షించలేకపోతున్నాడు ... ఆమెను తనకు అనుకూలంగా మలచుకోలేక పోతున్నాడు.

భార్య తననెందుకు ప్రేమించలేక పోతున్నది?

ఈ ప్రశ్న అతడి హృదయంలో సుళ్ళు తిరుగుతూ వేధిస్తున్నది.

లావణ్యకు ప్రేమించే హృదయం లేదా?

లేక తమ మధ్య మరో వ్యక్తి ఉన్నాడా?

ఆ మాట ఆలోచనలోకి రాగానే షాకు కొట్టినట్లు ఉలిక్కిపడ్డాడు గౌతమ్.

లావణ్య ప్రవర్తన గమనించేకొద్దీ తన అనుమానం నిజమేనేమో అనిపిస్తోంది. ఫలితంగా అనురాగం స్థానే ఆగ్రహం చోటుచేసుకుంది.

భార్య నుండి శారీరక సుఖం పొందాలన్న కోరిక ఇప్పటికే అతడిలో పూర్తిగా నశించింది. భార్యాభర్తల మధ్య అవ్యాజానురాగాలు ఉన్నప్పుడే శారీరకంగా కలుసుకున్నప్పుడు పరిపూర్ణ తృప్తిని పొందగలరు. అనురాగం ఏ ఒక్కరిలో లోపించినా అది వ్యభిచారమే అవుతుందతడి దృష్టిలో. అందుకే భార్యకు దూరంగా మరో మంచం మీద పడుకోసాగాడు.

మొదటిరోజు ఆశ్చర్యంగా చూసింది లావణ్య. అయితే భర్తను ప్రసన్నుడిని చేసుకునే ప్రయత్నమేమీ చేయకపోగా తనకిపద్ధతే బాగుందన్నట్లు నిశ్చింతగా ఉండిపోయింది.భార్య మనస్సులో మరో వ్యక్తి ఉన్నాడని గౌతమ్‌కి రూఢి అయిపోయింది. అయితే, మరో వ్యక్తిని ప్రేమిస్తూ తనతో పెళ్ళికెందుకు అంగీకరించింది? తన బతుకులో నిప్పులు పోసేందుకా?

గౌతమ్ గుండెలు రగిలాయి.

విడాకులకు ప్రయత్నించాడు. అయితే ప్రాణాలకన్న పరువు ప్రతిష్ఠలకు ప్రాధాన్యతనిచ్చే మామగారు తన వంశ గౌరవం కోర్టు పాల్జేయవద్దని కాళ్ళమీద పడ్డారు. అతడి తల్లిదండ్రులూ తొందర పడవద్దనే నచ్చచెప్పారు. గౌతమ్ హృదయంలో భార్యంటే ఏదో మూల ఇంకా స్త అనురాగం మిగిలిఉంది. అందుకే పెద్దల విన్నపాన్ని కాదనలేకపోయాడు.

లావణ్యలోనూ మార్పొచ్చింది. పూర్వంలా భర్తకు దూరంగా ఉండిపోవడం లేదు. అతడింట్లో ఉన్నంత సేపూ అతడితోనే గడుపుతోంది. అతడి పనులు స్వయంగా చేస్తోంది. అతడు పలకరించకపోయినా తనే కల్పించుకుని మాట్లాడుతోంది. తోబుట్టువులను గురించి, స్నేహితులను గురించి ఉత్సాహంగా చెబుతోంది. భోంచేసేటప్పుడు కొసరి కొసరి వడ్డిస్తూ అతడితో సినిమాలకు షికార్లకు వెళ్ళేందుకు ఉత్సుకత చూపుతోంది. అయితే అది కేవలం నటన అని తెలుసుకోలేనంత అమాయకుడేమీ కాదు గౌతమ్. కాపురం కూలిపోకుండా నిలబెట్టుకోవాలని, ఆమె తనను ప్రేమిస్తున్నట్లు నటిస్తున్నదని అతడికి తెలుసు. పరిస్థితులతో రాజీ పడేందుకే నిశ్చయించుకున్నాడతను. స్వచ్ఛమయిన అమృతధార బదులు కలుషిత జలంతోనే సరిపెట్టుకొనేందుకే నిర్ణయించుకున్నాడు. అయినా మనస్సులోని చేదు అలాగే ఉండిపోయింది.

* * *

ఒక పేషంటుకి బోన్‌మారో ట్రాన్స్

ప్లాంటేషన్ జరుగుతోంది.

పేషంటు ఎనిమిదేళ్ళ దీపిక. ఆమె అన్న పదేళ్ళ కిరణ్ చెల్లి కోసం బోన్ మారోదానం చేసి ఆ వయస్సుకే ఆదర్శ సోదరుడయ్యాడు.

ఆపరేషన్ ప్రారంభమయి రెండు గంటలయింది.

బోన్ మారో ట్రాన్స్‌ప్లాంటేషన్ ద్వారా బ్లడ్ కేన్సర్ వాతబడ్డ పసిపిల్లలను కాపాడే ప్రయత్నం భారతదేశంలో ఇపుడిపుడే ప్రారంభమయింది. వెల్లూరు హాస్పిటల్లో ఆ ఆపరేషన్ జరగడం ఇదే మొదటిసారి. ఆపరేషన్ చేస్తున్నది విశ్వవిఖ్యాతి పొందిన డాక్టర్ రిచర్డ్సన్. ఆయనకు సహాయం చేస్తున్న డాక్టర్ల బృందంలో గౌతమ్ ఒకడు. ప్రపంచంలోని మేటి సర్జన్లలో ఒకరయిన డాక్టర్ రిచర్డ్సన్ అంటే గౌతమ్‌కి ఎంతో ఆరాధన. సర్జనుగా ఆయన స్థాయికి ఎదగాలన్నదే ప్రస్తుతం అతడి ధ్యేయం. అందుకే మనస్సుని, ఆలోచనలను పూర్తిగా వృత్తికే అంకితం చేసి హాస్పిటలే సర్వస్వంగా బతుకుతున్నాడు. వృత్తి ధర్మాన్ని తపస్సులా అతడు ఆచరిస్తున్న తీరు డాక్టర్ రిచర్డ్సన్‌ని ఆకట్టుకుంది. ప్రతిభకు, కార్యదీక్షకు అత్యంత విలువనిచ్చే ఆయనకు గౌతమ్ అంటే ప్రత్యేకాభిమానం ఏర్పడింది. ఫలితంగా ఆయన మేజర్ ఆపరేషన్ చేసే ప్రతి సందర్భంలోనూ సహాయక బృందంలో గౌతమ్ ప్రథముడుగా ఉంటున్నాడు.

ఆపరేషన్ విజయవంతంగా పూర్తయింది. పేషంటుకిహ ప్రాణభయం లేదు. అయితే ఆమె పరిస్థితిలో ఎదురుచూడని కాంప్లికేషన్స్ రావచ్చు. మరో నాలుగు అయిదురోజులు అతిజాగ్రత్తగా కనిపెట్టుకునుండాలి. అందుకే పేషంటుని ఇంటెన్సివ్ కేర్‌వార్డుకి పంపించేసారు.

ఆమె తల్లిదండ్రులకు ధైర్యంచెప్పి డాక్టర్స్ రూంకి వెళ్ళి అలసటగా ఓ మంచంమీద వాలిపోయాడు గౌతమ్. గంట తర్వాత లేచి చల్లటి నీళ్ళతో మొహం కడిగాక అలసట కొద్దిగా తగ్గినట్లనిపించింది. హాస్పిటల్ కాంటీనుకి వెళ్ళి సాండ్ విచెస్ తిని కాఫీ తాగాడు. కాఫీ తాగుతుండగా—

"హలో డాక్టర్!" అని పలకరించింది స్పందన.

మెడిసిన్ ఫైనలియర్ చదువుతున్న ఆమెనుచూస్తే గౌతమ్‌కి అడవిలో హాయిగా, స్వేచ్ఛగా గంతులేసే జింకపిల్ల గుర్తొస్తుంది. స్పందనది చాలా చురుకు స్వభావం. ఆడ, మగ తేడాలేకుండా అందరితోనూ గలగలా మాట్లాడుతూ, నవ్వుతూ నవ్విస్తూ చైతన్య స్రవంతి లాగుంటుంది. ఆమె ఉన్నచోట ఉత్సాహం చిందులు వేస్తుంటుంది. కాఫీ సిప్‌చేస్తూ తననే పరధ్యానంగా చూస్తున్న గౌతమ్‌ని చూస్తుంటే స్పందన మనఃచక్షువుల ముందు అతడు తనముందు మోకరిల్లి ప్రణయసుమ నీరాజనం సమర్పిస్తున్నట్లనుపించింది. ఆమె హృదయం అట్టడుగు పొరల్లో దాగిన కోరిక అది. చూసిన మొదటిరోజే తన మనస్సు దోచుకున్న అతడు తననారాధించాలనే తపన ఆమెది.

తను ప్రేమించేవ్యక్తి తనను ప్రేమించాలని ఆశించడం సర్వసహజం. అయితే అతి స్వల్పమయిన కోరికలు కూడా కొందరి విషయంలో తీరని కోరికలే అవుతాయని ఆమెకు తెలుసు. తననాక

క్షించిన వ్యక్తి వివాహితుడు. పైగా రూపం దృష్ట్యా అతడి భార్యముందు తను దీపంముందు మిణుగురు పురుగులాగుంటానని కూడా ఆమెకు తెలుసు. అటువంటప్పుడు అతడు తనకు ప్రణయనీరాజనాలర్పించాలని ఆశించడం హాస్యాస్పదం. అందుకే తన ప్రేమను, ఆరాధనను, కోరికలను మనస్సులోనే దాచేసుకుంది. గుండెల్లో అలజడిని గుండెల్లోనే దాచేసుకుని పైకి ఎప్పట్లాగే నవ్వుతూ తుళ్ళుతూ ఉండటం నేర్చుకుంది. అందుకే...

"ఏమిటి డాక్టర్...ఇల్లు, ఇల్లాలు ఉండగా హాస్పిటలే లోకంగా బతుకుతారు?" అని అడిగింది స్పందన.

"పరమపవిత్రమయిన వైద్య వృత్తిని చేపట్టినవాళ్ళు వృత్తికే తమ జీవితాలు అంకితం చేయాలని మీకు తెలీదూ?" ఎదురు ప్రశ్నించాడు గౌతమ్.

"నిజమేకాని భర్తనే నమ్ముకుని బతికే అర్ధాంగిని నిర్లక్ష్యం చేయకూడదంటారు..."

"ఎవరు?"

"పెద్దలు"

"పెద్దలకేం వినేవాళ్ళుంటే ఎన్నయినా చెబుతారు" నిర్లక్ష్యంగా అన్నాడు గౌతమ్.

కాఫీ సిప్ చేస్తూ ఏదో ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయింది స్పందన.

"మీ డాడీ ఏం చేస్తుంటారు?" కాసేపు తర్వాత అడిగాడు గౌతమ్.

చేతి గడియారంలో టైం చూసి, "ఈవేళప్పుడు హాయిగా గుర్రుకొడ్తుంటారు" అంది స్పందన. ఆమె కంఠంలో చిలిపిదనం చిందులు వేస్తోంది.

"నేనడిగింది అదికాదు"

నవ్వేసింది స్పందన. "డాడీ సెంట్రల్ జైల్ సూపర్నెంట్ గాచేస్తున్నారు. ప్రస్తుతం వరంగల్లులో ఉన్నారు"

'ఈ అమ్మాయి ఎంత హాయిగా నవ్వగలదు' అనుకున్నాడు గౌతమ్.

"వరంగల్లులో మెడికల్ కాలేజి ఉందిగా.ఇంత దూరం ఎందుకు వచ్చారు?"

"నేనిక్కడ చేరినప్పుడు డాడీ హైదరాబాదులో ఉన్నారు"

"అలాగా!"

"నేను మీకన్న కనీసం పదేళ్ల చిన్నదాన్నేమో. నన్ను ఇలా మీరు 'మీరు'అని మన్నించడం నాకు నచ్చలేదు. హాయిగా నువ్వు అనరాదూ?"

స్పందనవేపు చూశాడు గౌతమ్.

చామనఛాయగా బక్కపలచగా అతి సామాన్యమయిన రూపురేఖలతో ఉండే స్పందనను పదేపదే చూడాలనిపించదు. అయితే ఆమె స్నేహార్ద్రత పలువురిని ఆకర్షించింది. ఆ ఆకర్షణా వలయంలో తన ప్రమేయం లేకనే చిక్కుకుపోయాడు గౌతమ్. ఆమెతో పరిచయం పెరిగినకొద్దీ ఆమెదెంత విలక్షణమయిన వ్యక్తిత్వమో తెలుసుకోగలిగాడు. ఆమె చలాకీదనం వెనక దాగిన నిండు హృదయం, ఆమె విజ్ఞానతృష్ణ,బాధాతప్తులపట్ల ఆమె చూపే కరుణ, అన్నిటినిమించి అలసిన హృదయాన్ని సేదదీర్చే స్నేహపూరితమయిన మాటలు...గౌతమ్ గ్రహించేటప్పటికి ఆమె అతడి హృదయానికి అతి సమీపానికి వచ్చేసింది. ఆమె కళ్లలోకి చూస్తూ ఆమె చల్లని మాటలు వింటుంటే మండుటెండలో ఎడారిలో ఎంతో దూరం నడిచాక వటవృక్షఛాయలోకి చేరుకున్న అనుభూతి పొందుతాడు. తను ఆమెను గురించి ఆలోచించడం తప్పు అనుకుంటూనే, ఆమెతో జీవితం పంచుకో

బోయే అదృష్టవంతుడెవరోనని అనుకో కుండా ఉండలేదు.

"నిన్ను చూసేందుకు మీ డాడీ రారా?" ఏదో ఆలోచిస్తూ అడిగాడు గౌతమ్.

"వచ్చేనెల వస్తానని రాసారు" ఉత్సాహంగా చెప్పింది స్పందన.

"నన్ను మీ డాడీకి తప్పక పరిచయం చేయాలి"

"ష్యూర్. మీలాగే ఆయన టెన్నిస్ బాగా ఆడగలరు..."

"రియల్లీ?"

"ఆ...డాడీ చదువుకున్న రోజుల్లో యూనివర్సిటీ ఛాంపియన్‌గా ఎన్నో బహుమతులందుకున్నారు. ఈనాటికి రోజుకోగంటయినా టెన్నిస్ ఆడందే ఆయనకు తోచదు"

"అయితే ఆయనతో తప్పక ఓ గేమ్ ఆడాలి"

"డాడీ అదేమాటన్నారు"

"ఏ మాట?" ఆశ్చర్యంగా అన్నాడు గౌతమ్.

"ఇక్కడికి వచ్చినప్పుడు మీతో తప్పక ఓ గేమ్ ఆడాలని"

"నా గురించి మీ డాడీతో చెప్పారా?" స్పందనవేపు పరిశీలనగా చూస్తూ అడిగాడు గౌతమ్.

"ఏదో మాటల సందర్భంలో ఓసారి చెప్పాను" కాజువల్‌గా అంది స్పందన.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"డాక్టర్! ఆ అమ్మాయికిహ పర్వా లేదా?" అడిగింది స్పందన.

ఆశ్చర్యంగా చూసాడు గౌతమ్ "ఏ అమ్మాయికి?"

"పొద్దున్న బోన్ మారో ట్రాన్స్ ప్లాంటేషన్ చేసారే ఆ అమ్మాయి..."

"ఆఁ... ఇహ భయంలేదు. త్వరలోనే కోలుకుంటుంది"

"పోనీ పాపం. ఒక్కతే కూతురట. ఆ తల్లికిహ బిడ్డలుపుట్టే అవకాశంలేదట. తనుపుట్టి ఇంటికే వెలుగుతెచ్చిన పాపను ఈ కాన్సర్ మహమ్మారి బలితీసుకుంటుం దేమోనని ఇన్నాళ్ళూ నిద్రాహారాలులేక అలమటించార్ట ఆ తల్లిదండ్రులు. భగ వంతుడు వాళ్ళను కరుణించాడు. డబ్బు ఖర్చయినప్పటికీ పాప దక్కింది"

"ఏమిటో...ఈ మమతలు, బంధాలు, అనుబంధాలు మనుషులను విచిత్రంగా కట్టిపడవేస్తాయి"

"అక్కడే మనిషికి, జంతువుకి మధ్య తేడా" సాలోచనగా అంది స్పందన.

గౌతమ్ మాట్లాడలేదు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిన పిమ్మట గౌతమ్ అన్నాడు "ఇంట్లో మీ డాడీతోబాటు ఇంకా ఎవరెవరుంటారు?"

"డాడీ ఒక్కరే ఉంటారు"

"మీ అమ్మగారు?"

"తల్లిని మింగి పుట్టిన దౌర్భాగ్యు రాలిని నేను" విషాదంగా అంది స్పందన.

"తోబుట్టువులు?"

"ఎవరూలేరు. డాడీకి ప్రథమ సంతానం, ఆఖరి సంతానం..అంతా నేనే" భారంగా అంది స్పందన.

"హల్లోడాక్టర్! డ్యూటీ లేదా? తీరిగ్గా మాట్లాడుకుంటూ కూర్చున్నారు"

డాక్టర్ కుమార్ పలకరించాడు.

గౌతమ్ టైంచూసి "నాలుగ్గంటలు దాకా నాకు ఫ్రీ" అని స్పందనను ద్దేశించి "నీకు క్లాసుల్లేవా?" అడిగాడు.

"లేదు. కానీ లైబ్రరీకెళ్ళాల్సిన పనుంది" అని వెళ్ళిపోయింది స్పందన.

ఆమె వెళ్తున్నవయిపే చూస్తూ "అయ్ థింక్ షి ఈజ్ ఇన్ లవ్ విత్‌యూ" అన్నాడు డాక్టర్ కుమార్.

గౌతమ్ మొహం ఎర్రబడింది. "ఛ!"

"ఏమో, నాకలా అనిపించింది మరి..."

"నాతో అంటే అన్నావు ఇంకెవరితోనూ చెప్పకు. మళ్ళీ స్పందన వింటే నొచ్చుకుంటుంది"

కటువుగా అన్నాడు గౌతమ్.

ముఖం గంటుపెట్టుకుని, "నేనెందుకు చెప్తాను. అయినా మీరిద్దరూ ఇలా గంటల తరబడి మాట్లాడటం, తెలుగుసినిమాలు చూసే మిషతో తరచు ఇద్దరూ కలసి చిత్తూరు వెళ్ళడం....మీ ఇద్దరి మధ్య ఏదో కథ నడుస్తున్నదని హాస్పిటల్లో అందరూ చెవులు కొరుక్కుంటున్నారు" కుమార్ మాటవిని గౌతమ్ మొహం పాలిపోయింది.

"మా ఇద్దరి మధ్య స్నేహమే తప్ప మరోటిలేదు"

"నీకు స్నేహభావమే ఉండవచ్చు. కానీ స్పందన....నిన్ను ప్రేమిస్తున్నది"

"పెళ్ళి కావలసిన అమ్మాయి గురించి ఇలా మాట్లాడ్డం భావ్యంకాదు. మరెన్నడూ అలా మాట్లాడకు.నాకు నచ్చదు"నిర్మొహమాటంగా చెప్పేసాడు గౌతమ్.

ఛ, ఆత్మీయంగా మాట్లాడుతూనే ఎంత వక్రంగా ఆలోచించగలరు?

లోలోపల విసుక్కున్నాడు గౌతమ్. అదే సమయంలో స్పందన తనను ప్రేమిస్తున్నదేమో అన్న భావన మంచి గంధం పూతలా హాయిని గొలిపింది. అసలు ఎటువంటి ప్రత్యేకత లేని స్పందనకేసి తనెందుకింతగా ఆకర్షింపబడుతున్నాడు. ఎంత ఆలోచించినా అతడి కర్థం కాలేదు.



ఆలోచిస్తూనే ఇంటెన్సివ్ కేర్ వార్డుకి వెళ్ళి దీపికను చూసాడు.

ఆ అమ్మాయికింకా స్పృహరాలేదు. దిగులు మొహంతో కూర్చుని ఉన్న వాళ్ళమ్మను చూసి "ఏమండీ, భోం చేసారా?" ఆదరంగా అడిగాడు గౌతమ్.

సజల నేత్రాలతో చూసింది దీపిక తల్లి. "అమ్మాయి ఇలా పడిఉంటే తిండి మీదికి మనస్సు పోతుందా?"

"ఇహ భయపడాల్సిన అవసరం లేదమ్మా. నెలరోజుల్లో పాప కోలుకుని స్కూలుకి వెళ్తుంది. నా మాట నమ్మండి" అనునయంగా అన్నాడు గౌతమ్.

"మీ అమ్మ కడుపు చల్లగా మీ మాటలు నిజమయితే రోజూ మీ పేరు చెప్పుకుని దేవుడి ముందు దీపం పెడ్తాను" అందామె.

దుఃఖంతో విచలిత అయిన ఆమెను ఆర్ద్రంగా చూసాడు గౌతమ్.

మనుషులు, వారిని కట్టిపడవేసే అనుబంధాల మీద రిసెర్చ్ చేయాలని ఆశించే వారికి అనువయిన స్థలం హాస్పిటల్!

ఎన్నో రకాల మనుషులు, వారి విభిన్న మనస్తత్వాలు...

వ్యథలు, బాధలు, బంధాలు, అనుబంధాలు, అనురాగాలు, ఆత్మీయతలు...

కాళ్ళు చేతులు ఆంప్యుటేట్ చెయ్యబడినా చలించని ధీరగంభీరహృదయులు..

కాస్త కడుపునొప్పికే ముల్లోకాలు ఏకం చేసే దుర్బల మనస్కులు...

ఆత్మీయులకు అతిస్వల్పమయిన సుస్తీచేసినప్పటికి తల్లడిల్లిపోయే అనురాగార్ద్ర హృదయులు...

తాళిగట్టిన భార్య మరణశయ్య మీదున్నా ఖాతరు చేయని కఠినచిత్తులు...

దివారాత్రాలు నిద్రాహారాలు విస్మరించి సేవా శుశ్రూషలు చేసే సేవాతత్పరులు...

రోగి ఆశించే ఒక చల్లని మాటసైతం పలకక నిర్లక్ష్యంగా, నిర్లిప్తంగా ఉండి పోయేవాళ్లు...

ఒకరోగిని పరివేష్టించి తల్లిదండ్రులు, భార్యాబిడ్డలు, తోబుట్టువులు,ఆత్మీయులు- ఇంకా ఎందరో...

మరో రోగి పలకరించే దిక్కులేక అనాధలా పడుంటాడు.

మనుషులకొచ్చే రోగాల్లాగే వాళ్ల మధ్య అనురాగాలు, ఆత్మీయతలు, బంధాలు, అనుబంధాలు చిత్రవిచిత్రంగా ఉంటాయి. ముఖ్యంగాఎవరికర్మ వారనుభవించక తప్పదన్నమాట ఎంత నిజమో హాస్పిటల్లో కాసేపు గడిపిన వారికి తెలుస్తుంది.

సాయంత్రం ఇంటికివెళ్ళి స్నానంచేసి టెన్నిస్ రాకెట్ పట్టుకుని క్లబ్బుకి వెళ్ళిపోయాడు.

తొమ్మిది గంటల్దాకా క్లబ్బులోనే గడిపి ఇంటికి వెళ్లాడు.

అతడికోసం ఎదురుచూస్తూ ముందు గదిలోనే కూర్చునిఉంది లావణ్య.

ఆమె వడ్డిస్తుంటే మౌనంగా భోంచేసి వెళ్లిపోయాడు గౌతమ్.

డైనింగ్ టేబిల్ శుభ్రంచేసి లావణ్య వచ్చేటప్పటికి అతడు ఏదో పుస్తకం దీక్షగా చదువుతున్నాడు. కొన్ని నిమిషాలు అతడివంక తదేకంగా చూసి బెడ్ రూంకి వెళ్లిపోయింది లావణ్య.

ఆమె రావడం, పోవడం గమనిస్తూనే ఉన్నాడు గౌతమ్.

కాగితం పువ్వుకి చౌకరకం సెంటు పులిమినట్లు మనస్సులో లేని అనురాగం ఆమె అభినయించడం...

ఆమె అంటే అయిష్టం రోజు రోజుకి ఎక్కువవుతోంది. కాని ఆ యిష్టం, ద్వేషం, అసహనం-అన్నిటిని దిగమింగి తల్లిదండ్రులకొసరం, సమాజంకోసరం ఆమెతో కాపురం చేయక తప్పదంలేదు.




సర్జరీలో శిక్షణ విజయవంతంగా పూర్తిచేశాడు గౌతమ్. స్టడీ లీవూ పూర్తయింది. అనుకున్నది సాధించానన్న తృప్తికన్న, దాదాపు నలభయి నెలలుగా అలవాటయిన హాస్పిటల్ని, స్నేహాభిమానాలతో ఆదరించిన తక్కిన హాస్పిటల్ స్టాపుని వదిలి వెళ్ళాలన్న దిగులు ఎక్కువయింది- ముఖ్యంగా స్పందన...

తన జీవన ఎడారిలో ఒయాసిస్సులాంటి ఆమెను వదిలి వెళ్ళిపోవాలన్న ఆలోచనే గుండెల్ని నిర్దాక్షిణ్యంగా నలిపేస్తూ మనశ్శాంతిని దూరంచేసింది. తన హృదయాన్నామె ఎంతగా ఆక్రమించుకుందో అప్పటికి అతడికి బాగా అర్థమయింది. కానీ ఆమెను తను కలలోనయినా ఆశించరాదు.

ఆమె మరొకరికి వాగ్దత్త అయింది!

స్పందన తండ్రి నిరంజనరావుగారు వెల్లూరు వచ్చినప్పుడు ఆ నిజం తెలిసి హతాశుడయాడు గౌతమ్.

స్పందన వివాహం ఆమె మేనమామ కొడుకు గిరిధర్‌తో నిశ్చయమయింది. అతనూ డాక్టరే. స్టేట్స్‌లో సెటిలయాడు.

స్పందన చదువు పూర్తయిన వెంటనే వాళ్ళ వివాహం జరుగుతుంది. ఆమె శ్రేయోభిలాషులు సంతసించదగ్గ శుభ వార్తే. కానీ ఆ శుభవార్త విని గౌతమ్ ఆనందించలేదు. తనదనుకున్న పెన్నిధిని మరెవరో కొల్లగొట్టుకుపోతున్నట్లు గిలగిల్లాడిపోయాడు. ఎన్నడూ చూడని ఆ గిరిధర్ పట్ల ఈర్ష్యాసూయలతో హృదయం భగ్గుమంది.

"డాక్టర్!"

ఉలిక్కిపడి చూశాడు.

స్పందన.

"రేపేనా మీ ప్రయాణం?" గౌతమ్‌కి కొద్ది దూరంలో కూర్చుంటూ అడిగింది స్పందన.

ఆమెవేపు చూశాడు గౌతమ్.

ఆమె మొహంలో దట్టంగా నీలినీడలు.

"ఆఁ. సామాన్ల లారీ వెళ్ళిపోయింది. మేము రేపు పొద్దున్నే బయల్దేరాలనుకుంటున్నాం" నిరుత్సాహంగా చెప్పాడు గౌతమ్.

"నేను గుర్తుంటానా?"

ఆ మాటలంటుండగా స్పందన కంఠం వణికింది.

"స్నేహామృతధారలు కురిపించిన నిన్ను మరచిపోగలనా?"

అతడివేపు ఆర్తిగా చూసింది స్పందన.

"పెళ్ళికి శుభలేఖ పంపుతావుకదూ?"

"మొదటి శుభలేఖ మీకే పంపుతాను. తప్పకరావాలి"

"ష్యూర్!"

ఇద్దరిమధ్య మౌనం స్వేచ్ఛగా కాసేపు విహరించింది.

స్పందనను ఓసారి హృదయానికి హత్తుకోవాలన్న కోరిక అతడి మనస్సులో జనించి క్షణాల్లో ఇంతింతయయి వటుడింతయయి అన్నట్లు అతడి అణువణువున వ్యాపించి అతడిని పిచ్చివాడిని చేసేసింది. ఆమె ఎదురుగా మరికాసేపు ఉంటే అంతపనీ చేసేస్తానేమో అని భయం వేసింది. చప్పునలేచి, "విష్ యూ ఆల్‌సక్సెస్!" అన్నాడు.

"సేమ్ టుయూ!"

"మళ్ళీ మనం కలుసుకునేది ఎప్పుడో, ఎక్కడో. సోలాంగ్ మైడియరెస్ట్ ఫ్రెండ్. గుడ్‌బై!" అని స్పందన జవాబుకోసం ఎదురు చూడకుండా చరచర వెళ్ళిపోయాడు.

గుంటూరు జనరల్ హాస్పిటల్లో పోస్టింగొచ్చిందతడికి.

అర్నెల్లక్రితమే సూర్యానికి గుంటూరు ట్రాన్స్‌ఫరయింది. అతడే ఇల్లు అదీ చూసిపెట్టి ఎంతో సాయంచేశాడు.

కొన్నాళ్ళకే గుంటూరు వాతావరణానికి అలవాటు పడిపోయాడు గౌతమ్.

హాస్పిటల్లో చాలామందితో స్నేహం కలిగింది. పైగా సూర్యం ఉన్నాడు. కాలక్షేపానికి లోటులేదు. తరచు స్పందన గుర్తొస్తూ మనస్సు అశాంతికి గురయినప్పటికి గుంటూరులో జీవితం సరదాగా ఉందనిపించింది.

గుంటూరు వచ్చాక లావణ్య కూడా ఉత్సాహంగా, సంతోషంగా ఉంటోంది. కళ్ళల్లో, మొహంలో నూత్నకాంతి చోటు చేసుకుంది. ఇద్దరూ తరచూ సినిమాలు, షికార్లు అంటూ తిరుగుతున్నారు.

అన్యభాషాప్రాంతమయిన వెల్లూరులో లావణ్య ఇమడలేకపోయింది. అందుకే అక్కడ ఉన్నన్నాళ్ళు నిరుత్సాహంగా మందకొడిగా ఉన్నది. అది తెలుసుకోలేక తను ఆమెను అపార్థం చేసు



కున్నాడు. గుంటూరులో రోజు రోజుకి కొత్తందాలు సంతరించుకుంటూ ఉత్సాహంగా,సంతోషంగాతనుకోరుకున్న విధంగా ఉంటున్న భార్యను చూసి ఈఏడాదిలోనూ భార్య వేపుకి మళ్ళీ ఆకర్షితుడు కాసాగాడు. అయితే స్పందన ఆలోచనలు అతడిని విడిపోలేదు. ఈ పాటికి స్పందన పెళ్ళి ఆమె బావగారితో జరిగి కాపరానికి స్టేట్స్ వెళ్ళిపోయి ఉంటుంది. తనకు శుభలేఖ పంపడం మరచిపోయిందా? ఆమె దృష్టిలో తమ స్నేహానికున్న విలువ అంతేనా?

గౌతమ్ మనస్సు చివుక్కుమంది.

ఎదుట ఉన్నంతసేపు ఎంత అభిమానం ఒలకబోసింది. కనుమరగవగానేఎంత తేలిగ్గా మరచిపోయింది. ప్చ్... ఆమె తప్పులేదు. తనకన్న అన్నివిధాలా అధికుడు గిరిధర్. పైగా భూతలస్వర్గమయిన అమెరికాలో కాపరం. అందునా కొత్తకాపరం. భర్త ముద్దు మురిపాలు, న్యూయార్క్ సిటీ సైట్ సీయింగ్, కొత్త పరిచయాలు, స్నేహాలు, పార్టీలు, పిక్నిక్కులు – వీటి మధ్య పాతనేస్తమయిన తనను గుర్తుంచుకునే తీరిక ఉంటుందా? కాలక్షేపానికి తనతో స్నేహంచేసింది. అది గ్రహించలేక వెర్రివాడిలా ఆమె చుట్టూ ఎన్ని ఆశలు అల్లుకున్నాడు?

ఆమె తనను స్వప్రయోజనాలకు వాడుకుందేమో అన్న అనుమానం కుమ్మరి పురుగులా హృదయాన్ని దొలిచేస్తుంటే స్త్రీజాతి మీద ద్వేషంతో మరోసారి హృదయం భగ్గుమంది.

మొదట తాళిగట్టిన భార్య.

ఇప్పుడు మనస్సు దోచుకున్న ప్రియురాలు...

ఎవరో ఒక స్త్రీ కారణంగా మనఃక్లేశం అనుభవించాలని తన నుదుట రాసిపెట్టిఉందా? లేకుంటే మృదుమధురంగా సాగిపోతున్న పాట మధ్య అపశ్రుతిలా తన జీవితంలో ఈ ఒడిదుడుకులేమిటి? అసలు తనలోనే ఏదో లోపం ఉన్నట్లుంది. తననాకర్షించిన వ్యక్తి మనస్సేమిటో తెలుసుకునే ప్రయత్నమయినా చేయక మనస్సునే పందిరిగా అమర్చి ప్రేమలతను పాకిస్తాడు. పందిరిమీద లత దట్టంగా వ్యాపించాక అపుడు తీరిగ్గా ఆ వ్యక్తి తనను ప్రేమించడం లేదేమోనని మథనపడటం తనకలవాటయింది. మనస్సులో మథనపడటమే తప్ప భార్యతోనూ తనెన్నడూ మనస్సు విప్పి మాట్లాడే ప్రయత్నమే చేయలేదు. ఇహ స్పందన...ఆమె స్నేహాన్ని కుమార్ తదితరుల్లాగే తనూ అపార్థం చేసుకున్నాడేమో? అయినా వివాహితుడయిన తను మరొకరితో జీవితం ముడిపడిన స్త్రీ తనను ప్రేమించాలని, కలకాలం గుర్తుంచుకోవాలని ఆశించడమేమిటి? కానీ ఎంత సరిపెట్టుకున్నా అతడి మనస్సు ఉపశమించలేదు. మూడేళ్ళ పరిచయాన్ని అంతత్వరగా మరచిపోవడమా? పెళ్ళి అన్నాక ఎక్కడెక్కడి బంధువులను గుర్తుంచుకుని మరీ శుభలేఖలు పంపుతారే. అటువంటప్పుడు స్పందన తనను మరచిపోతుందా? ఒకవేళ పెళ్ళి పోస్ట్‌పోన్ అయ్యిందేమో! ఆలోచించేకొద్దీ అలాగే జరిగి ఉండాలనిపించింది. స్పందననొకసారి కలుసుకుని సంగతేమిటో తెలుసుకోవాలని అతడి మనస్సు వేగిరపడసాగింది. ప్రస్తుతం స్పందన ఎక్కడ ఉంటున్నదో అతడూహించలేకపోయాడు. చదువయాక తండ్రివద్దకు వెళ్ళిపోతానని చెప్పింది. ఆమె తండ్రి వెల్లూరు వచ్చినప్పుడు తనకు వరంగల్లు నుండి ట్రాన్స్‌ఫర్ అయ్యే సూచనలున్నాయని చెప్పారు. ఇప్పుడు ఏ ఊళ్ళో ఉన్నారో ప్రయత్నిస్తే తెలుసుకోవడం పెద్ద సమస్యకాదు. కానీ గౌతమ్ ప్రయత్నించలేదు. అతడికి తను మళ్ళీ స్పందనను కలుసుకోకుండా ఉండిపోవడమే మంచిదనిపించింది.

ఆ వారాంతంలో అతడి తల్లిదండ్రులు గుంటూరు వచ్చారు.

కూలిపోతుందనుకున్న కొడుకు సంసారవృక్షం నిలదొక్కుకునికళకళలాడుతుండటం చూసి వాళ్ళ కన్న హృదయాలు

కుదుటబడ్డాయి. వాళ్ళు గుంటూరులో ఉన్న వారంరోజులు హాస్పిటల్‌కి వెళ్ళకుండా వాళ్ళతోనే గడిపాడు గౌతమ్.

సర్జనుగా కొడుక్కి ఊళ్ళో ఉన్న పేరుప్రతిష్ఠలు తండ్రి మనస్సుని సంతోషంతో పులకింపజేస్తే-కొడుకు, కోడలు మధ్య నెలకొన్న అన్యోన్యతానురాగాలు తల్లికి హాయిచేకూర్చింది. అయితే పెళ్ళయి ఆరేళ్ళు కావస్తున్నా కొడుకు ఇంట్లో బిడ్డ పారాడకపోవడం వాళ్ళకు క్లేశం కలిగించింది.

సుందరమ్మ మెల్లిగా కొడుకుని కదిపింది-"ఏమిట్రా నాయనా! బిడ్డలిప్పుడే అవసరం లేదనుకున్నారా?"

గౌతమ్ ఉలికిపడి చూసాడు. మరుక్షణం సర్దుకుని - "అబ్బే... అదేం లేదమ్మా" అన్నాడు.

"మరయితే కోడలు...." అని ఏదో చెప్పబోయింది సుందరమ్మ.

గౌతమ్ క్షణం సేపు ఆలోచించి అన్నాడు - "అమ్మా! నీతో ఓ మాట చెప్పాలి"

అనుమానంగా చూసింది సుందరమ్మ. "ఏమిటి?"

"నువ్వేమీ యాగీ చెయ్యనని మాట ఇవ్వు ముందు"

"అలాగే. అసలుసంగతేమిటో చెప్పు" అసహనంగా అంది సుందరమ్మ.

"అమ్మా... లావణ్య శరీర నిర్మాణం గర్భధారణకు అనువుగా లేదు" మెల్లిగా అన్నాడు గౌతమ్.

కొరడా దెబ్బతిన్నట్లు చూసింది సుందరమ్మ. "అంటే... అంటే...?"

"ఈ జన్మలో మాకు సంతానయోగం లేదు" నిర్వేదంగా అన్నాడు గౌతమ్.

కొడుకుమాటలువిని నిశ్చేష్టురాలయింది సుందరమ్మ.

గౌతమ్‌కి పిల్లలంటే చాలా మక్కువ. తన వయస్సు, హోదా మరచి ఈనాటికీ పసిపిల్లలతో సమానంగా ఆడుకుంటాడు. అల్లరి చేస్తాడు. ఆదివారాలు లాంటి సెలవు దినాల్లో చుట్టుపక్కల పిల్లల్ని చేర్చుకుని ఆటపాటల్లో పోటీలుపెట్టి ఆకర్షణీయమయిన బహుమతులిచ్చి ప్రోత్సాహపరిచేవాడు. బిస్కత్తులు, అయిస్‌క్రీముల్లాంటివి కొనిపెట్టి ఆ పసిహృదయాలకు అంతులేని సంతోషం కలిగించేవాడు. అలాంటి వాడికి సంతానప్రాప్తి లేదా?

ఆమె మాతృహృదయం గిలగిల్లాడింది.

"ఎవరయినా పెద్ద డాక్టరుకి చూపెడితే?"

"ఇండియాలో డాక్టర్ అహల్యకన్నా ఘటికురాలయిన గైనకాలజిస్ట్ మరొకరు ఉంటారని అనుకోను. ఆవిడ అమిత శ్రద్ధగా చెయ్యాల్సిన అన్ని పరీక్షలూచేసి ఈ జన్మలో లావణ్యకు మాతృత్వం సిద్ధించదని కచ్చితంగా చెప్పేసింది. అమ్మా... నిజంనీకు తెలియడం మంచిదని చెప్పాను. ఈ రహస్యాన్ని నువ్వు గుండెల్లోనే దాచుకోవాలి. ఎక్కడా నోరు జారకు. తనలో లోపం ఉందని తెలిస్తే బాధపడుతుందని లావణ్యకు నేను నిజం చెప్పలేదు. నువ్వూ ఏమీ అనబోకు" తల్లిని హెచ్చరిస్తూ అన్నాడు గౌతమ్.

"నేనెందుకు చెప్తాను?"

"ఏమో, మీ ఆడాళ్ళ నోట్లో నువ్వు గింజ నానదంటారు. అందుకే ముందస్తుగా హెచ్చరిస్తున్నాను. ఈ రహస్యం నీకు, నాకు తప్ప మూడో వ్యక్తికి తెలియరాదు"

నిట్టూర్చింది సుందరమ్మ. "అంగట్లో అన్నీ ఉండి అల్లుడినోట్లో శని అన్నట్లు ఇదేం ప్రారబ్ధంరా తండ్రీ?"

"పోనీలే అమ్మా... ఈ జన్మకింతే ప్రాప్తం అని ఊరుకోవాలి"

గౌతమ్ కంఠంలో బాధ రెపరెప లాడింది.

ఏదో ఆలోచిస్తూ కాసేపు మౌనంగా ఊరకుంది సుందరమ్మ.తర్వాతఅడిగింది-

"నీలో ఏమీ లోపం లేదుగా?"

ఆమె ఆలోచన చూచాయగా గ్రహించాడు గౌతమ్. "అమ్మా...?"

"ఆలోచించు నాన్నా! నీలో లోపం లేనప్పుడు ఈ జన్మకింతే అని ఎందుకు సరిపెట్టుకోవాలి? మీ తాతగారికి ప్రథమ కళత్రం వలన సంతానం లేకపోగా ఆమె అంగీకారంతో రెండో పెళ్ళి చేస్తేనే వంశం నిలిచింది..."

"అమ్మా" కోపంగా అన్నాడు గౌతమ్. "అటువంటి ఆలోచనలేం పెట్టుకోకు"

"మగవాడివి...తప్పేముందిబాబూ..." అంటూ అనునయంగా ఏదో చెప్ప బోయింది సుందరమ్మ.

"అమ్మా! ఒకసారి చెప్పిన మాటను పదే పదే చెప్పే అలవాటు నాకు లేదు" విసుగ్గా అన్నాడు గౌతమ్.

కొడుకు ఒక నిర్ణయం తీసుకున్నాడంటే మరి తిరుగుండదని ఆ తల్లికి తెలుసు. అందుకే, "నీ ఇష్టం నాయనా" అని ఊరుకుంది.

కానీ జీవితంలో దేనికీ లోటులేకుండా దర్జాగా హోదాగా బతుకుతున్న కొడుకు నిస్సంతుగా మిగిలిపోతాడన్న నిజం ఆమె మనస్సుని కలతబెట్టింది.

* * *

కాలగర్భంలో మరో అయిదు సంవత్సరాలు కలసిపోయాయి.

గౌతమ్ గవర్నమెంట్ జాబ్‌కి రిజైన్ చేసి విజయవాడలో నర్సింగ్ హోం రన్ చేస్తున్నాడు. అసమానమయిన ప్రతిభ, చిత్తశుద్ధి, అకుంఠిత కార్యనిరతితో ఏ కార్యం తలపెట్టినా మనిషి ఘనవిజయం సాధించడం తథ్యం. అందుకే సర్జనుగా ఎన్నో విజయాలు సాధించాడు గౌతమ్. విజయాన్నంటి పెట్టుకునే కీర్తిప్రతిష్టలు. తన జీవితలక్ష్యం నెరవేరిందన్న తృప్తి కలిగినప్పటికీ సాధించవలసింది ఇంకా ఎంతో ఉందనిపించింది. అందుకే తన జీవితాన్ని పూర్తిగా వృత్తికే అంకితం చేసాడు. ప్రజలలో నానాటికి పెరిగి పోతున్న అతడి పలుకుబడికి అంతు లేకుండా ఉంది.

గౌతమ్‌ది సహజంగా ఉదారస్వభావం. ఆపైన లక్షలు లక్షలు కూడబెట్టాలన్న తపనలేదు. ఇప్పుడున్నది తను, భార్య జీవితాంతం సుఖంగా గడిపేందుకు చాలు. అందుకే డబ్బుకోసం ఎవరినీ పీడించడు. నిరుపేదలయిన రోగులవద్ద పైస తీసుకోడు. ఎన్నో మేజర్ ఆపరేషన్లు సైతం డబ్బు ఇచ్చుకోలేని రోగులకు ఉచితంగానే చేసాడు. తనమీద ఎంతో నమ్మకం ఉంచి వచ్చేరోగులను కాదనలేని గౌతమ్‌కి క్షణం తీరికుండదు. ఇంత బిజీగా ఉండే అతడి గుండెల్లో సదా స్పందనే మెదులుతున్నది. సృష్టిలో అన్నిటికన్నా త్వరితగతిని పెరిగి వృద్ధి పొందేది 'ప్రేమ' అన్న నిజాన్ని గౌతమ్ స్వానుభవంతో తెలుసుకున్నాడు.భార్యతో సఖ్యంగా కాపరం చేస్తూనే మరో స్త్రీని తనింత గాఢంగా ప్రేమించడం అతడికెంతో విస్మయంగా ఉంది. భార్య కౌగిలిలో ఉన్నప్పుడు సైతం మనస్సు స్పందనచుట్టూ పరిభ్రమించడం అతడికి

భయాందోళనలు కలిగించేది. అయితే ఎంత ప్రయత్నించినప్పటికీ స్పందననుండి మనస్సు మరలించుకోలేకపోయాడు.

శాశ్వతంగా దూరమయిన ప్రేయసి గురించిన తలపు సహజంగా ప్రియుడికి మనఃక్లేశాన్ని కలిగిస్తుంది. అయితే చిత్రంగా స్పందన గురించిన ఆలోచన కర్తవ్యనిర్వహణలో అలసిన గౌతమ్ మనస్సుని జోకొట్టి అలౌకికమైన విశ్రాంతిని ప్రసాదిస్తుంది. ఆమె మంద స్మితవదనం గుర్తొస్తేనే మంత్రించి నట్లుగా అతడి అలసట మాయమవుతుంది. ఆమె తలపులే తనకింత శాంతి నిస్తుందే ఆమె సాహచర్యభాగ్యం లభించి ఉంటే జీవితం ఇంకెంత నిశ్చింతగా గడిచి పొయ్యేదో...

ప్చ్...గిరిధర్ అదృష్టవంతుడు!

స్పందన మనస్సు, జీవితం, తనువు, సర్వస్వం అతడికే అంకితం.

ఒక్కొసారి అతడి కౌగిలిలో స్పందనను ఊహించుకుంటే ఈర్ష్యతో, అసూయతో మనస్సు భగ్గుమనేది....

"అన్నయ్యా!"

ఆలోచనా నిమగ్నుడయిన గౌతమ్ ఉలిక్కిపడి చూసాడు.

ఎదురుగా స్వప్న.

స్వప్న భర్త రవీంద్రకూడా గవర్నమెంట్ జాబ్‌కి రిజైన్‌చేసి బావమరిదితో చేతులుకలిపి నర్సింగ్ హోంని రన్ చేయడంలో తోడ్పడుతున్నాడు. తీరిక సమయాలలో స్వప్న ఆఫీస్ వర్క్ గమనిస్తుంది.

"కూర్చో అమ్మా !'' ఆదరంగా అన్నాడు గౌతమ్.

స్వప్న కూర్చుంది. "తీరిగ్గా కూర్చున్నావ్?''

"ఈరోజు పనికొంచెం పలచగానే ఉంది'' నవ్వి అన్నాడు గౌతమ్.

"అయితే ఏదో మహాద్భుతం జరగబోతోందన్నమాట!'' తనూ నవ్వి అంది స్వప్న.

ఫ్లాస్కునుండి నిమ్మరసం గాజుగ్లాసులోకి వంపి చెల్లెలికందించాడు గౌతమ్.

"నీకో?''

"నేనిందాకే కాఫీ పుచ్చుకున్నాను. నువ్వు తాగు'' ఆపేక్షగా అన్నాడు గౌతమ్.

స్వప్న కొద్దిగా ఒళ్లొచ్చి ఇదివరకటి కంటే నిండుగా, గంభీరంగా ఉంది. పిల్లలిద్దరూ హైస్కూలు చదువుకి వచ్చారు. ఇల్లు ఎప్పటిలాగే స్వీట్ హోమ్‌గా భాసిల్లుతోంది.

నిమ్మరసం నెమ్మదిగా సిప్‌చేస్తూ అన్నగారిని నిర్నిమేషంగా చూడసాగింది స్వప్న. చెల్లెలు తనతో ఏదో ముఖ్య విషయం మాట్లాడేందుకు వచ్చిందని గ్రహించాడు గౌతమ్. మరెవరూ రాకుండా తలుపు గడియపెట్టివచ్చి యథాస్థానంలో కూర్చున్నాడు.

"అన్నయ్యా ! నువ్వపార్థం చేసుకోనంటే ఓ మాట చెప్పాలి'' తటపటాయిస్తూ అంది స్వప్న.

"ఏమిటమ్మా?''

"అన్నయ్యా! ఆగ్రహం మనిషి వివేకాన్ని నాశనంచేస్తుంది. ఒక్కొక్కప్పుడు చేయకూడని నేరాలు చేసేలా ప్రేరేపిస్తుంది"

"ఇప్పుడీ హితబోధ ఎందుకు?" ఆశ్చర్యం, కోపం కలసిన స్వరంతో అడిగాడు గౌతమ్.

"ఎందుకంటే నేను చెప్పబోయే విషయం నీలో ఆగ్రహాన్ని రగిలించ

వచ్చు"

"ముందు విషయమేమిటో చెప్పు" అసహనంగా అరిచాడు గౌతమ్.

చప్పున లేచి "ఊహూఁ నేను చెప్పలేను" అని వెళ్ళిపోబోయింది స్వప్న.

మొరటుగా ఆమె చెయ్యిపట్టిఆపేస్తూ– "చెప్పందే నువ్వీగదిలోంచి బయటికి వెళ్ళలేవు" అన్నాడు గౌతమ్.

"ప్లీజ్ అన్నయ్యా...నన్ను వెళ్ళనీ" ప్రాధేయపూర్వకంగా అంది స్వప్న.

"నువ్వు నాతో ఏం చెప్పడానికి ఇక్కడికి వచ్చావో ఆ విషయం చెప్పి వెళ్ళు"

"ఆ విషయం చెప్పకపోవడమే మంచిదేమో అనిపిస్తున్నది"

"స్వప్నా! నా సహనాన్ని పరీక్షించకు" కోపంగా అన్నాడు గౌతమ్.

నేలచూపులు చూస్తూ మౌనంగా కూర్చుంది స్వప్న.

"స్వప్నా.. సంగతేమిటో చెప్పమ్మా" లాలనగా అన్నాడు గౌతమ్.

అతడిలో అంతకంతకు అసహనం పెరిగిపోతున్నది.

అతడివేపు చూసింది స్వప్న తనకు తెలిసిన రహస్యం అతడికి చెప్పి సాఫీగా సాగిపోతున్న అతడి సంసారంలో కలతలు రేపడంకన్న తెలిసిన రహస్యాన్ని గుండెల్లోనే దాచేసుకోవడం మంచిదేమో అనిపించిందోక్షణం. అయితే తన రక్తంలోరక్తం,కండలోకండఅయిన ప్రియాతి ప్రియమయిన అన్నగారు దారుణంగా వంచింపబడుతుండటం ఆమె సహించలేకపోయింది. అందుకే తన మాట అతడి గుండెల్ని చురకత్తుల్లా చీల్చేస్తుందని తెలిసినప్పటికీ నిజం చెప్పకుండా ఉండలేకపోయింది.

"అన్నయ్యా! వదినకు సూర్యంతో సంబంధం ఉన్నదేమోనని..."

స్వప్న మాటలు పూర్తిచేయనేలేదు.

"స్వప్నా!" గర్జించాడు గౌతమ్.

ఆగ్రహావేశాలతో అతడి మొహం ఎర్రగా కందిపోయింది. కళ్ళు విస్ఫులింగాలు వెదజల్లుతున్నాయి.

అతడి ఉగ్రరూపంచూసి బెదిరిపోయింది స్వప్న.

"నువ్వు ఎవరిగురించి ఏం మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా?" కోపోద్విగ్నుడయిన గౌతమ్ కంఠంనుండి తుపాకీ గుళ్ళవలె దూసుకువచ్చాయి మాటలు.

"దేవుడి దయవలన నాకింకా మతి చలించలేదు" నిశ్చల కంఠంతో అంది స్వప్న.

అతిప్రయత్నంమీద కోపం అణచుకుంటూ చెల్లెలిని పరిశీలనగా చూసాడు గౌతమ్.

పచ్చని సంసారాల్లో చిచ్చుపెట్టి తమాషా చూసే కుటిలత్వం, అల్పత్వం స్వప్నలో లేదు. పైగా తనంటే ఆమెకు ప్రాణం. అటువంటప్పుడు లేనిపోని మాటలు చెప్పి తన సంసారాన్ని కూలదోయాలని ఎందుకు చూస్తుంది? కాని చెల్లెలి మాటల్లో నిజంలేదు. సూర్యం....

"చెల్లాయ్! ఇన్నాళ్ళూ గుండెల్లో దాచుకున్న ఒక రహస్యం నీకు చెప్పి తీరాల్సిన అనివార్య పరిస్థితిని కల్పించావు"

"ఏమిటన్నయ్యా?"

"కొన్ని సంవత్సరాలక్రితం జరిగిన ఒక ఏక్సిడెంట్ కారణంగా సూర్యం స్త్రీ నుండి ఏ సుఖం పొందలేని శాపానికి గురయ్యాడు" చెల్లెలి ముఖంలోకి

నిశితంగాచూస్తూఅన్నాడు గౌతమ్. ఇద్దరు అమాయకులమీద అభాండం వేస్తున్నా వన్నట్లున్నాయా చూపులు.

ఏదో ఆలోచిస్తూ చాలాసేపు మౌనంగా ఉండిపోయింది స్వప్న. చివరికి అంది – "బహుశా మొదటినుండి నిన్ని విషయంలో తప్పుదారి పట్టించాలేమో!"

"స్వప్నా?"

స్వప్న మొహం ఎర్రబడింది. "అన్నయ్యా! నేను ... నేను వాళ్ళ కలయికను నా ఈ కళ్ళతో స్వయంగా చూసాను" చెప్పలేక చెప్పింది.

గౌతమ్ పిడికిళ్ళు బిగుసుకున్నవి.

"ఎప్పుడు?" కటువుగా అడిగాడు.

"నాలుగురోజులక్రితం" అని అతడి చేతిని తన చేతులోకి తీసుకుంటూ– "అన్నయ్యా... నేను పాపిష్టిదాన్ని. ఏ మగాడూ విని భరించలేని విషయం చెప్పి నిర్మలంగా ఉన్న నీ మానస సరసిలోకి రాయి విసిరాను. నన్ను క్షమించు. నువ్వు మోసగింపబడుతున్నావని తెలిసాక మౌనంగా ఊరుకోవడం నా చాతకాలేదు" ఆర్ధ్రస్వరాన అంది.

గౌతమ్ మాట్లాడలేదు.

తుఫానుకు ముందు సముద్రాన్ని తలపింపజేస్తున్న అన్నగారిని చూస్తుంటే స్వప్న గుండెల్లో అవ్యక్తాందోళన బయలుదేరింది.

"అన్నయ్యా... ప్లీజ్! నాకోసం ఆగ్రహావేశాలకు తావివ్వక స్థిమితంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వస్తానని మాట ఇవ్వు"

"ముందు నన్ను వంటరిగా వదిలెయ్" అసహనంగా అన్నాడు గౌతమ్.

"అన్నయ్యా!"

గౌతమ్ వెళ్ళి తలుపు తెరిచాడు.

"చెల్లాయ్! ప్రస్తుతం నువ్విక్కడి నుండి వెళ్ళిపోవడమే నాకు చేయగలిగిన మహోపకారం!"

హఠాత్తుగా స్వప్నకు దుఃఖం ముంచుకు వచ్చేసింది. పరుగున వెళ్ళి అన్నగారిని చేతులతో చుట్టేసి "అన్నయ్యా! ఏమీ అఘాయిత్యం తలపెట్టనని మాట ఇవ్వు" అంది ఏడుస్తూ.

"ప్రమాణాలు చేసే అలవాటులేదు నాకు" నిర్లిప్తంగా అన్నాడు గౌతమ్.

రోదిస్తూనే వెళ్ళిపోయింది స్వప్న.

ఆమె వెళ్లాక తలుపు మూసి గడియ పెట్టాడు గౌతమ్. అతడి చూపులు టేబిల్ మీదనున్న గాజు పేపర్ వెయిట్ మీద నిలిచాయి. చివాలున దాన్ని తీసి గోడకేసి విసిరికొట్టాడు. మరుక్షణం ముక్కలుముక్కలయి కింద పడింది. రెప్పవాల్చకుండా కొన్నిక్షణాలు ఆ ముక్కలను చూశాడు.

అవును ... తన హృదయం అలాగే ముక్కలయింది.

ముక్కలయిన హృదయంలో అగ్ని పర్వతాలు బద్దలవుతున్నాయి.

తను వంచింపబడ్డాడు.

దారుణంగా వంచింపబడ్డాడు.

అతడి రక్తం మరిగిపోతోంది... విస్కీ బాటిల్ అందుకున్నాడు

అవును.తను ప్రతిక్షణం ప్రతినిమిషం, ప్రతిరోజు వంచింపబడ్డాడు!

నిప్పులాంటి నిజం నిలువునా కాల్చేస్తుంటే ఉన్మత్తుడిలా అందిన వస్తువుల్ని మూలమూలలకు విసిరికొడ్తున్నాడు.

స్నేహంతో హృదయానికి హత్తుకున్నందుకు తనకెంత ద్రోహం తలపెట్టాడు సూర్యం...?

విస్కీబాటిల్ క్రమంగా ఖాళీ చేసాడు.

ఆగ్రహం ద్విగుణీకృతమయింది.

ఆ ఆగ్రహంలో ఆలోచనల మధ్య వెల్లూరు నుండి వచ్చాక లావణ్య ఎందుకంత సంతోషంగా ఉందో అతడికి బోధపడింది. తను నిజంగానే వెర్రివాడు. మెరిసేదంతా బంగారమని భ్రమపడ్డాడు. జీవితంలో దగాపడ్డాడు. భార్య జీవితంలో మరో వ్యక్తి ఉన్నాడేమోనని అనుమానించాడేతప్ప ఆ వ్యక్తి తన ఆప్త మిత్రుడే అని ఊహించలేకపోయాడు. స్వప్న చెప్పినట్లు నిజంగానే వారిద్దరూ కలసి ఒక పథకం ప్రకారం తనను మోసం చేసారు.

గౌతమ్ అణువణువున ఆగ్రహం బుసలుకొట్టింది.

మొదటినుండి జరిగిందేమిటో ఊహించ గలిగాడు.

సూర్యం ఎంత చదువుకున్నా అతని తండ్రి లావణ్య తండ్రి వద్ద పాలేరు. పైగా కులంరీత్యా సమాజంయొక్క అట్టడుగు పొరల్లో ఉన్నాడు. ఆర్థికంగా, సామాజికంగా ఇద్దరి మధ్య ఎంతో దూరం. వాళ్ళ ప్రేమను పెద్దలు అమోదించడం అసంభవం. అందుకే తనను రంగంలోకి దించారు. ఆ వలలో పడిపోయి ఇద్దరి మధ్యవారధిగా ఉపయోగపడుతున్నాడు తను.

ఆగ్రహం మరోసారి ఉధృతంగా అతడిని చుట్టేసింది.

రూపం, చదువు, విజ్ఞానం, హోదా, ఆస్తి అంతస్తులు...

తనకన్న సూర్యం ఎందులో ఎక్కువ? అతడి కోసం వివాహబంధానికే అపవిత్రతనాపాదించాలా? కట్టుకున్న వాడిని మోసం చేసేంత నీచానికి దిగ జారాలా?



'లావణ్యా...ఎందుకే నా జీవితంతో ఇలా ఆడుకున్నావ్? నువ్వు నవ్వుతూ చేసేందానికి నేను ఏడుస్తూ అనుభవించాలా?' మనస్సులోనే అనుకున్నాడు గౌతమ్.

తన ఎదురుగానే ఆ ఇద్దరూ చనువుగా కబుర్లు చెప్పుకునేవారు. పగలబడి నవ్వుకునేవారు. వాళ్ళ చనువుని తనెన్నడూ అపార్థం చేసుకోలేదు. అసలు అపార్థం చేసుకునే అవకాశం లేకుండా తను సంసార జీవితానికి పనికిరానని ముందే చెప్పేసాడుగా! స్కౌండ్రల్...అలాంటి వాడిని ఏంచేసినా పాపం లేదేమో!

బహుశా తన వెనక ఇద్దరూ పరిహాసంగా నవ్వుకునే వాళ్ళేమో!

అవమానంతో కుతకుత ఉడికిపోయాడు గౌతమ్.

ఆ క్షణమే వెళ్ళి ఇద్దర్నీ నరికి పోగులు పెట్టాలన్న కోరికను అతిప్రయాసతో అణచుకున్నాడు.

సిగరెట్ వెనక సిగరెట్ నుసి చేస్తూ తీవ్రంగా ఆలోచించసాగాడు. ప్రతీకార జ్వాలలతో ప్రజ్వరిల్లుతున్న మనస్సు ఆగటం లేదు.

ఆలోచనలతో మస్తిష్కం వేడెక్కిపోయింది. సన్నగా తలనొప్పి...కణతలు నొక్కుకుంటూ గది బయటికి వచ్చిన గౌతమ్ చకితుడయాడు.

గది బయట కుర్చీల్లో ఆసీనులయి ఉన్నారు స్వప్న, రవీంద్రలతోబాటు నర్సింగ్‌హోమ్‌లో పనిచేస్తున్న డాక్టర్లు. అందరి వదనాల్లో ఆదుర్దా, ఆందోళనా కొట్టొచ్చినట్లు కన్పిస్తున్నాయి.

"హల్లో...ఎవ్రిబడీ!"

"డాక్టర్....ఆర్యూ ఆల్‌రైట్?"

ఆందోళనగా అడిగాడు డాక్టర్ మదన్.

గౌతమ్ స్వప్నను చూసాడు.

దుఃఖంతో, వ్యధతో ఆమె వదనం నలిగిపోయి ఎలాగో ఉంది.

తన సమస్య చెల్లెలికింత వ్యధ కలిగిస్తున్నదా?

విచలితుడయ్యాడు గౌతమ్.

చెల్లెలు మీంచి చూపులు డాక్టర్ మదన్ మీదికి మళ్ళించాడు.

"అయామ్ క్వయిట్ ఆల్‌రైట్. థాంక్యూ!" అని చేతిగడియారంలో టైంచూసి "సారీ ఫ్రెండ్స్..నాకు క్లబ్బుకి వెళ్ళేందుకు టైమయింది. సీయూ.. బై" అని వెళ్ళిపోయాడు.

క్లబ్బులో "హలో డాక్టర్!" అంటూ వెళ్ళీ వెళ్ళగానే పలకరించారు పోలీసు సూపర్నెంట్ గోపాలరావుగారు.

"హలో సర్!" చిర్నవ్వుతో



అన్నాడు గౌతమ్.

టెన్నిస్ కారణంగా ఆ ఇద్దరిమధ్య స్నేహం గాఢ తరమయింది మధ్య. ఇద్దరూ మాట్లాడుకుంటూ టెన్నిస్ కోర్టు కేసి నడిచారు.

ఇప్పుడింత స్నేహ వాత్సల్యాలతో మాట్లాడుతున్నారు. కొన్నాళ్ళ తర్వాత నన్ను నిర్దయగా వేటాడి పట్టి బంధించి ఉరికంభానికి అప్పజెప్తారేమో!

గోపాలరావుగారిని ఉద్దేశించి మనస్సులోనే అనుకున్నాడు గౌతమ్.

రాత్రి ఇంటిముందు కారాపినప్పుడు సరిగ్గా పన్నెండుగంటలయింది.

తలుపు తెరచిన లావణ్యను చూసి అతడిలో కోపం బుస్సుమంది.

పతివ్రతా శిరోమణి. భర్తకోసం ఎదురుచూస్తూ అర్ధరాత్రయినా నిద్రపోకుండా కూర్చుంది!

వ్యంగ్యంగా అనుకున్నాడు.

బట్టలు మార్చుకుని కిటికీవద్దఉన్న సింగిల్‌కాట్ కేసి వెళ్తున్న భర్తను విభ్రాంతిగా చూసింది లావణ్య.

"నాకు బాగా తలనొప్పిగా ఉంది. నువ్వు పడుకో!" అని పక్కమీదికి వాలాడు గౌతమ్.

వెళ్ళి పడుకున్నకాసేపటికే నిద్రలోకి జారుకుంది లావణ్య.

కానీ ఆ నిద్రాదేవి గౌతమ్ దరిదాపులకయినా రాలేదు. ప్రశాంతంగా నిద్రపోతున్న భార్యను చూస్తుంటే అతడిలో కోపం అంతకంతకు ఎక్కువయిపోతోంది. నిద్రపోతున్న ఆమెనలాగే సజీవసమాధి చేయాలనిపించింది. కానీ గాయపడ్డ జంతువుసైతం పగ తీర్చుకొనేందుకు సరైన సమయం కోసం వేచివుంటుంది. తను చేయవలసిన ముఖ్యమయిన పనులున్నాయి. అవి పూర్తయ్యాకే మరేదైనా!

గౌతమ్ పెదవుల మీద నవ్వు మెరిసింది.




పదిహేనురోజులు గడిచాయి. ఈ పదిహేనురోజులూ జీవితంలో ఎన్నడూ లేనంత బిజీగా ఉన్నాడు గౌతమ్. ఎప్పట్లాగే నర్సింగ్‌హోమ్‌లో పనులు గమనిస్తూనే చాలా వ్యవహారాలు సరిదిద్దాడు. దాదాపు పదిలక్షలు విలువచేసే నర్సింగ్ హోమ్‌ని స్వప్న, రవీంద్రల పేరరాసి రిజిస్టర్ చేయించాడు. బాంకులో దాచిన డబ్బు దాదాపు ఆరులక్షలు విత్‌డ్రాచేసి ఇంట్లో పదిలపరిచాడు. పనులన్నీ రహస్యంగా పకడ్బందీగా జరిపేస్తున్నాడు. ఏపనిచేస్తున్నా తనకింత ద్రోహం చేసిన భార్యను, స్నేహితుడిని ఏంచేయాలి అనే అనుక్షణం అతడి మనస్సు ఆలోచిస్తూ ఉంది. ఎన్నో ఆలోచనలు, పథకాలు మనస్సులో సుళ్ళు తిరుగుతున్నవి. సౌమ్యుడు, సజ్జనుడు అని పేర్గాంచిన తన మనస్సింత క్రూరమయిన ఆలోచనలకు స్థావరమయిందేమిటా అని అతడికే విస్మయంగా ఉంది. అయినా ప్రతీకారవాంఛతో ప్రజ్వరిల్లిపోతున్నాడు. పగ తీర్చుకునే ప్రయత్నంలో ఉజ్వలమయిన తనజీవితం

నాశనమయిపోవచ్చునన్న ఆలోచనే కలగటంలేదు. మృత్యు సమ్ముఖానికి వెళ్తున్న ఎందరినో కాపాడిన వ్యక్తి నిన్నటిదాకా ఆత్మీయులుగా ఉన్నవారిని క్రూరంగా హత్యచేయాలన్న కోరికతో వేగిపోతున్నాడు.

తమ రహస్యం భర్తకు తెలిసి పోయిందని ఊహించనైనాలేని లావణ్య ఎప్పట్లాగే అతడిమీద అనురాగవర్ష కురిపిస్తోంది. అయితే ఆమెను తప్పించుకు తిరుగుతూ తన సమీపానికి రాకుండా జాగ్రత్తగా ఉంటున్నాడు గౌతమ్. పొరబాటున ఆమె చిటికెనవేలు తగిలినా ఒంటిమీద తేళ్ళు, జెర్రులు పాకుతున్నట్లు కంపరంగా, జుగుప్సగా ఉంటోంది. అందుకే సాధ్యమైనంత దూరంగా ఉంటున్నాడు.

ఆరోజు బంధువుల ఇంట్లో పెళ్ళికి వెళ్ళింది లావణ్య.

అటువంటి అవకాశం కోసమే వేచివున్న గౌతమ్ గది తలుపు మూసి గడియపెట్టి లావణ్య బీర్వా తెరిచి వెదకసాగాడు. ప్రతి అర, ప్రతి చీర మడత...బీర్వాలో ఒక్కంగుళం వదల కుండా వెదికాడు. ఎంతోసేపు వెదికిన పిదప చివరికి దొరికాయి...

సూర్యం లావణ్యకు రాసిన ప్రేమ లేఖలు.

ఇంతకాలం చెల్లెలి మాటకు అనవసర మయిన విలువనిచ్చి జీవితాంతం కలిసి బతకాల్సిన భార్యను శంకిస్తూ క్రోధం పెంచుకుంటున్నానేమోనన్న శంక గౌతమ్‌ని లోలోపల బాధిస్తూనే ఉంది. అయితే ఆ ఉత్తరాలు చదివేటప్పటికి సూర్యం, లావణ్యలు ఎంత పకడ్బందీగా నమ్మకద్రోహం చేసారో అర్థమయి మరో సారి ఆగ్రహావేశాలతో అతడి అణువణువు భగ్గుమంది.

ప్రేయసీ ప్రియులమధ్య ఉండే ఎన్నో రహస్యాలు, ఎవరికీ తెలియరాని రహస్యాలు—ముఖ్యంగా ఏ వ్యక్తికయితే తెలియకూడదో ఆ వ్యక్తే స్వయంగా ఉత్తరాల మూలంగా ఆ రహస్యాలు తెలుసుకున్నప్పుడు అతడనుభవించే ఆవే దన, ఆగ్రహం, అవమానం...

భార్య ప్రియుడితో ప్రేమకలాపం కొనసాగించడంకోసమే ప్రియుడి ప్రోద్బ లంతో తనతో వివాహానికంగీకరించిందన్న నిజం తెలిసి ఆ క్షణమే వెళ్ళి ఇద్దరినీ నరికి పోగులు పెట్టాలన్న కోరిక ఎగ దన్నుకువచ్చింది. అయినా అణచుకుని ముఖ్యమని తోచిన అయిదారు ఉత్తరాలు తీసుకుని తక్కినవన్నీ యధాస్థానంలో ఉంచేసి బీర్వా సర్ది లాక్ చేసాడు.

ఆ రాత్రి సూట్‌కేసులో బట్టలు సర్దు కుంటున్న గౌతమ్‌ని ఆశ్చర్యంగా చూసింది లావణ్య.

"ఊరు వెళ్తున్నారా?"

"నీకు చెప్పడం మరిచాను. ముఖ్య మయిన ఓ పనిమీద హైదరాబాద్ వెళ్తు న్నాను. తిరిగి వచ్చేందుకు పది రోజులు పట్టవచ్చు"

తన మాటలు విని భార్య ముఖంలో మెరిసిన మెరుపులు గమనించాడు గౌతమ్.

తన అడ్డులేక ప్రియుడితో పది రోజులపాటు యధేచ్ఛగా గడపవచ్చునని సంబరపడుతోంది!

బుస్సుమని పొంగిన కోపం అణచు కొని గుడ్‌నైట్ చెప్పి పడుకున్నాడు.

వేకువఝామున మూడుగంటలకేలేచి వెళ్ళిపోయాడు.

నేరస్థుడు నేరం చేస్తుండగా పట్టుకుని

శిక్షించాలనుకున్న గౌతమ్ లావణ్యతో చెప్పినట్లు హైదరాబాదు వెళ్ళలేదు. పక్కనేఉన్న గుంటూరు వెళ్లాడు. గుంటూరులో ఒక హోటల్లో గది తీసుకుని మూడు రోజులపాటు గదిలోంచి బయటికి రాకుండా గడిపాడు. ఏకాంతంలో ఎన్నెన్నో ఆలోచనలు....ఆలోచనలు... ఆలోచనలు...

క్లిష్టమయిన ఆపరేషన్లు చేయవలసిన సందర్భాలలో ఎన్నో పుస్తకాలు రెఫర్ చేస్తూ దీర్ఘంగా ఆలోచిస్తూ తిండీ నిద్రల ధ్యాసలేకుండా మరో లోకంలో ఉన్నట్లు గడిపేవాడు. ప్రస్తుతం తనకు ద్రోహం చేసిన ఇరువురిని గురించి అలాగే దీర్ఘంగా ఆలోచిస్తూ మనస్సుకి అవిరామంగా శ్రమ ఇస్తున్నాడు.

నాలుగోరోజు అర్ధరాత్రి కావస్తుండగా గౌతమ్ విజయవాడ బయలుదేరాడు. సరిగ్గా ఒంటిగంటకు తన ఇంటి కాల్ బెల్ నొక్కాడు.

తలుపు తెరిచిన నరసమ్మ గౌతమ్‌ని చూసి "బాబూగారూ...మీరా!" అంది తడబడుతూ.

"ఎందుకలా ఆశ్చర్యపోతావు?" అంటూనే లోపలికి అడుగు పెట్టాడు గౌతమ్.

వణుకుతున్న చేతులతో తలుపులు మూసి గడియపెట్టింది నరసమ్మ.

చీర సారెలతోబాటు నరసమ్మను పుట్టింటినుండి అరణంగా తెచ్చుకుంది లావణ్య.

కైకేయికి మందరలా లావణ్యకు నరసమ్మ. ఆమె లేకుంటే లావణ్యకు పూట గడవదు. హాల్లోనే సోఫాలో కూర్చుంటూ "పాలు ఉన్నాయా?" అని అడిగాడు గౌతమ్.

తల ఊపింది నరసమ్మ.

ఆమె మొహంలో భయాందోళనలు, ప్రస్ఫుటంగా కనిపిస్తున్నవి.

అది గమనించి గౌతమ్ నవ్వుకున్నాడు.

"కాఫీ కావాలా బాబూ?" నరసమ్మ అడిగింది.

"ఊఁ"

వంటగదివేపు వెళ్తున్న నరసమ్మను చూసి తన వెనక రంకు సాగిస్తున్న భార్యకు, ఆమె ప్రియుడికి తోడు దొంగ కాబోలు అనుకున్నాడు. లేచివెళ్ళి వీధి తలుపు తాళం వేశాడు.

నరసమ్మ కాఫీ తెచ్చింది.

కాఫీ అందుకుంటూ "బెడ్‌రూంలో మీ అమ్మగారితోబాటు సూర్యం ఉన్నాడా?" నరసమ్మ కళ్ళలోకి సూటిగా చూస్తూ అడిగాడు గౌతమ్.

కెవ్వుమనబోయి విపరీతమయినభయం గొంతు నొక్కేయగా గుటకలు మింగుతూ భయవిహ్వల దృష్టితో చూసింది నరసమ్మ.

"మాట్లాడవేం?" కఠినంగా అడిగాడు గౌతమ్.

అతడి చేతిలో పిస్టల్ చూసి తుఫాను తాకిడికి ఊగిపోయే గడ్డిపోచలా ఆపాద మస్తకం వణికిపోతూ "ఉన్నారు!" అంది హీనస్వరంతో.

"ఎన్నాళ్ళుగా సాగుతోంది వాళ్ళ మధ్య ఈ వ్యవహారం?" కాఫీ సిప్ చేస్తూ అడిగాడు గౌతమ్.

తల వంచుకుంది నరసమ్మ.

"అమ్మాయిగారు స్కూలు చదివే రోజుల్లోనే సూర్యంబాబుని మామిడి తోపులో కలుసుకునేవారు"

"ఊహూఁ! మరి పెళ్లెందుకు చేసుకో

లేదు?"

నరసమ్మ చూపులు గౌతమ్ చేతిలోని పిస్టల్ మీదే ఉన్నాయి. "మీకు తెలుసుగా సూర్యంబాబుది మన కులం కాదు. పైగా ఆ బాబు తండ్రి అయ్యగారి వద్ద పాలేరు" గౌతమ్ వంక భయం భయంగా చూసింది నరసమ్మ.

కళ్ళల్లో క్రౌర్యం, చేతిలో పిస్టల్... గౌతమ్ ఉద్దేశం అర్థమయి ఆ చల్లని సమయంలో నరసమ్మకు ఒళ్లు చెమటతో తడిసి ముద్దయింది.

"కట్టుకున్న మొగుణ్ని వంచిస్తున్న ఆదర్శ ప్రేమికురాలు కులం, ఆస్తి, అంతస్తులు వదులుకుని ప్రియుడితో బాటు వెళ్ళలేకపోయిందా?"

పిస్టల్ తో ఆడుకుంటూ అడిగాడు గౌతమ్.

ఆ పిస్టల్ని చూస్తుంటే మృత్యుదేవతను చూస్తున్నట్లే ఉంది నరసమ్మకు. ఆ క్షణంలో అమ్మాయిగారి రహస్యం దాచడంకన్న తన ప్రాణాలు కాపాడుకోవడం ముఖ్యమని తోచిందామెకు. అందుకే గౌతమ్ ప్రశ్నలకు బుద్ధిగా జవాబులిస్తోంది.

"అలా వెళ్ళిపోతే పరువుపోతుందనీ, ఉరిపోసుకు చచ్చిపోతాననీ వాళ్ళ అమ్మగారు ఏడిచారు"

"ఊహు..." సాలోచనగా అన్నాడు గౌతమ్.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"వీళ్ళిద్దరూ ఇలా కలుసుకుంటున్న సంగతి లావణ్య ఇంట్లో పెద్దలకు తెలుసా?" గౌతమ్ మనస్సుని తొలుస్తున్న సందేహం అది...

"శివ శివ. వాళ్ళకు తెలీదు బాబూ"

కాఫీకప్పు టీపాయ్ మీద ఉంచి, "ఇలా చేయడం తప్పని మీ అమ్మాయిగారిని మందలించకపోయావా?" అన్నాడు గౌతమ్.

"నేను ఎన్నోసార్లు చెప్పాను. అమ్మాయిగారు నా మాట వినిపించుకోలేదు"

"వినాశకాలం దాపురించినవారు మంచి మాటలు వినిపించుకోరులే" అని లేచి, "నా వెంటరా!" అని మేడ మెట్లకేసి దారితీసాడు గౌతమ్.

"నేనెందుకు..." అని ఏమో చెప్పబోయింది నరసమ్మ.

"నోర్మూసుకు పద" హుంకరించాడు గౌతమ్.

గజగజ వణికిపోతూ అతడిననుసరించింది నరసమ్మ.

బెడ్ రూం ముందు నిలిచి తలుపు శబ్దం చేసాడు గౌతమ్.

"ఎవరు?" లావణ్య గొంతు నిద్రమత్తుగా వినిపించింది.

నరసమ్మ వేపు సాభిప్రాయంగా చూసాడు గౌతమ్.

ప్రాణాలరచేత బెట్టుకుని, "పనుంది.. కాస్త తలుపు తెరువ్ తల్లీ" అంది నరసమ్మ.

అయిదు నిముషాల తర్వాత తలుపు తెరిచింది లావణ్య.

"అర్ధరాత్రి పూట ఏమిటి నీ గొడవ?" విసుగ్గా అంటూనే భర్తను చూసి సర్పద్రష్టలా కొయ్యబారిపోయింది.

భయంతో వణికిపోతూ నరసమ్మనూ చూసింది.

నరసమ్మకయితే లావణ్యను కావలించుకుని గొంతెత్తి పెద్దగా ఏడ్వాలనిపిస్తున్నది.

"హాయ్ డార్లింగ్...డిస్టర్బ్ చేశానా?" అంటూ గదిలోకడుగుపెట్టాడు గౌతమ్. మంచంమీద పడుకుని ఉన్న సూర్యాన్ని చూడగానే, "అరె... సూర్యం ఇక్కడ ఉన్నాడే!" అన్నాడు ఆశ్చర్యం నటిస్తూ

పడగెత్తి కాటువేసేందుకు సిద్ధంగా ఉన్న సర్పం ముందు నిలిచి ఉన్న వ్యక్తిలా లావణ్య గౌతమ్‌ని చూస్తోంది.

ఒకసారి లావణ్యను చూసి పిస్టల్ మొనతో సూర్యాన్ని తట్టి లేపాడు గౌతమ్. ఉలికిపడి నిద్రలేచిన సూర్యం ఎదురుగా చేతిలో పిస్టల్‌తో నుంచుని ఉన్న గౌతమ్‌ని చూసి అదిరిపడి లేచాడు. భయాందోళనలు వివశుణ్ని చేయగా వణుకుతున్న చేతుల్తో లుంగీ చుట్టుకున్నాడు. ఎ.సి. గదిలోనే ఉన్నప్పటికి చెమట కాలువలుగా అతడి ఒంటి మీద ప్రవహించసాగింది.

"సంసార జీవితానికి పనికిరాని నువ్వు ఇక్కడేం చేస్తున్నావ్? నీ పురుషత్వాన్ని పరీక్షించుకోవాలంటే డబ్బు పారేస్తే బజారులో ఎందరో స్త్రీలు దొరుకుతారు గదా" అన్నాడు గౌతమ్ ఆగ్రహంతో.

"నన్ను క్షమించు గౌతమ్" హీన స్వరంతో అన్నాడు సూర్యం.

"నిన్ను.... నేను క్షమించాలా?" పిస్టల్ని పైకెగరేసి పట్టుకుంటూ అన్నాడు గౌతమ్.

"నా స్థానంలో నువ్వుంటే ఏంచేసేవాడివి?"

సూర్యం మాట్లాడలేదు.

"చెప్పు సూర్యం... నా స్థానంలో నువ్వుంటే ఏం చేసేవాడివి?" రెట్టించాడు గౌతమ్.

నేరం చేస్తున్నవాడిని రెడ్ హేండెడ్‌గా పట్టుకుని అలా అడిగితే ఏం జవాబు చెప్పగలడతడు!

అంతవరకు తెచ్చి పెట్టుకున్న శాంతంతో మాట్లాడుతున్న గౌతమ్ హఠాత్తుగా రూపుదాల్చిన ఆగ్రహమయాడు.

"నిన్ను క్షమించాలా? బాస్టర్డ్...నిన్ను క్షమించాలా? ఒక స్త్రీ కోసం నా హృదయంతో, నా జీవితంతో దారుణంగా ఆడుకున్నావ్. ఇప్పుడు క్షమించమని అడుగుతున్నావు. అన్నీ మరచిపోయి ఎప్పట్లాగే నిన్ను స్నేహభావంతో ఆదరించేందుకు నేను మహాత్ముడిని కాను. మామూలు మనిషిని! నా కళ్ళముందే నా జీవితాన్ని, భవిష్యత్తుని నేలమట్టం చేసిన దుర్మార్గుడిని క్షమించే హృదయౌన్నత్యం నాకు లేదు. నువ్వు చేసిన ద్రోహానికి తప్పక ఫలితం అనుభవిస్తావు" అని భార్యవేపు చూసాడు. "నేను నిన్ను తృప్తిపరచలేకపోయానా? నాలో మగసిరి తక్కువయిందా?"

మౌనంగా బెదురు చూపులు చూసింది లావణ్య.

"నా పురుషత్వం మీదే దెబ్బ తీసావు. నువ్వు చేసిన నేరానికి శిక్ష ఏమిటో నువ్వే చెప్పు?"

లావణ్య ఏడవసాగింది.

"కల్లిబొల్లి ఏడుపులు ఏడవకు. నేను కరిగిపోను" కస్సుమన్నాడు గౌతమ్. "ఎంత ధైర్యం లేకుంటే నావెనక మరొకడితో రంకుసాగిస్తావ్? అసలతడితో ప్రణయం కొనసాగించేందుకే నాచేత మూడుముళ్ళు వేయించుకున్నావు. అవునా?"

అతడి కాళ్ళమీద వాలిపోయింది లావణ్య.

"నన్ను క్షమించండి!"

నిప్పులు గక్కుతున్న కళ్ళతో చూసాడు గౌతమ్.

"ఎందుకు? ఇన్నాళ్ళూ నన్నో వెర్రి వెధవాయిని చేసి వంచించినందుకా? తన అడుగులో అడుగువేస్తూ దైనందిన జీవితంలో ఎదురయ్యే కష్టసుఖాలు పంచుకుంటూ, తనలో కలిసిపోయి చివరి దాకా తనకు తోడుగా నిలిచే స్త్రీసాహచర్యంకోసమే నాలాంటి మగాడు పెళ్ళి చేసుకుంటాడు. శరీరంతోబాటు మనస్సునీ తన కర్పించి తనకోసమే బతుకుతూ ఇంటిని స్వర్గసీమగా తీర్చిదిద్దాలని ఆశిస్తాడు. మరి నువ్వేం చేసావు? నా జీవితంలోకి రావడమే దురుద్దేశంతో వచ్చావు. వివాహ బంధానికే కళంకమాపాదించావు. నిన్ను క్షమించడం మహానేరం. మిమ్మల్ని క్షమించి సుఖంగా జీవించండని ఆశీర్వదించేందుకు నేను ఆదర్శపురుషుడిని కాను. మీరెంత గింజుకున్నా చేసిన నేరానికి శిక్ష అనుభవించక తప్పదు. కమాన్...మీ ఇష్ట దైవాన్ని ప్రార్థించుకోండి..." అంటూనే ట్రిగ్గర్ నొక్కాడు. కొన్నినిమిషాలు... అంతే...

సూర్యం, లావణ్యలకు తోడుగా నరసమ్మ కూడా పరలోకానికి పయనమయిపోయింది...




కాఫీ కలుపుకుని తాగుతూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు గౌతమ్.

మృత్యువుతోపోరాడి ఎందరి ప్రాణాలో కాపాడిన వ్యక్తి ఇప్పుడు నిర్దాక్షిణ్యంగా ముగ్గురు ప్రాణాలు తీసాడు. అయినా తప్పుచేసానన్న భావమే లేదు. పశ్చాత్తాపం అసలే లేదు. ఆ ఇద్దరూ తనకు చేసిన ద్రోహానికి తను వాళ్ళకు విధించిన శిక్ష అతిస్వల్పమేననిపించిందతడికి.ఏ ఒక్కరూ పుట్టుకతోనే నేరస్థులు కారు. మనిషికెదురు తిరిగిన పరిస్థితులే అతడిని దొంగను గానీ, బందిపోటును గానీ,సంఘ విద్రోహిని గానీ, హంతకుడిని గానీ చేస్తుంది. సర్జనుగా సమాజంచేత నీరాజనాలందుకున్న గౌతమ్ ఈనాడు. హంతకుడయ్యాడు. ఒకరుకాదు...ఇద్దరు కాదు...ముగ్గురిని హత్యచేసాడు. అతడు చేసిన నేరానికి ఉరిశిక్ష పడుతుందని అతడికి తెలుసు. అయినప్పటికీ హత్యానేరానికి ఒడిగట్టాడు.

తన స్థానంలో మరోమగాడు ఉంటే ఏం చేసేవాడు?

గౌతమ్ ఆలోచిస్తున్నాడు ... ఆలోచిస్తూనే పని కానిస్తున్నాడు.

గోడగడియారం మూడుగంటలు కొడుతుండగా ముక్కలయిన ఆ మూడు శరీర భాగాలను ఒక గోతంలో పడేసి మూటగట్టాడు. తర్వాత గదంతా ఒకసారి కలయజూసాడు. గదంతా రక్తం చింది ఎంతగుండె ధైర్యం ఉన్న వారికయినా దడపుట్టించేలా బీభత్సంగా ఉంది. కానీ గౌతమ్ మనస్సు మాత్రం చలించలేదు. నిశ్చలంగా నిర్వికారంగా స్నానంచేసి డ్రెస్ చేసుకున్నాడు. కాఫీ కలుపుకొని తాగాడు. నరసమ్మ శవాన్ని అలాగే ఉంచి సూర్యం, లావణ్యలున్న

మూటను కారు డిక్కీలో పడేసాడు. ఇల్లు లాక్ చేసి కారు స్టార్ట్ చేసాడు. సూర్యం, లావణ్యల ఖండిత శిరస్సులు అతడి పక్కనే ఉన్నవి. మొహాలు గుర్తుపట్ట లేనంతగా వికృతం చేసేసాడు. ఆలోచించి ఆ శిరస్సులను పోలీసుస్టేషన్ ప్రాంగణం లోకి విసిరేసాడు.

ఆ శిరస్సులను చూసిన మరుక్షణం నుండి పోలీసులకు చేతినిండాపని. ఆ తలలు ఎవరివి?

తక్కిన శరీరభాగాలు ఏమయ్యాయి?

అసలీ దారుణం చేసిందెవరు?

పోలీసుస్టేషను నిండా ప్రశ్నలే!

గౌతమ్ నవ్వుకున్నాడు.

హంతకుడి కోసం వేట ప్రారంభ మవుతుంది. ఆలోగా తనీ రాష్ట్రి పోలీసులకు అందనంత దూరానికి వెళ్ళి పోవాలి.

* * *

క్షణాలు నిమిషాలుగా, నిమిషాలు, గంటలుగా, గంటలు దినాలుగా, దినాలు వారాలుగా, వారాలు నెలలుగా గడిచిపోతున్నవి. అప్పుడుకానీ అతడి మనస్సు శాంతించలేదు. వాళ్ళు తనకు చేసిన ద్రోహానికి తగ్గ ఫలితం అనుభ వించారు. అయితే ఆయినవాళ్ళందరికీ దూరమయి ఉజ్వలమయిన జీవితం వదులుకుని ఇలా అజ్ఞాతవాసం చేయడం అతడికి దుర్భరంగా ఉంది. కానీతప్పదు. పోలీసులకు పట్టుబడి శిక్ష అనుభవించే ఉద్దేశం అతడికిలేదు. తప్పు చేసిన భార్యను భర్త శిక్షించాడు. అందు నిమిత్తం శిక్ష అనుభవించడం అనవసర మని అతడి ఉద్దేశం. ఆ ఉద్దేశంతోనే బీహార్ రాష్ట్రంలో ఒక మారుమూల గ్రామంలో తన గతానికి సమాధికట్టేసి నూత్న జీవితం ప్రారంభించాడు. చుట్టూ సరిహద్దులా దట్టంగా పెరిగిన చిట్టడవితో మనోజ్ఞంగా, ప్రశాంతంగా ఉండే ఆ గ్రామం పోలీసుల నుండి తనక్కావలసిన రక్షణ కల్పిస్తుందనిపించింది. అందుకే ఆ గ్రామంలోనే ఒక చిన్న ఇల్లు నిర్మించుకుని స్థిరపడ్డాడు. ఇంటి పనులు చేసేందుకు బసంతి అని పదేళ్ళ బాలిక.

జీవితం స్తబ్ధుగా, ప్రశాంతంగా సాగిపో తున్నది. మెడికల్ స్టూడెంటుగా ఉన్నప్పుడు, ఆ తర్వాత డాక్టరుగా క్షణం తీరికలేని జీవితం. బతుకురథం పరుగుల బాట మీద సాగిపోయింది. హాస్పిటల్, రోగాలు, రోగులు, మందులు... ఈ పరిధి దాటి ఇవతలి ప్రపంచంలోకి తొంగి చూసేందుకు సైతం తీరిక ఉండేదికాదు. ఇప్పుడలాకాదు. కావలసినంత తీరిక. అందుకే చుట్టూ ఉన్నవారి జీవితసరళి గమనిస్తూ తనలోకి తాను తరచి చూసు కుంటున్నాడు. ఆత్మావలోకనం చేసు కుంటున్నాడు. జీవితం గురించి తీరిగ్గా లోతుగా ఆలోచిస్తున్నాడు. చేతినిండా పనిలేక తీరిక ఎక్కువయేటప్పటికి స్పందన గురించిన తలపులు ఎక్కు వయ్యాయి. తీరిగ్గా నింపాదిగా శ్రద్ధగా మనస్సులో ప్రేమలతను పెంచుతున్నాడు. మళ్ళీ తన మీద తనకే కోపం, చిరాకు. ఒక స్త్రీ మూలంగా తన జీవితం ఇలా చతికిలబడ్డది. మరో స్త్రీకి మనస్సులో చోటిచ్చి మధనపడుతున్నాడు. ఇంత జరిగినా రాగద్వేషాలకతీతంగా ఉండ లేదా తను? తన మనస్సింత దుర్బల మయిందా?

సాయంత్రం ఊరుబయట ఒకచెట్టు కింద కూర్చుని దినకరుడు పశ్చిమాద్రిని కుంగిపోతున్న అద్భుత దృశ్యాన్ని

పరవశంగా చూస్తూ ఆలోచిస్తున్నాడు గౌతమ్. ఆ సమయంలో ప్రకృతిశోభ ఎప్పట్లాగే అతడిని వివశుణ్ని చేయగా చుట్టూ ప్రపంచం మరచి ప్రకృతిలో లీనమయి ఎంతో సేపు అలాగే కూర్చున్నాడు.

గూళ్ళకు చేరుకుంటున్న పక్షుల కిలకిలారావాలు.

దూరంనుండి సుమధురంగా వినిపించే వేణుగానం.

గాలిలో సమ్మిళితమయి నాశికా పుటాలను మత్తుగా తాకే వివిధ కుసుమాల పరిమళం, పక్కనే గలగలపారుతూ



ప్రేయసిని గుర్తుకు తెచ్చే పిల్లకాలువ.

ప్రకృతిమాత ఒడిలో విశ్రాంతి తీసుకుంటున్న దివ్యానుభూతి....

గౌతమ్ తప్త హృదయం చాలా మటుకు ఉపశమనం పొందింది.

గంటల తరబడి ప్రకృతి అందాలు తిలకిస్తూ గుండెలను కెలికే గతాన్ని మరచిపోయేందుకు ప్రయత్నిస్తున్నాడు.

ఋతుచక్రభ్రమణం యొక్క తీరుతెన్నులు పరిపూర్ణంగా దర్శించడం ప్రకృతి సౌందర్య దీప్తిమంతమయిన అటువంటి ప్రదేశంలోనే సాధ్యమవుతుంది. ఆయారుతువుల్లో ప్రకృతిలో ఏర్పడే సహజ పరిణామాలు గమనించి అతడిలో సంతోషంఅర్ణవమయింది.ఆదేసమయంలో ప్రకృతి ముందు ఎంతో సాధించానని విర్రవీగే మానవుడెంత అల్పుడో అనుకున్నాడు. సుమధురంగా సాగిపోతున్న గీతం మధ్య వినిపించే అపశృతిలా ఆ గ్రామస్థుల ఆర్థికదుస్థితి అతడిమనస్సుని అమితంగా కలతబెట్టింది. దేశంలో దారిద్ర్యం విలయతాండవం చేస్తున్నదని ఇదివరకు విన్నాడు. ఇప్పుడు ప్రత్యక్షంగా చూస్తున్నాడు.

ఒకే ఒక చీర అదీ చిరుగులుపట్టిందీ- దాంతోనే బతుకు వెళ్ళదీస్తున్న లక్ష్మి...

యాభయి రూపాయల అప్పుతీర్చలేక తరతరాలుగా వెట్టిచాకిరిచేస్తూ ఋణవిముక్తి పొందలేక సతమతమవుతున్న ధీరూ కుటుంబం...

పదిపైసల బిళ్ళను పసిబిడ్డ పారేస్తే పదివేలు పోగొట్టుకున్నట్లు గగ్గోలుపెట్టే పుత్లీ...

ఆ గ్రామంలో ఎందరో దరిద్రరేఖకు దిగువన ఉన్నవారే. దారిద్ర్యం చేత దుర్భరంగా బాధపడుతున్నవారే. వారిలో నూటికి తొంభయి మందికి దారిద్ర్యమనే సంకెళ్ళువేసి బంధించింది విశ్వనాథ ఠాకూరనే మోతుబరి అని తెలిసినరోజు ప్రభుత్వం దేశం నుండి దరిద్రదేవతను తరిమిగొట్టే ప్రయత్నంలో ఎందుకు విఫలమయిందో అర్థమయిందతడికి.

అందరికీ చెందవలసిన దేశసంపద ఏ కొద్దిమంది దగ్గర మాత్రమే చేరిపోయింది. వాళ్ళ స్త్రీల మేని మీద ఆభరణాలుగా, వాళ్ళ ఇనుప్పెట్టెల్లో మూలిగేనోట్లకట్టలుగా నిష్ప్రయోజనంగా పడిఉంది. అందుకే దేశం ఒక్కడుగు ముందుకు వేస్తే పదిడుగులు వెనక్కి వేస్తోంది. ఈ పరిస్థితి మారాలంటే దేశంలో అందరూ ఆర్థిక సమానత్వం పొందాలంటే, సమాజం నిజమయిన ప్రగతిని సాధించాలంటే విశ్వనాథ ఠాకూరులాంటి వాళ్ళలో మార్పురావాలి. కానీ అది జరిగేదేనా?

ఆరోజు మధ్యాహ్నం చదువుకుంటున్న గౌతమ్ మనస్సు పుస్తకం మీద నిలవక వెళ్ళి కిటికీవద్ద నిలిచి బయటికి చూడసాగాడు. ఎదురింట్లో ఏదో గొడవ. ఎవరెవరో హడావిడిగా వస్తూ పోతూ ఉన్నారు. బసంతి తల్లిని పిలిచి విషయమేమిటని అడిగాడు. ఆమె చెప్పింది. విని భ్రుకుటి ముడివేసాడు గౌతమ్. ఎదురింటి యజమాని హరిరామ్‌కి మూడురోజులుగా కడుపులో కుడివేపు నొప్పి. ఏదో మామూలు కడుపునొప్పని స్థానిక వైద్యుడిచ్చిన ఏదో మందు మింగాడు. నొప్పి తగ్గకపోగా ఈరోజు ఎక్కువయి గిలగిల్లాడిపోతున్నాడు. తీరా ఇప్పుడు 'సాదాతకాదు. హాస్పిటల్‌కి తీసుకెళ్ళండి' అంటున్నాడు వైద్యుడు. రహదారి సరిగాలేని పల్లెటూరినుండి యాభయిమైళ్ళ దూరానఉన్న డాక్టరు

పట్నానికి నొప్పితో గిలగిల్లాడిపోతున్న రోగిని తీసుకెళ్ళడం అంటే మాటలా? ఏం చేయడమో తోచక ఇంట్లో అందరూ సతమతమవుతున్నారు.

అది అపెండిసైటిస్ ఇన్‌ఫెక్షన్ అని అర్థమయింది గౌతమ్‌కు. వెంటనే ఆపరేషన్ చేయాలి. లేకుంటే ఒక మంచి మనిషి కాటికి పయనమవుతాడు.

గౌతమ్ ఆలోచనలో పడ్డాడు.

తననెంతో అభిమానించే ఒక సహృదయుడిని ఆపదలో ఆదుకోవాలి. అయితే అందుమూలంగా తన ఆచూకీ తనే పోలీసులకు తెలియచేయడమవుతుందేమోనని అతడికి భయంగా ఉంది. పల్లెటూరి వాళ్ళను గురించి అతడికి తెలుసు. తనిప్పుడు హరిరామ్‌కి ఆపరేషన్ చేసి అతడి కడుపునొప్పి తగ్గడమే జరిగితే రేపీపాటికి తనపేరు ఈ చుట్టుపక్కల అన్ని గ్రామాల్లో కార్చిచ్చులాగా వ్యాపిస్తుంది. ఆతర్వాత ఇప్పట్లా తను రహస్యజీవనం చేయడం అసాధ్యం. ఒక వ్యక్తిని కాపాడే ప్రయత్నంలో తన ప్రాణాలమీదికి తెచ్చుకునే ప్రమాదం ఉంది. అయితే పరిచితుడయిన వ్యక్తి ప్రాణాపాయ స్థితిలో ఉన్నాడని తెలిసీ చేతులు ముడుచుకు కూర్చునేందుకు అతడి మనస్సు అంగీకరించలేదు. అందుకే తన బతుకును గురించిన భయం వెనక్కి నెట్టి హరిరామ్ ఇంటికి వెళ్ళాడు.

హరిరామ్ నొప్పితో గిలగిల్లాడుతుంటే ఇంట్లో అందరూ మంచంచుట్టూ చేరి నిస్సహాయంగా చూస్తున్నారు.

అందరినీ తప్పించుకుని వెళ్ళి పరీక్ష చేసాడు గౌతమ్.

"వెంటనే ఆపరేషన్ చేయాలి. లేకుంటే బతకడం కష్టం!" హరిరామ్ పెద్దకొడుకు శ్యామ్‌ని ఉద్దేశించి అన్నాడు గౌతమ్.

శ్యామ్ అనుమానంగా చూసాడుతప్ప మాట్లాడలేదు.

గౌతమ్‌కి చిర్రెత్తుకొచ్చింది.

"వెంటనే ఆపరేషన్ చేయకుంటే ప్రాణంమీదకి ముంచుకొస్తుందని చెప్తుంటే అలా మూగిమొద్దులా నిలబడతావేం?" కసిరినట్లు అన్నాడు.

పల్లెటూళ్ళలో ఇప్పటికీ చాలామంది అక్షర పరిజ్ఞానంలేనివాళ్ళే. మూఢనమ్మకాలను ఆశ్రయించుకుని బతుకుతున్నవాళ్ళే. హరిరామ్, అతడి నల్గురు కొడుకులు, ఇంకా గ్రామంలో చాలామంది అలాంటివాళ్ళే. అన్యులను అంత సులభంగా నమ్మలేరు. అందుకే మదరాసీ అయిన గౌతమ్‌ని సంవత్సరం పైగా అతడు తమతో కలసిమెలసి జీవిస్తున్నప్పటికీ అట్టేదూరాన ఉంచారు. పైగా అతడు సుశిక్షితుడయిన సర్జనని తెలీదు. అందుకే మామూలు కడుపునొప్పికి ఏదో ముంచుకువచ్చినట్లు అతడు వెంటనే ఆపరేషన్ చేయాలంటుంటే అతడిమాటలసలు పట్టించుకోలేదు. కానీ బాధతో మెలికలు తిరిగిపోతున్న హరిరామ్ తెప్పరిల్లి మూసుకుపోతున్న కళ్ళను బలవంతంగా తెరచి గౌతమ్‌ని చూసాడు. "బాబూ నువ్వు డాక్టరువా?"

అతడి నుదుట చెమట తుడుస్తూ, "అవును" అన్నాడు దయగా గౌతమ్.

చేతులు జోడించి నమస్కరిస్తూ, "బాబూ! నొప్పి భరించలేకున్నాను. ఆపరేషనే చేస్తావో మరేం చేస్తావో నీ ఇష్టం. ఈ నొప్పి తగ్గితే చాలు. నా చర్మంతో చెప్పులు కుట్టిస్తాను." అన్నాడు హరిరామ్.

"మరేం భయంలేదు. చాలా చిన్న ఆపరేషను. చేస్తే రేపీపాటికి నీ నొప్పి పూర్తిగా పోతుంది'' అనునయంగా అన్నాడు గౌతమ్.

గదిలో అందరూ గౌతమ్‌ని విభ్రాంతిగా చూస్తున్నారు.

దాదాపు సంవత్సరంగా తమలో ఒకడుగా కలసిపోయి అతిసామాన్యంగా జీవిస్తున్న అతను డాక్టరంటే వాళ్ళకు నమ్మశక్యం కావడంలేదు. వాళ్ళ ఆశ్చర్యంతో నిమిత్తం లేకుండా శ్యామ్ సహాయంతో ఆపరేషన్ పరికరాలు స్టెరిలైజ్ చేయించాడు గౌతమ్. తన బెడ్ రూంనే ఆపరేషన్ థియేటర్‌గామార్చి ఆపరేషన్ మొదలు పెట్టాడు. దాదాపు సంవత్సరం తర్వాత ఆపరేషన్ చేస్తుంటే చేతులకు పడిన బంధాలు విడిపోతున్నట్లు ఫీలయాడు.

అతడిమీద పూర్తిగా నమ్మకం కుదరని శ్యామ్ గౌతమ్ వద్దన్నా వినక తండ్రికి తోడుగా అక్కడే ఉన్నాడు. ఇష్టం లేకున్నా చేసేదిలేక ఊరుకున్నాడు గౌతమ్. గౌతమ్ ఆపరేషన్ చేస్తుంటే మహాద్భుతదృశ్యం చూస్తున్నట్లు విస్ఫారిత నేత్రాలతో చూస్తూ నిలబడ్డాడు శ్యామ్ చూసేకొద్దీ గౌతమ్‌పట్ల గౌరవభావంతో నిండిపోయిందతడి మానసం. తమలాంటి సామాన్యుడే అనుకున్న వ్యక్తి తమకంటే ఎంతో ఎంతో అధికుడని గ్రహించి సంభ్రమాశ్చర్యాలతో తలమునకలవుతున్నాడు.

గౌతమ్ చిరునవ్వుతో, "ఏమిటలా చూస్తున్నావు? మీ పితాజీకి ఇహ కడుపు నొప్పి బెడద ఉండదు" అన్నాడు.

శ్యామ్ అతడి చేతిని కళ్ళకద్దుకుని "షుక్రియా డాక్టర్‌సాబ్" అన్నాడు కృతజ్ఞతార్ద్ర కంఠంతో.

గౌతమ్ నవ్వి ఊరుకున్నాడు.

"డాక్టర్‌సాబ్! చేతిలో ఇంత ప్రజ్ఞ ఉంచుకుని మీరెందుకిక్కడ ఇలా అజ్ఞాతవాసం చేస్తున్నారు?"

ఎదుటివ్యక్తియొక్క వ్యక్తిగత రహస్యాలు తెలుసుకోవాలనే మానవ సహజ కుతూహలం శ్యామ్ ప్రశ్నలో ప్రస్ఫుటంగా ధ్వనించింది.

"సమయం వచ్చినప్పుడు నీకే తెలుస్తుంది" ముక్తసరిగా అన్నాడు గౌతమ్.

వారం రోజుల్లో హరిరామ్ బాగా కోలుకున్నాడు.

ఈ వారంరోజుల్లో గౌతమ్ పేరు చుట్టుపక్క గ్రామాల్లో అతడూహించినట్లే కార్చిచ్చులా వ్యాపించింది. రోగులు వెల్లువలా రాసాగారు.

వృత్తి ధర్మం విస్మరించలేక పోయాడు గౌతమ్. ఫలితంగా మళ్ళీ ఊపిరి పీల్చేందుకు వ్యవధిలేనంతగా బిజీ అయాడు. ఆ చుట్టుపక్కల గ్రామాల్లో ఉన్న రోగార్తులకు ఆపద్బాంధవుడయ్యాడు.

* * *

"హల్లో డాక్టర్!"

ఏదో మెడికల్ మేగజైన్ చూస్తున్న గౌతమ్ తలెత్తి చూసాడు.

ఎదురుగా ఇద్దరు పోలీసు ఆఫీసర్లు. వారికి కొద్దిగా వెనకాల నలుగురు కానిస్టేబుల్స్.

ఇద్దరు పోలీసు ఆఫీసర్లలో ఒకరు ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్రావని, అతను ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పోలీసు శాఖకు చెందినవాడని బాడ్జి తెలుపుతోంది.

గౌతమ్ గుండె తుళ్ళిపడింది.

తన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకిది

చివరి రోజా?

"హల్లో!"

ఆందోళన మనసులోనే అణచిపెట్టి ప్రశాంతంగా అడిగాడు.

"యూ ఆర్ అండర్ అరెస్ట్!" హేండ్ కఫ్స్ తీస్తూ అన్నాడు ఈశ్వర్రావు.

"ఎందుకు?" తొణక్కుండా అడిగాడు గౌతమ్.

"మీ భార్యను, స్నేహితుడిని, వంట మనిషిని హత్యచేసిన నేరానికి మీమీద అరెస్ట్ వారెంట్ తెచ్చాను" అన్నాడు ఈశ్వర్రావు.

మౌనంగా చేతులు ముందుకు చాచాడు గౌతమ్.

అతడి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు సంకెళ్లు పడ్డాయి.

డాక్టరుబాబుని పోలీసులు బంధించి తీసుకుపోతున్నారన్న వార్త క్షణాల్లో గ్రామమంతటా వ్యాపించింది. చేస్తున్న పనులు వదిలిపెట్టేసి అందరూ అతడి ఇంటిముందు చేరిపోయారు. చేతులకు సంకెళ్ళతో పోలీసుల నడుమ ఉన్న గౌతమ్‌ని చూసి స్త్రీలు ఏడవసాగారు. పురుషులు భయాందోళనలతో బితుకు బితుకుమంటూ చూస్తున్నారు.

దేవుడులాంటి డాక్టరుబాబు ఏమి నేరం చేసి ఉంటాడు?

అక్కడ చేరిన అందర్లోనూ అదే ప్రశ్న ఉదయించింది.

ఈశ్వర్రావు కదిలాడు.

అతడిననుసరించాడు గౌతమ్.

అతడికటుఇటు కానిస్టేబుల్స్.

బసంతి తుఫానులా వచ్చి అతడికాళ్ళు చుట్టేసింది. "బాబూ... మీరు వెళ్ళిపోతే మేము ఎలా బతకాలి?" వెక్కివెక్కి ఏడుస్తూ అంది.

ఆమె వేపు చూసిన గౌతమ్ కళ్ళల్లో సన్నని నీటిపొర.

నిష్కల్మష హృదయంతో తననభిమానించే ఆ అమ్మాయిపట్ల అతడికే తెలీకుండా అభిమానం పెంచుకున్నాడేమో. ఇప్పుడా అభిమానం తెంచుకుని వెళ్ళిపోవాలంటే దుస్సహంగా ఉంది. కాని తప్పదు. ఈ క్షణం నుండి తన జీవితం మీద తనకధికారంలేదు.

బసంతి తండ్రిని చూసి, ''ఈ ఇల్లు బసంతి పేరరాసాను. పత్రాలు నా టేబిల్ సొరుగులో ఉన్నాయి. తీసి జాగ్రత్త పరచు. స్టేట్ బేంకిలో ఆమెపేర పదివేలు జమఉంది. మంచి సంబంధం చూసి పెళ్ళి చేసెయ్యి. తన పెళ్ళి చూసే ప్రాప్తం నాకు లేదు'' అని సజలనయనాలతో తన కేసి చూస్తున్న గ్రామస్థుల వయిపు ఆర్ద్రంగా చూసాడు. ''అయిన వాళ్ళందరికి దూరమయి ఇంతదూరం వచ్చేసిన నన్ని న్నాళ్ళూ అభిమానంతో మీ గుండెల్లో దాచుకున్నారు. తల్లిదండ్రులు, తోబుట్టువులు దగ్గిరలేని లోటుదీర్చారు. మరో జన్మంటూ ఉంటే మీలో ఒకడుగా పుట్టాలని భగవంతుడిని ప్రార్థిస్తాను. ఇప్పటికి నాకు సెలవియ్యండి'' అని కన్నీటితో గ్రామస్థులనుండి వీడ్కోలుతీసుకున్నాడు.

అంతా చూస్తున్న ఈశ్వర్రావు కదిలిపోయాడు ''సారీ డాక్టర్... నేను నా డ్యూటీ చేస్తున్నాను'' అన్నాడు నెమ్మదిగా.

''ఇట్సాల్‌రైట్'' అని అతడి వెనకే పోలీసు వాను ఎక్కాడు గౌతమ్.

అందరూ ఆరాత్రే విజయవాడ వెళ్ళే రైలెక్కారు.

ఈశ్వర్రావు అతడిని ఎంతో మర్యాదగా ట్రీట్ చేస్తున్నాడు.

పోలీసు లాకప్‌లో ఉన్న అతడిని చూసేందుకు తల్లిదండ్రులు,తోబుట్టువులు అందరూ వచ్చారు.

"నిన్నీ స్థితిలో చూసేందుకే నేనింకా బతికున్నానా?ఎంత గారాబంగా పెంచాము. నీ మీద ఎన్నెన్ని ఆశలు పెట్టుకున్నాము. చివరికి నీ జీవితం ఇలాగయిందేమిట్రా నాన్నా? ఆ నడతచెడిందాన్ని తన్ని తగలేయక దాన్ని చంపి హత్యాపాతకం మూటగట్టుకున్నావు. నీ కంఠానికి నువ్వే ఉరితాడు తెచ్చుకున్నావు. ఈ ఘోరం నేను చూడలేనురా తండ్రీ... నేను చచ్చిపోతాను" అంటూ వలవల ఏడిచింది సుందరమ్మ.

"నా మూలంగానే ఇంత అనర్థం జరిగింది. పాపిష్టిదాన్ని... నోర్మూసుకుని ఊరుకుంటే ఏ గొడవా జరిగి ఉండేది కాదు" వెక్కిళ్ళమధ్య అంది స్వప్న.

గౌతమ్ మాట్లాడలేదు.

వాళ్ళు ఉన్నంతసేపు నోరు విప్పకుండా శిలాసదృశంగా ఉండిపోయాడు. నభలయి అయిదు నిమిషాల తర్వాత పరాంకుశంగారు తప్ప తక్కినఅందరూ వెళ్ళిపోయారు.

"చదువుకున్నవాడివి. చట్టాన్ని చేతుల్లోకి తీసుకోవడం నేరమని తెలీదూ?" అన్నారు పరాంకుశంగారు. ఆయన మాటల్లో నిందకన్న వ్యథ ఎక్కువగా ఉంది.

"డాడీ.... ఒక మాటడిగనా?"

ఇంతసేపటికి నోరుతెరిచాడు గౌతమ్.

"ఏమిటి నాన్నా?"

"నాకెదురయిన పరిస్థితి మీకెదురయి ఉంటే మీరేం చేసి ఉండేవారు?"సూటిగా అడిగాడు గౌతమ్.



"వద్దు నాయనా. ఏ మగాడికీ అటువంటి పరిస్థితి ఎదురవ్వకూడదు" ఆవేదనగా అన్నారు పరాంకుశంగారు.

"నేను చేసింది నేరమని అంగీకరించేందుకు ఇప్పటికీ నా మనస్సు ఎదురుతిరుగుతోంది...."

"నీ దృష్టిలో నువ్వు చేసింది నేరం కాకపోవచ్చు. కానీ చట్టం అలా అనుకోదుగా. పైగా శవాలను ముక్కలు చేసి విరజిమ్మి పోలీసులకు పని కల్పించావు. అది ప్రభుత్వం దృష్టిలో మహాపరాధం. తమకింత శ్రమ కలిపించావని పోలీసు సిబ్బందికి నీ మీద గొంతుదాకా కోపం ఉంది. ఇప్పుడు నిన్నెలా కాపాడుకోవడం...?"

"డాడీ! నేను శిక్ష అనుభవించేందుకు సిద్ధంగానే ఉన్నాను"

"శిక్ష అనుభవించేందుకు నువ్వు సిద్ధంగా ఉన్నా నిన్ను ఉరికంబానికప్పజెప్పేందుకు నేను సిద్ధంగా లేను. ఫీజు పుచ్చుకున్న పుణ్యానికి నాకెంతమాత్రం సంబంధంలేని ఎందరినో ఉరిశిక్ష పడకుండా కాపాడగలిగాను. నా ప్రాణంలో ప్రాణమయిన నిన్ను కాపాడుకోలేనా? సమాజానికి ఎదురు నిలిచి పోరాడిఅయినా సరే నిన్ను కాపాడుకుంటాను" దృఢనిశ్చయంతో అన్నారు పరాంకుశంగారు.

తండ్రివయిపు జాలిగా చూసాడు గౌతమ్.

"అంటే నాకు ఉరిశిక్ష పడటం ఖాయమని మీరు నమ్ముతున్నారు కదూ!"

"గౌతమ్!" గుండెల మీద ఎర్రగా కాల్చిన ఇనుముతో వాత పెట్టినట్లు గిలగిల్లాడిపోతూ అన్నారు పరాంకుశంగారు.

నిర్లిప్తహాసం చేసాడు గౌతమ్. "విని జీర్ణించుకోలేని నిజాలు ఎన్నో ఉన్నాయి డాడీ. అందులో ఒక నిజం – నాకు

ఐతకాలనిలేదు. ఎంత త్వరగా నన్ను ఉరి కంబం ఎక్కిస్తే నాకంత మంచిచేసిన వాళ్ళవుతారు''

''ఇలా మాట్లాడుతూ నన్నెందుకురా హింసిస్తావు!''

కోర్టులో తన వాదనతో ప్రత్యర్థిని గడగడలాడించే పరాంకుశంగారు నిస్సహాయంగా కన్నీళ్ళు పెట్టుకుంటూ అన్నారు.

గౌతమ్ మౌనంగా ఉండిపోయాడు.

"ఈ మూడేళ్ళుగా ఇంట్లో అందరూ ఎంత నరకం అనుభవిస్తున్నామో నీకు తెలీదు. వేళకు తిండీ నిద్రలేక, మనశ్శాంతి లేక కుమిలిపోతున్నాము. వివేకం, విచక్షణ ఉన్నవాడివి. ఆవేశానికి లొంగిపోయి రాక్షసుడిలా ప్రవర్తిస్తావా? నువ్వింత దారుణానికి ఒడిగట్టావంటే నేనిప్పటికి నమ్మలేకపోతున్నాను. గొప్ప వంశంలో పుట్టావు, తెలివితేటలతో వంశానికి కీర్తి తెచ్చావు..."

"ఇప్పుడు హంతకుడినయి వంశానికి మాయనిమచ్చ తెచ్చాను" అని తండ్రి మాటలు పూర్తిచేసాడు గౌతమ్.

"వెధవ వంశం గురించి నేనేడవడం లేదు. నా బాధంతా నీ గురించే"

"బాధపడి ప్రయోజనమేమిటి? జరిగేది జరక్క మానదు. మనస్సు రాయి చేసుకోండి" తండ్రికి సలహా ఇచ్చాడు తనయుడు.

అతడివయిపు దీర్ఘంగా చూసారు పరాంకుశంగారు.

ఎంతో సంబరంగా చేసిన పెళ్ళి కొడుకు మెడకు ఉరితాడయి చుట్టుకుంటుందని ఆయనకలలో నయినా ఎదురు చూడలేదు. కట్టుకున్న భార్య, ప్రాణ స్నేహితుడని విశ్వసించిన వ్యక్తి కలసి వంచన చేస్తే పౌరుషవంతుడయిన మగాడనుభవించే ఆగ్రహావేశాలు అవమానావేదనలు ఎటువంటివో ఆయన ఊహకు అందనివేమీ కాదు. కానీ కొడుకు మరీ అంత రాక్షసంగా హత్యచేసి ఉండకూడదని ఆయన ఆత్మ ఘోషిస్తోంది. పైగా ఏ తప్పుచేయని నరసమ్మను చంపడం...

అది అతడిలోని రాక్షస ప్రవృత్తిని ఎత్తి చూపేలాగుంది. అదే అతడికి కేపిటల్ పనిష్మెంట్ పడేందుకు చక్కగాని ఆయుధమయింది.

పైగా పోలీసులను ఛాలెంజి చేస్తున్నట్లు హతుల ఖండిత శిరస్సులను పోలీసు ఆవరణలోకి విసిరేయడం...

సర్వనుగా ఎంత లబ్ధప్రతిష్ఠుడయినప్పటికి ప్రభుత్వం యొక్క సానుభూతి పోగొట్టుకున్నాడు గౌతమ్. పైగా అతడిని వేటాడే ప్రయత్నంలో ప్రభుత్వానికి ఎంతో డబ్బు ఖర్చయింది. పోలీసు ఉద్యోగులు ఎంతో శ్రమకు లోనయ్యారు. అందుకే...

తన తెలివితేటలు, శక్తి సామర్థ్యాలు సర్వం వినియోగించినప్పటికి కొడుకుని ఉరికంబంనుండి తప్పించడం దుర్లభమేమో అనిపించి గుండెలు దిగజారిపోయాయాయనకు.

చిత్తక్షోభతో మరో పదేళ్ళు మీద పడ్డట్టున్న తండ్రిని తడికళ్ళతో చూసాడు గౌతమ్. తన మూలంగా కన్న తల్లి దండ్రులు, తోబుట్టువులు ఇంకా ఎందరో ఆత్మీయులు దుస్సహమయిన వ్యధననుభవిస్తున్నారని అతడు ఎరుగును.

సృష్టిలో మనిషి సాధించలేనిది ఒకటే. అది గతంలో కలసిపోయిన కాలాన్ని తిరిగి పొందడం. గతించిన కాలాన్ని

తిరిగి పొందలేనపుడు గతంలో చేసిన పొరబాట్లుసవరించుకోవడమూఅసాధ్యమే. అటువంటప్పుడు చేసిన తప్పులకు శిక్ష అనుభవించడం అనివార్యమవుతుంది. అయితే వచ్చిన చిక్కేమిటంటే, నేరస్థుడు అనుభవించే శిక్ష అతడి ఆత్మీయులకు తీరందేకోత కావడమే. అనురాగాలకు, ఆత్మీయతలకు మనిషి బంధితుడయి ఉన్నంత దాకా ఈ పరిస్థితిలో మార్పు రాదు.

గౌతమ్ నిస్పృహగా నిట్టూర్చి ఊరుకున్నాడు.

రోజులు నిరుత్సాహంగా, నిస్తేజంగా గడిచిపోతున్నవి.

గౌతమ్ కేసు సెషన్స్ కోర్టులో విచారణకు వచ్చింది.

గౌతమ్‌ని సబ్ జైలుకి తరలించారు

భార్యను చంపిన సర్జను....

హంతకుడయిన కొడుకు తరపున వాదించే తండ్రి...

గౌతమ్ కేసు ఊళ్ళో బహుళ ప్రాచుర్యం పొందింది.

కోర్టులో విచారణ జరిగినంత కాలం వేలాదిమంది హాజరయ్యారు.

ఆరోజు తీర్పు చెప్పేరోజు.

ప్రేక్షకులతో కోర్టుహాలు కిటకిట లాడుతున్నది.

ముద్దాయి బోనులో ఉన్న గౌతమ్ ఒకసారి అందరిని పరికించి చూసాడు. అతని ఆత్మబంధువులందరూ ముందు వరసలోనే కూర్చుని ఉన్నారు. అందరి మొహాల్లో ఆదుర్దా కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నది.

గౌతమ్ దీర్ఘంగా నిట్టూర్చాడు.

జడ్జిగారి రాకను కోర్టు బంట్రోతు తెలియబరిచాడు.

కోర్టు ఆచారం అనుసరించి అందరు సవినయంగా లేచి నిలబడ్డారు. జడ్జిగారు హుందాగా తమ ఆసనంలో ఆశీనులయాక అందరూ కూర్చున్నారు.

కోర్టులో నీరవ నిశ్శబ్దం వ్యాపించింది.

ఒకవ్యక్తి జీవన్మరణ సమస్య!

తీర్పుకోసరం అందరూ ఉత్కంఠగా ఎదురుచూస్తున్నారు.

ఆ కోర్టులో హాజరయిన చాలామంది ఏదో ఒక సందర్భంలో గౌతమ్ దగ్గర వైద్య సహాయం పొందినవాళ్ళే.

ఇస్త్రీ మడతలు నలగని బట్టలతో నీటుగా స్మార్టుగాఉండే ఆనాటి గౌతమ్‌తో- పెరిగిన గడ్డం, తైలసంస్కారంలేని వెంట్రుకలు, నలిగిపోయి మాసిపోయిన బట్టలు, ముఖంలో గూడుకట్టుకున్న ఉదాసీనంతో ఆనాటి గౌతమ్‌కి ఛాయలాగున్న ఈనాటి గౌతమ్‌ని పోల్చి చూడకుండా ఉండలేకపోయారు.

విధి మనిషిని కీలుబొమ్మను చేసి ఆడిస్తుందంటారు. లేకుంటే ముఖంలో చెదరని చిరునవ్వుతో శాంతిదేవతలా రోగులను పరామర్శించే దయార్ద్ర హృదయుడు ఒకరిని కాదు, ఇద్దరినికాదు, ముగ్గురిని క్రూరంగా, రాక్షసంగా హత్యచేయడమేమిటి? ఆ సమయంలో ఏ దుష్టశక్తి అతడిని ఆవహించిందో!

అతడు నరహంతకుడయినప్పటికి అతడికి ఉరిశిక్ష పడవచ్చునన్న ఊహనే చాలామంది భరించలేకపోయారు.

జడ్జిగారు నిర్వికారంగా జడ్జిమెంట్ చదివారు.

ఎదురు చూసినట్లే ముద్దాయి గౌతమ్‌కి ఉరిశిక్ష పడింది.

రూపుదాల్చిన గాంభీర్యం లాగుండే అతడి తండ్రి ఉన్నచోటనే కూలి.

పోయాడు.

తల్లి, ఇద్దరు చెల్లెళ్ళు స్పృహతప్పి పడిపోయారు.

తనకు ఉరిశిక్ష పడినందుకు కించిత్తు చలించలేదు గౌతమ్. కానీ తన వారి దుఃఖం చూసి అతడి మనస్సు చెదిరి పోయింది. గుండెల మీద వేయిటన్నుల భారం ఉంచినట్లనిపించసాగింది. నవ్వు, నవ్వించు అన్న సిద్ధాంతానికి కట్టుబడి జీవించిన తను ఈ రోజు ఎందరిని ఏడిపిస్తున్నాడు?

తను నిజంగా తప్పుచేసాడా?

ఒకవ్యక్తి చేసే తప్పొప్పుల ప్రభావం



అతడి కుటుంబ సభ్యులందరి మీద ప్రత్య
క్షంగానో, పరోక్షంగానో ప్రసరిస్తుందం
టారు. తను చేసిన నేరం, ఫలితంగా
తానను భవించబోయే శిక్ష మూలంగా తన
కుటుంబం అప్రతిష్ట పాలవుతుందా?

లావణ్యను హత్యచేసాక మొదటి
సారిగా అతడిలో అలజడి చెలరేగింది.

పోలీసు ఎస్కార్టుతో వ్యానెక్కబోతూ
మాధవిని చూసి ఆగాడు.

"నిన్ను కాదన్నందుకు భగవంతుడు
నాకు సరయిన శిక్షే విధించాడు. కదూ?''

''బావా!'' అని బావురుమంది
మాధవి.

నిండు గర్భిణిగా ఉన్న ఆమెను ఒక
సారి కళ్ళారా చూసి ''నీకు మగబిడ్డ
పుడితే నా పేరే పెడ్తావు కదూ?''
అన్నాడు.

రోదిస్తూ వెనక్కి తిరిగి పారిపోయింది
మాధవి.

అప్రయత్నంగా స్పందన గుర్తొచ్చిం
దతడికి.

'స్పందనా!'

ఆవేదనగా అనుకున్నాడు.

'భగవంతుడా...నా మెడకు ఉరితాడు
చుట్టుకునేలోగా ఒక్కసారి నా స్పందనను
చూసే వరం ప్రసాదించు. సంతోషంగా
ఉరికంబం ఎక్కుతాను' అని దైవాన్ని
ప్రార్థించాడు.

ఆరోజే మరణశిక్ష అనుభవించేనిమిత్తం
అతడిని సెంట్రల్ జైలుకి తరలించారు.

* * *

సెంట్రల్ జైలు సూపర్నెంట్ నిరంజన
రావుగారు.

మరణశిక్ష పొందిన ఖైదీగా తన
ముందు నిలబడిన గౌతమ్‌ని చూసి నిశ్చేష్ఠ
లయిపోయారు.

"గౌతమ్! నువ్వు...'' ఎంతో సేప
టికి తెప్పరిల్లి అన్నారు.

''మరణ సమయంలో ఆత్మీయులు
చెంత ఉండే మనస్సుకి ఓదార్పుగా
ఉంటుందంటారు. నాకా అదృష్టం ఉండ
దేమో అనుకున్నాను. కీడులో మేలు
జరిగినట్లు మీరిక్కడే ఉండటం...''
అంటూ ఏదో చెప్పబోయాడు గౌతమ్.

"గౌతమ్" ఆక్రోశిస్తున్నట్లే అన్నారు
నిరంజనరావుగారు.

ఒకసారి ఆయనవంకచూసి మౌనంగా
ఉండిపోయాడు గౌతమ్.

గౌతమ్ వెంట వచ్చిన ఎస్కార్ట్
పోలీసులు, జైలు సిబ్బంది ఇద్దర్నీ వింతగా
చూసారు.

గౌతమ్‌ని నిరంజనరావుగారు
స్వయంగా చెక్ చేసారు. చేస్తూ "నా
జీవితంలో ఇటువంటి దురదృష్టకరమయిన
ఘడియ వస్తుందని నేనెదురుచూడలేదు"
అన్నారు.

ఆ మాటలంటుండగా ఆయన కంఠం
వణికింది.

"ఎదురుచూడనిది జరగడం, ఎదురు
చూసేది జరక్కపోవడం... అదే
జీవితం" అన్నాడు గౌతమ్.

"వేదాంతం ఒంటబట్టించుకుంటు
న్నావా!" ఆవేదనగా అన్నారు నిరంజన
రావుగారు.

విరక్తిగా నవ్వి, "ఆపత్సమయంలో
వేదాంతాన్ని ఆశ్రయించడం మన
కలవాటేగా" అన్నాడు గౌతమ్.

ఖైదీని అప్పజెప్పినట్లు ఉత్తరం తీసు
కుని సెల్యూట్ చేసి కానిస్టేబిల్స్‌ని
వెంటబెట్టుకుని వెళ్ళిపోయాడు
సబిన్‌స్పెక్టర్.

పోలీస్ లాకప్పులో, సబ్‌జైలులో గౌతమ్‌ని గౌరవంగానే చూసారు. ఇక్కడ నిరంజనరావుగారు ఉన్నారు.కనక ఇక్కడా అవమానకరమయిన పరిస్థితిలో ఇదొక ఓదార్పు వంటిదే!

స్పందన గురించి అడగాలన్న కోరికను మనస్సులోనే అణచిపెట్టి వార్డర్ వెంట కండెమ్ బ్లాకుకేసి నడిచాడు.

మరణశిక్ష విధించబడిన ఖైదీలను ఉంచే ఆ బ్లాకులోనికి వెళుతుంటే అతడి అంతర్నేత్రాల ముందు తన ప్రాణజ్యోతి రెపరెపలాడుతూ కనిపించింది.

గుహలాంటి సెల్‌లోకి అతడిని సాగ నంపి కటకటాల తలుపు మూసి తాళం పెట్టాడు సెంట్రీ.

సెల్‌లో మురికి వాసన ఇంకేదేదో దుర్వాసనలతో సమ్మిళితమయి...అతడికి కడుపులో తిప్పుతున్నట్లనిపించింది.

అయిదు లక్షలు వెచ్చించి అత్యంతాధునికంగా కట్టించుకున్న స్వగృహం, సినిమా సెట్టింగులా ఆధునికంగా ఆడంబరంగా ఉండే డ్రాయింగ్‌రూం, బెడ్‌రూం గుర్తొచ్చి గుండె కలుక్కుమంది. ఒక సదుపాయం తగ్గినా తన మనస్సంగీకరించదు. చిన్నప్పటినుండి అలాగే రాజవైభవంగానే గడిచిపోయింది. మరి ఇప్పుడు...

పక్కకింద ఉపయోగించుకోవలసిన పాత గొంగళి, మలమూత్రాదులు విసర్జించేందుకివ్వబడిన మట్టిపాత్ర చూసి రక్తం వచ్చేలా పెదిమలు కొరుక్కున్నాడు. ఉరికంబం ఎక్కేందుకు అభ్యంతరం లేదుకానీ అంతవరకు నరకంలాంటి ఈ మురికి కూపంలో ఉండాలనుకుంటే అతడి మనస్సు తీవ్రమయిన సంక్షోభానికి గురయింది. మోకాళ్ళమీద తలవాల్చి కూర్చున్న అతడికి జీవితం స్తంభించిపోయినట్లనిపించింది.

ఇలా ఎన్నాళ్ళు?

ఆ రాత్రి అతడిని నిద్రాదేవత కరుణించలేదు.

ఎలాగో రాత్రి గడిచి తెల్లవారింది.

తనిక్కడికి వచ్చి ఒకరోజు గడిచింది.

ఒకోరోజు గడిచేకొద్దీ తను మృత్యువుకి ఒకో అడుగు దగ్గరవుతాడు.

నిర్వేదంగా నవ్వుకున్నాడు గౌతమ్.

మాట తోడులేక, కనీసం సాటిమనిషి మొహం చూసే అవకాశమయినాలేక ఈ రాతి గోడలమధ్య కటకటాలు లెక్కిస్తూ చావుకోసం ఎదురుచూస్తూ క్షణాలు యుగాలుగా దుస్సహంగా దుర్భరంగా ఎన్నాళ్ళ గడపాలి?

అతడికి తెలుసు.

సెషన్స్ కోర్టులో ఉరిశిక్ష పొందిన ముద్దాయి సెంట్రల్ జైలుకి వచ్చినరోజే ఆ ఉరిశిక్ష అమలుజరపరు. హైకోర్టుకి అప్పీలు చేసుకోవాలి. హైకోర్టులో కేసు తోసివేస్తే సుప్రీంకోర్టుకి అప్పీలు చేసుకోవాలి. సుప్రీంకోర్టులో కూడా కేసు తోసేసి మరణశిక్ష కన్‌ఫమ్‌చేస్తే చివరి ప్రయత్నంగా రాష్ట్రపతికి మెర్సీపిటిషన్ పెట్టుకోవాలి. రాష్ట్రపతి దయ తలచకుంటే ఆతర్వాత ముద్దాయిని దేవుడయినా ఉరికంబం నుండి కాపాడలేడు.

ముద్దాయిని ఉరితియ్యవలసిన తేదీ, రోజు, సమయం తెలుపుతూ ప్రభుత్వం నుండి ఆదేశం వచ్చిన మరుక్షణం నుండి అతడిని ఉరికంబం ఎక్కించేందుకు చకచక ప్రయత్నాలు జరుగుతాయి.

ఈ లెక్కన ముద్దాయి సెషన్స్ కోర్టులో మరణశిక్ష అనుభవించేందుకు కనీసం సంవత్సరం పడుతుంది. అంటే

[illegible] ... 75

తనకోసం పొంచికూర్చున్న చావునే అనుక్షణం తలచుకుంటూ ముద్దాయి సగం చచ్చిపోతాడు.

గుండెలమీద మంచుముద్ద పెట్టి నొక్కుతున్నట్లనిపించింది.

చావుకన్న చావుని గురించిన ఆలోచనే మనిషిని ఎక్కువ భయ విహ్వలుడిని చేస్తుందేమో! ఆ భయమే అతడిలోని సర్వశక్తులనూ పీల్చేసి, జీవచ్ఛవంచేసి వదులుతుంది. అందునా తను ఫలానా రోజు ఫలానా సమయంలో ఫలానా విధంగా చంపబడ్తాడని ముందే తెలియడం- ఓహ్...

అస్థిమితంగా కణతలు నొక్కుకున్నాడు గౌతమ్.

ఉరిశిక్షకన్న భయంకరమయింది ఈ ఏకాంతవాస శిక్ష. ఆలోచనలు అహరహం మనస్సుని కుళ్ళబొడుస్తుండే మనశ్శాంతి కరవయి అలమటిస్తూ, ఆక్రోశిస్తూ, కుమిలిపోతూ...




అతనలా అంధకార పరివేష్టితుడయి మృత్యువు వికటాట్టహాసం వింటూ ఆత్మ స్థయిర్యం కోల్పోతున్న తరుణంలో గ్రీష్మంలో మలయమారుతంలా వచ్చింది స్పందన.

ఆమెను చూసి గౌతమ్ హృదయం తుళ్ళిపడింది.

వేగంగా కటకటాల తలుపువద్దచేరి స్పందనను ఆర్తిగా, తపనగా చూడసాగాడు.

"జీవితంలో నిన్ను మళ్ళీ చూస్తాననుకోలేదు" భావావేశంతో అతడి కంఠం వణికింది.

"నేనూ మిమ్మల్ని ఈ స్థితిలో చూస్తాననుకోలేదు" వెక్కి వెక్కి ఏడుస్తూ అంది స్పందన.

"అరే...నువ్వింత బేలవనుకోలేదు సుమా. ఎవరయినా చూస్తే ఏమనుకుంటారు. ఊరుకో!" లాలనగా అన్నాడు గౌతమ్.

స్పందన ఏడుపు తగ్గకపోగా మరింత ఎక్కువయింది.

ఆమెను ఓదార్చడం ఎలాగో తెలీక నిస్సహాయంగాచూస్తూ నిలబడిపోయాడు గౌతమ్.

చిత్రంగా అతడి హృదయభారం తగ్గిపోయింది.

తన మనస్సున, అణువణువున నిండిపోయిన ఈ స్త్రీ తనకోసం బాధపడటం... అతడి మనస్సుకెంతో ఊరటనిచ్చింది.

ఏడ్చి ఏడ్చి అలసిపోయింది స్పందన.

"సారీ..ఏడుపు ఆపుకోలేకపోయాను" కన్నీటి చారికలతో మలినమయిన మొహం తుడుచుకుంటూ అంది.

గౌతమ్ మాటలాడలేదు.

కొన్ని నిమిషాల నిశ్శబ్దం తర్వాత గౌతమ్ అన్నాడు. "నువ్వెప్పుడు వచ్చావు?"

ఆశ్చర్యంగా చూసింది స్పందన. "నేను రావడమేమిటి. నేనసలు ఎక్కడికి వెళ్ళాను?"

ఆశ్చర్యపోవడం ఈసారి గౌతమ్ వంతయింది.

స్పందన వంక పరిశీలనగా చూసాడు.

తొమ్మిదేళ్ళ క్రితం వెల్లూరులో చివరిసారి చూసినప్పుడు ఎలా ఉందో ఇప్పుడూ అలాగే ఉంది.

ఎక్కడా ఏమార్పూ లేదు. ముఖ్యంగా పెళ్ళయిన చిహ్నాలు కనిపించలేదు.

గౌతమ్‌కి అర్థంకాలేదు.

"ఏమిటలా చూస్తున్నావు?"

"స్పందనా!నువ్వు స్టేట్స్ వెళ్ళలేదూ?

అతడి కళ్ళలోకి సూటిగా చూసింది స్పందన. "నా మనస్సు, ప్రాణాలు ఇక్కడే ఉండగా స్టేట్స్ ఎందుకు వెళ్తాను?"

"ఏమిటో నాకంతా అయోమయంగా ఉంది"

"మా బావతో నాపెళ్ళి కాలేదు"

అతడి అనుమానం నివృత్తి చేస్తూ అంది స్పందన.

"స్పందనా?"

క్షణాల్లో గౌతమ్‌లోఎన్నో సందేహాలు, అనుమానాలు చోటుచేసుకున్నవి. స్పందన మౌనంగా చూసింది.

ఏడుపుతో అరుణిమదాల్చిన ఆమె నయనాలు ఏదో చెప్తున్నవి. అయితే ఆ విశాల నేత్రాల్లో కదలాడుతున్న భావం ఏమిటో గౌతమ్ గ్రహించలేకపొయ్యాడు.

"మీ పెళ్లి ఎందుకు ఆగిపోయింది?" ఉత్కంఠగా అడిగాడు గౌతమ్.

మృత్యుముఖాన నిలిచికూడా ఎదుటి వ్యక్తి వివరాలు తెలుసుకోవాలన్న తాపత్రయం... నిజంగా మనిషి ప్రవృత్తి చిత్రమయింది!

"బావను చేసుకోవడం నాకిష్టంలేదు. ఆమాటే బావతో చెప్పాను. నామనస్సర్థం చేసుకుని బావ తనకు నచ్చిన మరో స్త్రీని చేసుకున్నాడు" మంద్రస్వరాన అంది స్పందన.

ఆమె కళ్ళలోకి లోతుగా చూసాడు గౌతమ్.

ఆమెమనస్సు తనదేనేమోనన్న ఆనాటి అనుమానం అతడిలో మళ్ళీ తలెత్తింది. కాసేపు తర్వాత, "ఇప్పుడు నువ్వేం చేస్తున్నావు?" అడిగాడు.

"మీతో మాట్లాడుతున్నాను"

చాలారోజుల తర్వాత హాయిగా నవ్వాడు గౌతమ్.

"నీ అల్లరి తగ్గలేదు"

ఏదో చెప్పబోయి ఆగింది స్పందన.

ఆమె మొహంలో మళ్ళీ నీలి నీడలు దట్టంగా పరచుకున్నవి.

"ఈ ఊళ్ళోనే ఉంటున్నావా?" అడిగాడు గౌతమ్.

ఆమె వివరాలు తెలుసుకోవాలన్న తాపత్రయం అతడిని వదిలిపెట్టలేదు.

"ఉఁ. ఇక్కడే ప్రయివేట్ ప్రాక్టీసు పెట్టాను"

"పెళ్ళి?"

"ఈ జన్మలో ఆ ప్రసక్తి లేదు"

గౌతమ్ నిట్టూర్చాడు.

"నన్ను చూస్తే నీకసహ్యం వేయడం లేదూ?" కాసేపు తర్వాత అడిగాడు గౌతమ్.

అతడి కళ్ళలోకి చూసింది స్పందన.

"ఎందుకు?"

"కట్టుకున్న భార్యను హత్యచేసిన రాక్షసుడిని..."

"అది మీవ్యక్తిగత విషయం. నాకు తెలిసిన మీరు స్నేహార్ద్ర హృదయులు. ప్రేమించడమే తప్ప ద్వేషించడం తెలీని సౌమ్యులు. మీమూలంగా నాకెటువంటి హాని కలగలేదు. అటువంటప్పుడు మిమ్మల్ని నేనెందుకు అసహ్యించు

కోవాలి?"

"బేబీ.. వెళ్దామా?" అంటూ వచ్చారు నిరంజనరావుగారు.

"నేను రావడం... మీకభ్యంతరమా?" చిన్నగా అడిగింది స్పందన వెళ్ళేముందు.

"నీరులేక వాడిపోతున్న మొక్క అమృత ధారలను కాదంటుందా!" అన్నాడు గౌతమ్.

తండ్రితో కలిసి వెళ్ళిపోయింది స్పందన.

వెలుగులోంచి మళ్ళీ గాఢాంధకారం లోకి నెట్టివేయబడినట్టయింది.

స్పందన రేపు వస్తుంది.

ఆ ఆలోచనే నూత్నోత్సాహాన్నివ్వగా చాలారోజుల తర్వాత ఆరాత్రి ఆద మరచి నిద్రపోయాడు.

మర్నాడు...

మనస్సు, అణువణువు స్పందనను మళ్ళీ చూడబోతున్న సంతోషంతో తుళ్ళి పడ్తుండగా ఆమెకోసం నిరీక్షిస్తూ అసహనంగా, అస్థిమితంగా గడిపాడు.

సాయంత్రం నాలుగ్గంటలకు స్పందన వచ్చింది.

సరిగ్గా ఆరుగంటలకు తండ్రితో కలసి వెళ్ళిపోయింది.

మరో నాలుగు నెలలు కాలగర్భంలో కలిసిపోయాయి.

స్పందన ప్రతిరోజూ వస్తూనే ఉంది.

ఆమెతో గడిపే ఆ రెండు గంటలు రోజులో మిగిలే తర్వాత ఇరవయిరెండు గంటలు బతికేందుకు కావలసిన శక్తినిస్తుంది గౌతమ్‌కి. ఆమె కళ్ళలోకి చూస్తూ స్నేహపూరితమయిన ఆమె మాటలు వింటూ తాత్కాలికంగా తన దుస్థితిని మరచిపోతాడు. ఆరోజు హైకోర్టులో అతడి కేసు తోసివేయబడినట్లు కబురు తెలిసింది.

ఎదురుచూసిందే అయినప్పటికి ఆరోజంతా దిగులుగా, భారంగా గడిచింది.

ఏడుస్తున్న స్పందనను అనునయించే ప్రయత్నమయినా చేయక నిర్లిప్తంగా ఉండిపోయాడు గౌతమ్.

"ఎటువంటి నేరాన్నయినా క్షమించగల మగాడు భార్యలో అవినీతిని క్షమించ లేడు....నిజమే.... కానీ మీరు కొద్దిపాటి నిగ్రహం పాటించి ఉంటే ఇప్పుడీ విపత్కర పరిస్థితి ఏర్పడి ఉండేదికాదు. అన్నిదారులూ మూసుకుపోయాక ఇప్పుడేం చేయడం? మిమ్మల్ని ఎలా కాపాడుకోవడం?" ఏడుస్తూ అంది స్పందన.

కటకటాలు పట్టుకున్న చేతుల మీద తలవాల్చి మౌనంగా ఉండిపోయాడు గౌతమ్.

అతడి తలమీద చెయ్యి ఉంచింది స్పందన.

చివ్వున తల ఎత్తి చూసాడు గౌతమ్.

ఇద్దరూ ఒకరికేసి ఒకరు చూసుకుంటూ కొన్ని క్షణాలు అలాగే నిశ్శబ్దంగా ఉండి పోయారు.

చివరికి గౌతమ్ దీర్ఘంగా నిట్టూర్చి అన్నాడు – "నేను నిజంగా దురదృష్టవంతుడిని. అందుకే నాకు కావలసిందేమిటో ఇదమిత్థంగా తెలుసుకోలేక పోయాను. జీవితప్రధాన సమస్య అయిన వివాహవిషయంలో సరయిన నిర్ణయం తీసుకోలేక నాకు తగని స్త్రీని జీవన సహచరిగా ఎన్నుకుని ... అందుకు ఫలితం ఇప్పుడనుభవిస్తున్నాను" అని ఆగి స్పందన మొహంలోకి ఏదో వెదుక్కుంటున్నవాడిలా చూస్తూ "ఎందుకో తెలీదు. చదువుకునే రోజుల్నుంచి వివాహం గురించి మరీ ఎక్కువగా

ఆలోచిస్తూ ఉండేవాడిని. కాబోయే భార్యను గురించి నేను ఆలోచించినంతగా మరెవ్వరూ ఆలోచించి ఉండరేమో!"

మౌనంగా చూసింది స్పందన.

గౌతమ్ మళ్ళీ అన్నాడు "పెళ్ళి అందరూ చేసుకోవచ్చు. అయితే అదృష్ట వంతులయిన కొందరికి మాత్రమే అనుకూలవతి అయిన భార్య లభిస్తుంది. నేను దురదృష్టవంతుడిని. అందుకే నీతి లేని స్త్రీ మెళ్ళో మూడుముళ్ళు వేసి ఈనాడు నా కంఠానికి ఉరితాడు తెచ్చుకున్నాను. ప్రియుడితో ప్రేమాయణం కొనసాగించడం కోసరమే నా జీవితంలోకి అడుగుపెట్టిందని చాలా ఆలస్యంగా తెలుసుకున్నాను...."

"గౌతమ్!" ఆరాటంగా అంది స్పందన.

"స్పందనా! సమాజంలో ఎంత కుటిలవర్తనులున్నారో తెలుసా? కడుపులో కుండెడు విషం దాచుకుని మాటల్లో తేనియ కురిపించే అలాంటివాళ్ళు సమాజానికి చీడపురుగుల్లాంటివారు. దురదృష్ట మేమిటంటే వాళ్ళు చేసే నేరాలు చట్టపరిధిలోకి రావు. అటువంటప్పుడు వాళ్ళను నాలాంటివాళ్ళు శిక్షించక తప్పదు. నీలాంటివాళ్ళేమో నిగ్రహం పాటించాలని హితోక్తులు చెప్తారు. వెయ్యేళ్ళు కఠిన తపస్సాచరించి జితేంద్రియుడని శ్లాఘింపబడే మునిపుంగవుడయినా తన భార్య మరొకడితో పడుకుంటుందని తెలిస్తే నిగ్రహం పాటిస్తూ మౌనంగా ఊరుకోడు. మరి నా గుండెలు ఎలా మండుతున్నాయో నీకర్థం కాదు. స్పందనా - మళ్ళీ చెప్తున్నాను. నేను వాళ్ళను హత్య చేసినందుకు ఏ క్షణమూ పశ్చాత్తాపంతో కుమిలిపోలేదు"

ఆగ్రహంతో జేవురించిన అతడి మొహం చూసి స్పందన భీతిచెందింది.

శాంతస్వరూపుడైన అతడిలో ఆగ్రహజ్వాలలు రగిలించి అతడిచేత చేయరాని నేరం చేయించి ఈనాటి ఈ స్థితికి కారకురాలయిన లావణ్య అంటే ద్వేషంతో స్పందన హృదయం భగ్గుమంది. మనిషి విలువ తెలిని అల్పురాలు. ఎన్ని జన్మలు తపస్సు చేస్తే గౌతమ్ లాంటి సజ్జనుడి సాహచర్య భాగ్యం లభిస్తుంది. ఆ అదృష్టం తనకు దక్కనందుకు అనుక్షణం నిరాశా నిస్పృహలతో కృంగిపోతున్నది. ఒకరిని ప్రేమిస్తూ మరొకరిని పెళ్ళి చేసుకోవడం అనుచితమని భావించి తను పెళ్ళే మానుకుంది. ఆ నీచురాలేమో మధురిమ వర్షించాల్సిన జీవితంలో విషం చిందించింది. అతడి పురుషాహంకారం మీద దెబ్బ కొట్టింది. కానీ ఆమెను శిక్షించినందుకు ఫలితం...

స్పందన మనఃచక్షువుల ముందు ఉరితాడుకి వేలాడుతూ గౌతమ్. కనిపించాడు. లోలోపలే కెవ్వుమంది.

గౌతమ్‌కి మరణశిక్ష పడిందని తెలిసినప్పటి నుండి ఆమెకు జీవితం నరకమయింది. తండ్రి పోరుకి ఏదో తిన్న శాస్త్రం చేస్తోంది. అయితే కంటి నిండుగా నిద్రపోయి ఎన్నాళ్ళో అయింది. కళ్ళు మూస్తే ఉరితాడుకి వేలాడుతూ గౌతమ్.

తల్లడిల్లిపోతూ లేచి కూర్చోవడం.

అహరహం అదే ఆలోచన మనస్సుని మెలిపెట్టేస్తుంటే క్లినిక్‌కి వెళ్ళడం బొత్తిగా మానేసింది. ఈ జన్మలో తనకెలాగూ సుఖశాంతులు లేవు. తన ప్రియతముడయినా సుఖంగా, సంతోషంగా జీవించాలని తను ఎంతగా అనుకుంది.

అతడి జీవితం ఇలా ఉరికంబం మీద అంతం అవుతుందని ఆమె కలలోనయినా అనుకోలేదు.

మ్లానవదనంతో వస్తున్న తండ్రిని చూసి కళ్లు తుడుచుకుంది.

నిరంజనరావుగారు గౌతమ్‌ని జాలిగా చూసారు.

గౌతమ్ ప్రశ్నార్థకంగా చూసాడు.

"గౌతమ్... ఒక బాడ్ న్యూస్" తగ్గు స్వరాన అన్నారు నిరంజనరావుగారు.

"ఏమిటండీ?"

గౌతమ్ కంఠంలో అంతులేని ఆదుర్దా.

"ఈరోజు పొద్దున్న మీ డాడీ గుండె పోట్టుతో పోయారు" చెప్పలేక చెప్పారు నిరంజనరావుగారు.

స్పందన ఆందోళనగా చూసింది.

"నా దిగులే డాడీని చంపేసింది" కన్నీళ్ళతో అన్నాడు గౌతమ్.

"గుండె నిబ్బరం చేసుకో" అనునయంగా అన్నారు నిరంజనరావు గారు.

గౌతమ్ మాట్లాడలేదు.

అతడి కళ్ళల్లో కన్నీళ్ళులేవు. కానీ గుండె ఘోసన ఏడుస్తోంది. తనను ఉరి కంబం నుండి తప్పించాలని చేస్తున్న ప్రయత్నంలో శారీరకంగా, మానసికంగా ఎంతగానో నలిగిపోయారు డాడీ. మొన్న తనను చూడవచ్చినప్పుడు డాడీని చూసి అప్రతిభుడయ్యాడు. అంత నీరసంగా, బడలికగా ఆయన్ని ఎప్పుడూ చూడ లేదు. తనమూలంగా ఆయన గుండెకయిన గాయాన్ని కాలమనే ఓషధి మాన్పు తుందని ఆశించాడే తప్ప ఇంత త్వరగా ఆయన మృత్యువు వాత పడ్తారని అనుకో లేదు.

"డాడీని ఆఖరి చూపులు చూసే అదృష్టం నాకుంటుందా?" సందిగ్ధంగా అడిగాడు.

సానుభూతిగా చూసారు నిరంజనరావుగారు. "నీకు తెలీందేముంది? మరణశిక్షపొందినఖైదీని ఎటువంటి పరిస్థితిలోనూ జైలు బయటికి వెళ్ళేందుకు జైలు రూల్స్ అనుమతించవు"

"దురదృష్టం నన్నెంత తీవ్రంగా కాటేసిందో ఈ క్షణమే నాకర్థమవుతున్నది" వ్యథగా అన్నాడు గౌతమ్.

"సారీ మై యంగ్ ఫ్రెండ్. నీకెటు వంటిసహాయంచేయలేని నిస్సహాయుడిని" నెమ్మదిగా అన్నారు నిరంజనరావుగారు.

హఠాత్తుగా నిలబడే శక్తిని కోల్పోయి నట్లు ఉన్నచోటనే కూలబడిపోయి మోకాళ్ల మీద తలవాల్చాడు గౌతమ్.

నిరంజనరావుగారు నిట్టూర్చి, "పద, వెళ్దాం" అన్నారు కూతురునుద్దేశించి.

* * *

తలనొప్పి,ఒళ్ళునొప్పులతో పొద్దున్నే మామూలుగా లేవలేకపోయాడు గౌతమ్. మూలుగుతూ అలాగే పడుకున్నాడు. అతడి మూలుగులు విన్న సెంట్రీ సందేహంగా తాళం తీసి లోపలికి వచ్చి చూసాడు. జ్వరంతో గౌతమ్ ఒళ్ళు కాలి పోతోంది. ఒంటిమీద స్పృహ లేదు. వెంటనే జైలరుకి తెలియజేశాడు. జైలరు డాక్టరుకి కబురు పంపి సరాసరి గౌతమ్ దగ్గరికి వచ్చాడు.

మరణశిక్ష పొందిన ఖైదీని జైల్లో చాలా పదిలంగా చూసుకుంటారు. ఒళ్ళు కాస్త వెచ్చబడినా ఆఘమేఘాల మీద పరిగెత్తుకువచ్చి చూస్తాడు జైలు డాక్టరు. అవసరమయితే ఆపరేషన్ చేసి మరీ ప్రాణాలు కాపాడతారు. ఉరిశిక్ష పొందిన ఖైదీ ఉరితియ్యబడటంద్వారా చావ

వలసిందే తప్ప మరోలా చనిపోయేందుకు వీల్లేదు.

గౌతమ్ ప్రతిభావంతుడయిన సర్జన్ అని జైలు డాక్టరుకి తెలుసు. అందుకే మరణశిక్ష పొందిన ఖైదీ అయినప్పటికీ అతడంటే గౌరవభావం. ప్రత్యేకంగా పరీక్ష చేసి జైలరువైపు చూసి "టెంపరేచర్ నూటరెండు ఉంది. మందు సక్రమంగా వేసుకుంటే రాత్రికే తగ్గిపోవచ్చు. ఈరోజు ఆహారం వద్దు. పాలు, బ్రెడ్ ఇవ్వండి" అని చెప్పి వెళ్ళిపోయాడు.

అపుడే డ్యూటీకి వచ్చిన నిరంజన



రావుగారు సంగతి తెలిసి గౌతమ్‌ని చూడ వచ్చారు.

మగతగా పడుకుని ఉన్న గౌతమ్‌ని తదేకంగా చూసారు.

పెరిగిపోయిన గడ్డం, తైలసంస్కారం లేని వెంట్రుకలు, జైలు యూనిఫామ్...

ఆయన అంతర్నేత్రాలముందు తెల్లగా మెరిసిపోతున్న షార్ట్స్, టీ షర్టుల్లో చురుగ్గా, ఉత్సాహంగా, మెరుపులా టెన్నిస్ ఆడే గౌతమ్ సాక్షాత్కరించి దీర్ఘంగా నిట్టూర్చారు. ఉన్నత శిఖరాగ్రాన ఉన్న జీవితం ఎంత అనూహ్యంగా అధఃపాతాళంలో పడిపోయింది. అందుకే కాబోలు మగాడి జీవితాన్నే మార్చివేసే శక్తి స్త్రీకి ఉందంటారు.

ఎంత నిజం?

కామంతో కళ్ళు మూసుకుపోయి కట్టుకున్న మొగుడినే వంచించిన ఒక స్త్రీ కారణంగా ప్రతిభావంతుడయిన ఒక సర్జన్ జీవితం ఉరికంబం మీద అంతం కాబోతోంది.

అతడి జీవితం అలా ఉరికంబం మీద అంతమయ్యేలా చూడాల్సిన బాధ్యత తన భుజస్కంధాలమీదే ఉందన్న సంగతి గుర్తొచ్చి మరోసారి ఆయన అణువణువు వ్యథతో నిండిపోయింది. ఎప్పుడూ లేనిది గౌతమ్ జైల్లోకి వచ్చాకే తను ఈ వృత్తిని ఎన్నుకున్నందుకు తొలిసారిగా బాధ పడ్డారాయన. ఎందరో ఖైదీల ఉరిశిక్షను నిర్లిప్తంగా, నిర్వికారంగా నెరవేర్చిన తను ఇప్పుడు గౌతమ్‌ని ఉరికంబం ఎక్కించాలన్న ఆలోచననే భరించలేకపోతున్నాడు. ఆ ఊహే మనస్సుని శాంతికి దూరం చేస్తుంది.

"వాడీ!"

గౌతమ్ పలవరించాడు.

అతడి వంకు ఆర్ద్రంగా చూసాడు నిరంజనరావుగారు.

అతడి జ్వరానికి కారణం ఆయనకు తెలిసింది.

తండ్రి అంత్యక్రియలకు హాజరు కాలేని కొడుకు మానసిక స్థితి ఎలాగుంటుందో ఆయన ఊహించగలరు. అతడికి సాయం చేయాలని ఉన్నా చేయలేని నిస్సహాయ స్థితి తనది. జైలు రూల్సు తన చేతుల్ని బంధించాయి.

నుదుటిమీద చెయ్యి ఉంచి, "గౌతమ్" పిలిచారు దయగా.

కళ్ళు తెరచి చూసాడు గౌతమ్.

జ్వరంతో ఎర్రబడి జపాకుసుమాల్లాగున్నవి అతడి కళ్ళు.

"కొద్దిగా టీ తాగు" ఆపేక్షగా అన్నారు నిరంజనరావుగారు.

"వద్దండీ" నీరసంగా అన్నాడు గౌతమ్.

"కొద్దిగా తాగు నాయనా. లేకుంటే మరింతగా నీరసించిపోతావు" మృదువుగా అన్నారు.

గౌతమ్ లేచి కూర్చుని నెమ్మదిగా టీ తాగాడు.

కొద్దిగా ఉత్సాహం వచ్చినట్లనిపించింది. గోడకానుకుని కూర్చుని, "థాంక్యూ సర్!" అన్నాడు కృతజ్ఞతగా.

నిరంజనరావుగారి దృష్టి ఒక మూల ఉన్న మలమూత్రాల పాత్ర మీద నిలిచింది. నిండిపోయి దుర్వాసన వెలువరిస్తున్నది.

కడుపులో తిప్పినట్లయింది.

అడుగడుగున శుచి శుభ్రతలు పాటించే వ్యక్తికి ఎటువంటి దుస్థితి సంప్రాప్తించింది. నిజంగా మానవుడు విధి చేతిలో కీలుబొమ్మేనా?

స్కావెంజర్ని పిలిచి పాత్ర శుభ్రం చేసి తీసుకురమ్మని పురమాయించారు.

మధ్యాహ్నం బ్రెడ్డు, పాలు తెప్పించి గౌతమ్ తినేదాకా ఉండి తర్వాత ఇంటికి వెళ్ళారు. భోజనాల సమయంలో గౌతమ్ జ్వరం సంగతి కూతురికి చెప్పారు.

విని తల్లడిల్లిపోయింది స్పందన.

"ఏమిటో, అతడు గుర్తొస్తేనే మనస్సు భారమవుతుంది. అతడితో ఎలాంటి సంబంధంలేని మనకే ఇంత వ్యధగా ఉంది. అతడి తల్లిదండ్రులకు, తోబుట్టువులకు ఇంకెంత వేదనగా ఉండాలి? పాపం... అతడి డాడీ కొడుకుని ఉరి కంబంనుండి తప్పించేందుకు ఎంతో ప్రయత్నించారు. ప్చ్... ఆయన ప్రయత్నాలు ఫలించలేదు. గౌతమ్ అన్నట్లు ఆ దిగులే ఆయన్ని బలి తీసుకుందేమో!" బాధాతప్త స్వరంతో అన్నారు.

స్పందన మాట్లాడలేదు.

కాసేపు తర్వాత, "డాడీ" అంది.

"ఏమిటమ్మా?"

"గౌతమ్కి ఆపిల్స్, బ్రెడ్డు ఇచ్చేందుకు నాకనుమతి లభిస్తుందా?"

కూతురు కళ్ళలోకి లోతుగా చూసారు నిరంజనరావుగారు.

"మాట్లాడరేం డాడీ?" రెట్టించింది స్పందన.

"బేబీ ... నేనొకమాట అడగనా?"

విస్మయంగా చూసింది స్పందన.

"గౌతమ్ అంటె నీకున్నది కేవలం స్నేహభావమేనా?" సూటిగా అడిగారు నిరంజనరావుగారు.

"డాడీ!"

"యూఆర్ ఇన్ లవ్ విత్ హిమ్..."

చప్పున లేచి వెళ్ళిపోయింది స్పందన.

ఆమె వెళ్తున్నవైపే చూసి దీర్ఘంగా నిట్టూర్చారు నిరంజనరావుగారు. కూతురు మనస్సు ఆయనకిప్పుడే లీలగా అర్థమవుతున్నది.

ఎంత సెంట్రల్ జైల్ సూపర్నెంట్ కూతురయినప్పటికీ ఉరిశిక్ష పొందిన ఖైదీని ప్రతిరోజూ కలసి మాట్లాడటం సాధ్యంగాదు. విజిటింగ్ డేస్లో మాత్రమే అనుమతిస్తారు. అయితే స్పందన మేనమామ హోమ్మినిస్టర్. చెల్లెలి ప్రతిరూపమయిన స్పందన అంటే వల్లమాలిన అభిమానం ఆయనకి. అందుకేకాళ్ళుపట్టుకు బతిమాలే ముద్దుల మేనకోడలి కోరిక కాదనలేక స్పందన ప్రతిరోజూ గౌతమ్ని విజిట్ చేసేందుకు ప్రత్యేక అనుమతినిచ్చారు. జైలు చరిత్రలోనే అపురూపమయిన విషయమది. అందుకే జైల్లో అందరూ గుసగుసలు పోతున్నారు....

ఆలోచిస్తున్న నిరంజనరావుగారి గుండెల్లో సన్నగా బాధ బయలుదేరింది.

పురిటి మంచంమీదే భార్యపోయింది. రెండోపెళ్ళి చేసుకుంటే ఆమె కూతుర్ని సరిగా చూసుకోదేమోనన్న భయంతో పెళ్ళిమాటే తలపెట్టక ఆయా సాయంతో సాకాడు. అల్లారుముద్దుగా పెంచాడు. కంటిపాపలా చూసుకున్నాడు. తన ఆశలు, ఆశయాలు, కోరికలు సమస్తం కూతురు చుట్టూ అల్లునికి ఆమే సర్వస్వంగా జీవిస్తున్నాడు. ఆమె సుఖసంతోషాలే జీవిత ధ్యేయంగా బతుకుతున్నాడు. అయితే చదువు పూర్తిచేసుకుని వచ్చిన స్పందన తన సంతోషాన్ని, ఉత్సాహాన్ని అక్కడే వదిలి వచ్చేసిందేమోనన్న అనుమానం ఆయన్ని పట్టి పీడించసాగింది. పైకి మామూలుగా ఎప్పట్లాగే నవ్వుతూ, తుళ్ళుతూ ఉంది. కాని ఆమె నవ్వులో జీవంలేదు. ఎప్పట్లాగే

గలగల మాట్లాడుతుంది. అయితే మాటల్లో ఏదో వెలితి. జీవితాన్ని పూర్తిగా వృత్తికే అంకితం చేసినట్లు ఇరవయి నాలుగ్గంటలూ హాస్పిటలే ధ్యాసగా ఉంటుంది. వైద్య వృత్తిని చేపట్టినవాళ్ళకు అది సహజమే అయినప్పటికీ స్పందన ఏదో వేదన మరచిపోయేందుకే జీవితాన్ని అలా రోగులసేవకే అంకితంచేసి ఏ సరదా సంతోషంలేక విరాగినిలా ఉన్నదని ఆయన పితృహృదయం శంకించింది. మేనల్లుడితో పెళ్ళి తిరస్కరించినప్పుడు ఆయన అనుమానం బలపడింది. తనతో బాటు బంధువులందరూ నచ్చజెప్పినా వినలేదు. పైగా మరోసారి పెళ్ళిమాట ఎత్తితే ఏదో ఆశ్రమంలో చేరిపోతానని బెదిరించింది. కూతురు కళ్ళముందుంటే చాలునని గుండె దిటవుపరచుకుని ఊరు కున్నారు. అయితే ఒక్కగానొక్క కూతురు పెళ్ళిమాటే తలపెట్టక ఇలా అడవిలో మోడులా ఒంటరిగా ఉండి పోవడం ఆయన మనస్సుని దొలుస్తూనే ఉంది. ఇప్పుడు గౌతమ్ మరణశిక్షపొంది ఇక్కడికి వచ్చాక కూతురు నిశ్శబ్దంగా అనుభవిస్తున్న క్షోభ గమనించాక ఆమె మనస్సేమిటో చూచాయగా ఆయనకు అర్థమయింది. కూతురు గురించి ఆయన దిగులు రెట్టింపయింది. తను అనుమానిస్తు న్నట్లు స్పందన మనస్సులో ఉన్నది గౌతమే!

అయితే గౌతమ్ ఉరిశిక్ష అనుభ వించకతప్పదు. అదే నిజమయితే స్పందన భవిష్యత్తు ఏమవుతుంది? ఆమె జీవితంలో చోటుచేసుకున్న విషాదం శాశ్వతంగా ఉండిపోతుందా?

ఆయన పితృహృదయం తల్లడిల్లింది.



ఏ దేవత కరుణావీక్షణాలో గౌతమ్ మీదికి ప్రసరించి సుప్రీంకోర్టు జడ్జీల మనస్సుకరిగి గౌతమ్ ఉరిశిక్షను యావ జ్జీవ ఖైదుకింద తగ్గిస్తే దేశంలో ఉన్న అన్ని దేవాలయాలు సందర్శించి మొక్కు బడి చెల్లించుకుంటానని ప్రార్థించు కున్నారాయన!

ఎంత విచిత్ర పరిస్థితి!

ఒక వ్యక్తికి ఓ ఏడాది జైలుశిక్ష పడితేనే అతడి ఆత్మీయుల హృదయాలు క్షోభిల్లుతాయి. అటువంటిది యావజ్జీవ ఖైదయితే దేశంలో అన్ని దేవాలయాలు సందర్శించి మొక్కుబడి చెల్లించుకుంటానని నిరంజనరావుగారి లాంటి అనుభవజ్ఞుడు మొక్కుకోవడం...

తక్కిన సమయాల్లో దారుణమనిపించే శిక్ష మరో సమయంలో అభిలషణీయ మవుతుందేమో!

స్పందన ఫోన్లో ఎవరితోనో మాట్లా డటం వినిపించి అటు వెళ్లారు.

ఫోను క్రెడిల్ చేసి, "స్వప్నగారు!" అంది స్పందన తండ్రిని చూసి.

నిరంజనరావుగారు సాభిప్రాయంగా చూసారు.

"గౌతమ్‌గారికోసం ఇప్పటిదాకా ఎదురుచూసి ఇందాకే శవదహనం చేసార్ట" ఆ మాటలంటుండగా ఆమెకంట్లో నీరు సుళ్లు తిరిగింది.

"ప్చ్...ఏ దేవత ఆగ్రహించిందో ఆ కుటుంబంమీద కష్టాలు విరుచుకు పడు తున్నాయి. వీలుచూసుకుని ఓసారి వెళ్ళి వాళ్ళ అమ్మగారిని పరామర్శించి రావాలి" సానుభూతిగాఅన్నారు నిరంజనరావుగారు.

తనూ వస్తాననలేదు స్పందన.

ఒక్కరోజు గౌతమ్‌ని చూడకున్నా నిలువలేని స్థితి ఆమెది. అందుకే ఎక్కడికీ వెళ్లదు.

"స్వప్న ఈ వారం వస్తుందా?" అడి గారు నిరంజనరావుగారు.

"ఏమో, ఆ విషయం గురించి ఏమీ చెప్పలేదు" పరధ్యాన్నంగా అంది స్పందన.

ఎవరొచ్చినా రాకపోయినా స్వప్న రెగ్యులర్ గా అన్నగారిని విజిట్ చేస్తుంది.

అన్నగారిని అపరిమితంగా అభిమా నించే ఆ చెల్లెలికి, ఆ అన్నగార్నే ఆరాధ్య దైవంగా ఆరాధించే స్పందనకు సహజంగా స్నేహంకలిసింది. సృష్టిలో తీయనైనది స్నేహమేనంటారు. అయితే వాళ్ల స్నేహంలో మ ధు రి మ లే దు. మనస్సుని పిండిచేసే విషాదమే ఉంది.

తండ్రి వెళ్లిపోయాక తన గదిలో పడు కుంది స్పందన.

ఆమె చేతిలో గౌతమ్ ఫొటో.

ఫొటోలో చిరునవ్వులు చిందిస్తున్న గౌతమ్‌ని తదేకంగా చూస్తూ ఆలోచిస్తూ సాయంత్రందాకా గడిపింది.

సాయంత్రం సరిగ్గా నాలుగ్గంటలకు గౌతమ్ ఉన్న సెల్ ముందు నిలిచింది. ఆమెతో బాటు జైలర్.

గౌతమ్ పడుకుని ఉన్నాడు.

జైలర్ చెప్పగా సెంట్రీ తాళంతీసాడు.

జైలర్ లోనకు వెళ్లి పడుకునిఉన్న గౌతమ్ చేతులకు బేడీలు వేసాడు.

"హేండ్‌కఫ్స్ వేసారెందుకు?" కోపం, ఆవేదన సమ్మిళితమయిన కంఠంతో అడి గింది స్పందన.

స్పందన ప్రశ్నకు గౌతమ్ జవా బిచ్చాడు.

"నీకు తెలీదా? హంతకుడుగా ముద్ర వేయబడ్డ వ్యక్తి బతికున్నంతకాలం ప్రమాదకరమయిన వ్యక్తిగానే పరిగ ణింపబడతాడు. అతడి మూలంగా సంఘంలో తక్కిన వాళ్ల ప్రాణాలకు ఆపద రాకుండా అతడికి మరణశిక్ష విధి సారు. మరణశిక్ష అమలుపరచేదాకా సమాజానికి దూరంగా ఇదిగో... ఈ డెత్ సెల్లులో బంధించి ఉంచుతారు. రాతి గోడలు ఛేదించుకుని పారిపోకుండా ఇరవయి నాలుగ్గంటలూ అప్రమత్తతగా కాపలాకాస్తారు. కొన్ని కొన్ని పరిస్థితుల్లో ఇదిగో ఇలా శృంఖలాబద్ధుడిని చేస్తారు"

అని జైలర్ వయిపు చూసాడు. "ఉరి తీసేటప్పుడు కూడా హేండ్‌కఫ్స్‌వేస్తారు కదూ. ఎందుకు? ఉరితాడుని తెంచేసు కుని నేరస్థుడు పారిపోతాడని భయమా?" గౌతమ్ కంఠంలో వ్యంగ్యం.

జైలరు ఒకసారి అతడి వంక చూసి మౌనంగా వెళ్ళి తలుపువద్ద స్టూలుమీద కూర్చున్నాడు.

స్పందన గౌతమ్ నుదుటిమీద చెయ్యి ఉంచింది.

"ఇప్పుడు టెంపరేచర్ లేదు" నెమ్మ దిగా అన్నాడు గౌతమ్.

"మధ్యాహ్నం భోంచేసారా?"

"ఆఁ... పాలు, బ్రెడ్డు తీసుకున్నాను"

"ఇప్పుడొక ఆపిల్ తీసుకోండి...ప్లీజ్"

కాదనకుండా గౌతమ్ ఒక ఆపిల్ తీసుకుని అలాగే కొరికితింటూ "ఆపిల్ తిని ఎన్నాళ్ళయిందో తెలుసా?" అన్నాడు.

స్పందన కళ్లల్లో నీళ్ళు చిప్పిల్లాయి. కళ్ళు తుడుచుకుని జైలరుకి, సెంట్రీకి చెరొక పండు ఇచ్చింది.

"ఒక్కపూట జ్వరానికే ఇంతగా నీరసించిపోయారేమిటి?"

అలసటగా, బడలికగా ఉన్న గౌతమ్‌ని చూస్తూ ఆర్ద్రంగా అంది స్పందన.

చేతులకు ఉన్న హేండ్‌కఫ్స్‌ని తదే కంగా చూస్తూ మౌనంగా ఉండిపోయాడు గౌతమ్. హృదయం నుండి ఉబుకుతూ

మిగిలిన ... 85

వచ్చిన దుఃఖాన్ని లోపలే అదిమిపట్టి-
"ఇందాక స్వప్న గారు ఫోనుచేసారు" అంది స్పందన.

చివ్వున తలెత్తి చూసాడు. "ఏం మాట్లాడింది?"

కంట్లో నీళ్ళు అతడు చూడకుండా తల వంచుకుంది స్పందన.

"మీకోసం ఎదురు చూసి చూసి ఇందాకే శవ దహనం చేసార్ట"

హృదయంలాగే మండుతున్న కళ్ళను మూసుకుని నిశ్శబ్దంగా ఉండిపోయాడు గౌతమ్.

అతడు పలకరిస్తాడేమోనని చాలా సేపు ఎదురుచూసింది స్పందన.

క్షణాలు, నిమిషాలు గడిచిపోతున్నవి.

గౌతమ్ కళ్ళు తెరవనేలేదు.

అతడిని పలకరించే ధైర్యంలేక భారమయిన మనస్సుతో వెళ్ళిపోయింది స్పందన.




ఆరోజు గౌతమ్‌ని చూసేందుకు వచ్చింది మాధవి. ఆమె చేతిలో నెలలబిడ్డ.

కోర్టులో తీర్పు చెప్పిన రోజు చూట్టమే ఆమెను. మళ్ళీ ఇప్పుడే చూస్తున్నాడు.

చేతిలో బిడ్డతో నిలిచిఉన్న మాధవి ఫలపుష్పాలతో నిండుగా కళకళ్ళాడుతున్న పచ్చని చెట్టులా ఉంది. అక్కడి వాతావరణంలో ఆమె రాక పూలజల్లులాగే ఉంది.

"కొడుక్కి ఏం పేరు పెట్టావు?"

ఎర్రగా బొద్దుగా రబ్బరు బొమ్మలాగున్న మాధవి కొడుకు పాలబుగ్గలు స్పృశిస్తూ అడిగాడు గౌతమ్. అతడు జైలుకు వచ్చాక అపుడే మొదటిసారిగా చూస్తున్నదేమో ... అతడి మొహంలో దట్టంగా పరచుకున్న నీలినీడలు, కళ్ళల్లో గూడుకట్టుకున్న విషాదం, ముఖ్యంగా అతడి జైలు యూనిఫామ్...మొదటిసారిగా ఆ బ్లాకులోకి అడుగుపెట్టినవారి ఎదలో ఉత్పన్నమయ్యే భీతితో మాధవి మనస్సు వికలమయింది.

ఎలాంటి వ్యక్తికి ఎటువంటి దుస్థితి!

"నీ పేరే పెట్టాను" మెల్లగా అంది.

"అంటే, నేను ఉరిశిక్ష అనుభవించక తప్పదని మీ కందరికీ నమ్మకం ఏర్పడిందన్నమాట" నవ్వుతూనే అన్నప్పటికీ గౌతమ్ మాటల్లో ఏదో కసి, మరేదో వ్యధ అంతర్లీనమయి ధ్వనించింది.

గుండెల్లో వాడి బాకు దిగేసినట్లు గిలగిల్లాడిపోతూ చూసింది మాధవి.

"బావా" అంది వ్యధగా.

గౌతమ్ ఆమె వంక పరిశీలనగా చూసాడు.

మొహంలో శోకం, కళ్ళల్లో సుళ్ళు తిరుగుతున్న నీళ్ళు, పెదిమల్లో కంపనం..

"ఉన్నమాట చెబితే ఎందుకలా బాధ పడతావు? నాలాంటి క్రూర హంతకుడిని ఈ లోకంనుండి సాగనంపాలనేగా సెషన్స్ కోర్టు నాకు మరణశిక్ష విధించింది. ఆ శిక్షను హైకోర్టు కన్‌ఫమ్ చేసింది. సుప్రీంకోర్టు నన్ను దయతలచాలని నేను ఎదురుచూట్టం లేదు. నిజం చెప్పాలంటే బతకాలన్న కోరికే చచ్చి

పోయింది. ఎంతత్వరగా ఉరిశిక్ష అమలు జరిపితే నేసంత అదృష్టవంతుడిని"

"బావా ! నువ్విలాగే మాట్లాడుతూ ఉంటే నేను వెళ్ళిపోతాను" ఏడుస్తూ అంది మాధవి.

"మరో నాలుగయిదు నెలల్లో నేనే మిమ్మల్నందర్నీ వదిలి శాశ్వతంగా వెళ్ళి పోతున్నాను..."

అంతలో స్పందన వచ్చింది.

ఏడుస్తున్న మాధవిని చూసి గౌతమ్ వయిపు ప్రశ్నార్థకంగా చూసింది.

ఇద్దరికీ పరిచయం చేసాడు గౌతమ్.

కళ్ళు తుడుచుకుని స్పందన వయిపు ఆసక్తిగా చూసింది.

"మీ గూర్చి స్వప్న చెప్పింది"

"ఏం చెప్పారు?" అనాసక్తిగా అడిగింది స్పందన.

"మృత్యువు నీడలో నిలిచి ఉన్న ఒకడికి తోడునీడగా ఉందని చెప్పారేమో" అన్నాడు గౌతమ్.

మాధవికి మళ్ళీ దుఃఖం కట్టలు తెంచుకుంది.

"ఎందుకు బావా .... అనుక్షణం మృత్యువును గుర్తుచేసుకుంటావు?"

"చేసిన తప్పిదాన్ని తలచుకుంటూ అహరహం పశ్చాత్తాపంతో కుమిలిపోతూ కంఠాన్ని కావలించుకోబోయే ఉరితాడుని అనుక్షణం గుర్తుచేసుకోవాలనేగా ఈ డెత్ సెల్లులో బంధించి ఉంచారు" అని మాధవి కేసి చూసాడు గౌతమ్. "ఉరిశిక్ష పొందిన నేను నీ బంధువునని చెప్పుకుంటే మీ వాళ్ళమధ్య నీకు తలవంపులుగా ఉంటుందేమో!"

మాధవి ఏడుస్తూ ఏదో చెప్పబోయింది. అంతలో ఆమె భర్త సారధివచ్చాడు.

"హల్లో....హౌ ఆర్ యూ?" ఉత్సాహంగా పలకరించాడు గౌతమ్.

సారధి కళ్ళల్లో బాధ రెపరెపలాడింది.

"ఫైన్... థాంక్యూ" మృదువుగా అన్నాడు.

అతడికి స్పందనను పరిచయంచేసాడు గౌతమ్.

"హల్లో!"

"హల్లో!"

కాని, మర్యాదకోసమయినా సారధి వయిపు చూడలేదు స్పందన. ఆమె చూపులు గౌతమ్ మీదనే స్థిరంగా నిలిచి ఉన్నవి.

"ఇక్కడ ఇలా ఏడ్చి గొడవ చేయకూడదని నేను ముందే చేసిన హెచ్చరిక మరచిపోయావా?" అని భార్యను సున్నితంగా మందలించి గౌతమ్ కేసి చూసాడు సారధి "మీ మరదలికి పిలిస్తే పలుకుతుందండి ఏడుపు"

"ఆడవాళ్ళంతేలెండి" స్పందనవంక చూస్తూ అన్నాడు గౌతమ్.

మరికాసేపుండి వెళ్ళిపోయారు మాధవి, సారధి.

"నా మూలంగా మా కుటుంబానికి తీరని కళంకం ఏర్పడింది" దిగులుగా అన్నాడు గౌతమ్.

మౌనంగా చూసింది స్పందన.

అసలు ఏం మాట్లాడాలో తోచలేదామెకు.

"స్వప్నను కాల్చుకు తింటున్నార్ట!" వ్యథగా అన్నాడు గౌతమ్.

"ఎవరు?"

"ఇంకెవరు-వాళ్ళ అత్తగారు, ఆడపడుచులు"

ఆశ్చర్య విస్ఫారిత నేత్రాలతో చూసింది స్పందన. "ఎందుకు?"

"అన్నగారు హంతకుడయితే ఆడ

బిడ్డకి అత్తగారింట్లో ఎదురయ్యే తిట్లు, శాపనార్థాలు, దెప్పుళ్ళే"

"ఎందుకు...తనేం పాపంచేసింది?" అమాయకంగా అంది స్పందన.

"హంతకుడయిన అన్నగారి రక్తం పంచుకు పుట్టడంకన్న మించిన పాపం మరొకటుందా?"

స్పందన మాట్లాడలేదు.

గౌతమ్ మళ్ళీ అన్నాడు-"ఒక వ్యక్తి చేసిన తప్పొప్పులు, పాపపుణ్యాలు కేవలం ఆ వ్యక్తికి మాత్రమే సంబంధించినవి. ఒక వ్యక్తి హంతకుడయినంతమాత్రాన అతడు పుట్టిన వంశానికే అపఖ్యాతి రావడం ఏం న్యాయం? ప్చ్... మనవాళ్ళ సంస్కారం, నమ్మకాలు, చాదస్తాలు అర్థంచేసుకోవాలంటే మరో పది జన్మలు ఎత్తాలేమో!"

కాసేపు తర్వాత స్పందన అంది- "డాడీ నిన్న మీ ఊరు వెళ్ళి మీ అమ్మ గారిని పరామర్శించి వచ్చారు"

"నిజం?" సంభ్రమంగా అడిగాడు గౌతమ్. అంతలోనే అతడి మొహంలో బాధా ఛాయలు.

"అమ్మను గురించి గొప్పలు చెబు తున్నాననుకుంటావేమో. అమ్మ మనసు ఎంత చల్లనిదో అంత స్వచ్ఛమయింది. గుమ్మం ఎక్కిన ప్రతి ఒకరిని కన్న తల్లిలా అభిమానించి ఆదరించడమే ఆమెకు తెలుసు. భర్తకోసం,పిల్లలకోసం, కుటుంబంకోసం జీవితాన్ని కొవ్వొత్తిలా కరిగించుకున్న మహాసాధ్వి. ఆ మాతృ దేవతకు నా మూలంగా వైధవ్యం సంప్రా ప్తించింది. నవమాసాలు మోసి కని స్తన్యమిచ్చి లాలించి పెద్ద చేసిన తల్లి ఋణం ఎంత చక్కగా తీర్చుకున్నానో చూసావా? విశేషమేమిటంటే డాడీలాగే అమ్మకూ తక్కిన అందరు బిడ్డల్లోకి నేనంటేనే మమకారం ఎక్కువ. అందుకే నేమో తండ్రి చావుకి కారకుడినై తల్లి గుండెల్లో ఆరని చిచ్చు రగిలించాను. నాలాంటి కొడుకు మరొకడు చరిత్రలో ఉంటాడా?"

అతడి కంఠంలో ధ్వనించిన దుఃఖో ద్విగ్నత గుర్తించి స్పందన విచలిత అయింది.

"గౌతమ్...." ఆరాటంగా అంది "మీ డాడీ మీ కారణంగా చనిపోయారని ఎందుకనుకోవాలి? పెద్దవారు. ఆయుష్షు తీరిపోయారు. మీరనవసరంగా ఏదేదో ఊహించుకుంటూ మనస్సు మరింత పాడు చేసుకుంటున్నారు"

"నీకు తెలీదు స్పందనా!కొన్ని కొన్ని పరిస్థితులు ఎన్నో ఏళ్లతర్వాత వచ్చేంచే మృత్యువుని క్షణాల్లో గుమ్మంలోకి తెప్పించగలవు" అని దీర్ఘంగా నిట్టూ ర్చాడు గౌతమ్.

"మొదటి తరగతినుంచి మెడిసిన్ ఫైనలియర్‌దాకా నేను ఫస్ట్ రాంక్ స్టూడెంటుని. అది నాకన్న డాడీకే ఎక్కువ గర్వకారణం. టెన్నిస్‌లో మావాడిని ఓడించే ఆటగాడు రాష్ట్రంలోనే లేడని గొప్పలు చెప్పుకునేవారు. సహ జంగా నామీద ఎన్నెన్నో ఆశలు పెంచు కున్నారు. అలా నా మూలంగా ఆయన సగర్వంగా తలెత్తుకు తిరిగే పరిస్థితిని కల్పించిన నేను భార్యను క్రూరంగా హత్య చేసి నలుగుర్లో ఆయన తలెత్తలేని పరిస్థితి కలిగించాను. అసలే పరువు ప్రతిష్టలకు ప్రాణాలిచ్చే మనిషి. నలుగురూ నా గురించి నాలుగు విధాలుగా అనుకోవడం విన్నప్పుడే ఆయన ప్రాణాలు సగంపోయి ఉండాలి. చేసిన

తప్పు చాలక దాదాపు మూడేళ్ళ అజ్ఞాతంలో ఉండి మరింత క్షోభ పెట్టాను. ఆతర్వాత చట్టం చేతిలో బందీనయాక నన్ను విడిపించేందుకు ఎంత శ్రమపడ్డారో చెప్పలేను. నిస్సందేహంగా నా గురించిన మానసిక సంఘర్షణే డాడీని బలి తీసుకుంది. భార్యను చంపి నేను నేరం చేసానని కలలోనయినా అనుకోవటంలేదు. కానీ నా మూలంగా, నేను చేసిన పని మూలంగా నా వాళ్ళకు నేను కలిగించిన కలిగిస్తున్న క్షోభ...ఉహూ(...నన్ను నేను క్షమించుకోలేకబోతున్నాను."

దుఃఖోద్వేగంతో తల్లడిల్లుతున్న అతడిని అనునయించడం ఎలాగో తెలీక



నిస్సహాయంగా చూస్తూ నుంచుంది స్పందన.

అతడి దుఃఖం చూస్తున్న కొద్దీ ఆమె మనస్సులోనూ దుఃఖం సుళ్లు తిరుగుతోంది. సుఖదుఃఖాలు రాత్రింబవళ్లు లాంటివి. చీకటి వెనక వెలుగు, రాత్రి వెనక పగలు ఉన్నట్లే దుఃఖాన్ననుసరించి సుఖసంతోషాలూ ఉంటాయంటారు. కానీ గౌతమ్ విషయంలో దుఃఖమే శాశ్వతమయింది. అతడి జీవితంలో ఇక వెలుగు కిరణం ప్రసరించే అవకాశమేలేదు. ముందున్నదంతా కాటుక చీకటే. కనిపిస్తున్నదంతా అంధకారమే. అతడి కోసరం కాచుకుని ఉన్నది మృత్యువే!

అతడిని ప్రేమించే తనకు మిగిలిందీ నిరాశానిస్పృహలే!!

ఒకందుకు ఆమె వ్యధితహృదయం కొద్దిగా ఉపశమించింది.

ఇందాక మా ధ వి తో గౌతమ్ మాట్లాడిన తీరు గమనించింది స్పందన.

ఎందుకోమరి ఆమెను మాటలతో హింసించడమే తన ధ్యేయమన్న ధోరణిలో మాట్లాడేదు.

స్వప్న, తదితర కుటుంబసభ్యులు వచ్చినప్పుడు సైతం అతడి ప్రవర్తన అదోలాగుంటుంది. వాళ్లున్నంతసేపు మౌనిలాగా మూగగా ఉండిపోతాడు.

అలాంటిది ఒక్క తనతోనే మనస్సు విప్పి మాట్లాడుతాడనుకుంటే ఆమె మనస్సుకెంతో చల్లగా, హాయిగా ఉంటుంది.

"ఈ వారం సుప్రీంకోర్టు తీర్పేమిటో తెలిసిపోతుందనుకుంటాను" ఏదో ఆలోచిస్తూ అన్నాడు గౌతమ్.

అతడిని చూసిన స్పందన కళ్ళల్లో భయం చోటుచేసుకుంది.

"నాకు తెలుసు. సుప్రీంకోర్టులో కూడా నా అప్పీలు తోసిపుచ్చి మరణశిక్ష కన్‌ఫర్మ్ చేస్తారు. అందుకే అసలు సుప్రీంకోర్టుకి వెళ్ళొద్దన్నాను. డాడీ వినిపించుకుంటేగా. పిచ్చిడాడీ! మృత్యుదేవత కబంధ హస్తాలనుండి తప్పించాలని విఫల ప్రయత్నం చేసారు. ఓటమి నెదుర్కొనే స్థయిర్యంలేక ప్రాణాలు కోల్పోయారు"

గౌతమ్ కంఠంలో దుఃఖపు జీర.

తండ్రి పోయాక గౌతమ్‌లో మనః స్థయిర్యం ఇంచుకతగ్గిందేమో అనిపించింది స్పందనకు. ఆమె మనస్సు కలత చెందింది. ఈస్థితిలో మనస్సు అదుపు తప్పితే మళ్ళీ కష్టం.

అప్పుడే అతడి మొహంలో విషాదం క్రమంగా చోటుచేసుకుంటోంది. కళ్ళల్లో కాంతి తగ్గుతోంది...

"స్పందనా?"

గౌతమ్ పిలుపువిని అతడి కళ్ళల్లోకి చూసింది.

"ఒంట్లో బావోలేదా? అదోలాగున్నావు!" మృదువుగా అడిగాడు గౌతమ్.

"నాకేం నిక్షేపంలాగున్నాను"

"ప్రస్తుతం నాకున్న ఒకే ఒక ఆత్మీయురాలివి నువ్వు. నీ ముఖంలో చిరునవ్వు చూస్తేనే నామనస్సుకి శాంతి"

'మీరు మృత్యువు నీడలో నిలిచిఉంటే నేను సంతోషంగా ఎలా ఉండగలను? నా మొహంలో చిరునవ్వు ఎలా కనిపిస్తుంది?' విషాదంగా అనుకుంది స్పందన.

"స్పందనా...నా మాటంటే నీకు విలువ ఉందా?" గౌతమ్ అడిగాడు.

స్పందన వదనంలో విషాదాన్ని

వెనక్కినెట్టి విస్మయం ముందుకు వచ్చింది.

"మీమాట నాకు వేదవాక్కు. ఇపుడు నన్నేంచేయమంటారు? ఆజ్ఞాపించండి. డాడీ తర్వాత నేను అభిమానించేది ఒక్క మిమ్మల్నే..."

"ఎందుకూ నేనంటే నీకింత అభిమానం?"

"మరి, మీకెందుకు నేనంటే అభిమానం?" ఎదురు ప్రశ్నించింది స్పందన.

'అభిమానం కాదు. అనురాగంతో నా హృదయం పొంగి పొరలుతున్నది. స్పందనా. మైలవ్, ఐ లవ్ యూ డార్లింగ్' అని మనస్సులోనే అనుకుని పైకి మాత్రం "ఈ మృత్యుకూపంలో మగ్గిపోతున్న నన్ను అభిమానంతో పలకరించే స్నేహమయివి. నిన్ను అభిమానించకుండా ఉండగలనా? ఇక్కడ నేనుకాక ఇంకా పదిమంది అభాగ్యులున్నారు. ఎప్పుడో ఎవరికీ తప్ప అట్టే విజిటర్స్‌రారు. వాళ్ళతో పోల్చిచూసుకున్నప్పుడే నేనెంత అదృష్టవంతుడినో నాకర్థమవుతుంది. అవునూ, నాకో అనుమానం?"

"ఏమిటి?"

"జైలు సూపర్నెంట్ కూతురయినప్పటికీ డెత్ సెల్లులో ఉన్న ఖైదీని అనుదినం విజిట్ చేసేందుకు జైలు రూల్స్ అనుమతించవనుకుంటానే?"

"నిజమే. అనుమతించవు."

"మరి?"

"మీకు తెలీదేమో. రాష్ట్ర హోమ్ మినిస్టరు మా మేనమామే. ఆయనవద్ద ప్రత్యేకానుమతి పొందాకే ఇలా మిమ్మల్ని ప్రతిరోజుకలిసి మాట్లాడగలుగుతున్నాను"

"ఇలా నన్నుకలిసి మాట్లాడ్డం మీ డాడీకభ్యంతరం లేదా?"

"ఏ వి ష య ం లో నూ నా ఇష్టం కాదనరు డాడీ"

ఆమె హృదయం చదవడానికా అన్నట్లు స్పందన కళ్ళల్లోకి లోతుగా చూసాడు గౌతమ్. ఆమెను హృదయానికి హత్తుకోవాలన్న కోరిక అతడిని నిలువనియ్యలేదు. ఆదేక్షణంలో అతడిని పెనవేసుకు పోవాలన్న కోరిక ఆమెనూ వివశను చేస్తున్నదని అతడికి తెలీదు.

* * *

ఆరోజు పొద్దున్న నిరంజనరావుగారు రావడం చూసి లేచి తలుపు వద్ద నుంచున్నాడు గౌతమ్.

"గుడ్‌మార్నింగ్ సార్!"

"మార్నింగ్!" గౌతమ్ వంక ఆర్ద్రంగా చూస్తూ అన్నారు నిరంజనరావుగారు.

"టైమెంతయింది?"

"నైన్‌థర్టీ ఫైవ్...."

"ఎనీ న్యూస్?" అడిగాడు గౌతమ్.

ఏదో విశేషముంటే తప్ప ఆయన అంత పొద్దునే రారని అతడికి తెలుసు.

తల ఊపారు నిరంజనరావుగారు.

"సుప్రీంకోర్టులో నాకేసు మీద తీర్పు ఇవ్వబడిందా?" ఆయన వయిపు పరీక్షగా చూస్తూ అడిగాడు గౌతమ్.

మళ్ళీ మౌనంగా తల ఊపారు నిరంజనరావుగారు.

"మరణశిక్ష కన్‌ఫర్మ్ చేయబడిందా?" నిశ్చలంగా అడిగాడు గౌతమ్.

"గౌతమ్! సంగతెలిసీ నువ్వింత నిశ్చలంగా ఎలా ఉండగలుగుతున్నావు?" ఆవేదనగా అడిగారు నిరంజనరావుగారు.

"నేరం చేసాక శిక్ష అనుభవించేందుకు

సిద్ధంగానే ఉండాలి" నిర్లిప్తంగా అన్నాడు.

నిరంజనరావుగారు నిట్టూర్చారు.

"ఇప్పుడిహ మిగిలింది ఒక్కటే మార్గం...."

"ఏమిటి?"

"క్షమాభిక్షనర్థిస్తూ రాష్ట్రపతికి మెర్సీపిటిషన్ పెట్టుకోవాలి"

"డామిట్!"

విభ్రాంతిగా చూసారు నిరంజనరావు గారు.

"ఒకరికి ఇవ్వడమే తప్ప ఇతరుల ముందు చెయ్యిచాచి అర్థించడం నాకలవాటులేదు; ఇష్టమూలేదు"

"కానీ ఇది నీ జీవన్మరణసమస్య!"

"కావచ్చు!"

గౌతమ్ ధోరణి నిరంజనరావుగారికి అర్థంకాలేదు. ప్రస్తుతం అతడున్న పరిస్థితిలోనే ఉండగా ఎందరో ఖైదీలను చూసారాయన. ఏ ఒకరూ ప్రెసిడెంటుకి మెర్సీపిటిషన్ పెట్టుకునేందుకు అభ్యంతరం చెప్పలేదు. అసలు ప్రవాహంలో కొట్టుకుపోతున్న వ్యక్తి ఒక గడ్డిపోచ దొరికితే అది ఆధారంగా ప్రాణాలు కాపాడుకునేందుకు ప్రయత్నిస్తాడు. చివరి క్షణందాకా ప్రాణాలు కాపాడుకునే మార్గం కోసం వేయికళ్ళతో చూస్తూనే ఉంటాడు. అది మానవనైజం. మరి ఇతనేమిటి?

"గౌతమ్! నువ్వసలు మతి ఉండే మాట్లాడుతున్నావా?"

"థాంక్ గాడ్! నాకింకా మతి భ్రమించలేదు"

"గౌతమ్! కాస్త విచక్షణతో ఆలోచించు. ప్రస్తుతం నీకన్ని మార్గాలు మూసుకుపోయాయి. ఇప్పుడిహ రాష్ట్రపతి కరుణమీద ఆధారపడి ఉంది నీ జీవితం. ఈ అవకాశం పోగొట్టుకున్నావంటే తర్వాత పశ్చాత్తాపపడి ప్రయోజనం ఉండదు. కాసేపు ఆత్మాభిమానాన్ని అవతలికి నెట్టి వాస్తవికతను గురించి ఆలోచించు. ముందుముందు ఎంతో జీవితం ఉంది. నీ వలన సమాజానికి ఎంతో ప్రయోజనం ఉంది. నా మాట విను...."

"సరే, నేనో మాటడగనా?" అడ్డొచ్చాడు గౌతమ్.

"ష్యూర్!"

"మీ మాట మన్నించి ఆత్మాభిమానాన్ని అవతలికి నెట్టి నేను రాష్ట్రపతికి మెర్సీ పిటిషన్ పెట్టుకున్నాననుకోండి. ఆయన నిజంగా నన్ను కరుణించి ప్రాణభిక్ష పెడతారన్న నమ్మకం మీకుందా?" సూటిగా అడిగాడు గౌతమ్.

నిరంజనరావుగారు మాట్లాడలేదు.

"ఆయన కరుణించవచ్చునని మీకే పూర్తి నమ్మకం లేనప్పుడు అలవాటులేని పనిగా నేను బిచ్చమడగడం ఎందుకు?"

"లేదు గౌతమ్! సర్జరీలో నీకున్న ప్రతిభ అనన్యసామాన్యమయింది ఎందరినో మృత్యుముఖం నుండి తప్పించావు. మున్ముందు నీ వలన సమాజానికి ఎంతో ప్రయోజనం ఉంది. ఆయన స్థిమితంగా ఆలోచించి..."

"ఆయన ఆలోచిస్తున్నంత కాలం ఇక్కడ ఆశనిరాశల మధ్య నేను ఊగిసలాడుతుండాలి. నాన్సెన్స్ ప్రాణాలమీద నాకంత తీపి లేదు. చెప్పానుగా – చేసిన నేరానికి శిక్ష అనుభవించేందుకు నేను సిద్ధంగా ఉన్నాను" స్థిరనిశ్చయపు కంఠంతో అన్నాడు గౌతమ్.

"ఆలోచించు గౌతమ్. మీ అమ్మగారు ఇప్పటికే ఎంతో కృంగిపోయి ఉన్నారు.

ఇప్పుడు నువ్వు ఈ అవకాశం వదులు కున్నావంటే తర్వాత మీ అమ్మగారేమవు తారో ఒక్క క్షణం ఆలోచించు" అను నయంగా చెప్పారు నిరంజనరావుగారు.

మౌనంగా ఉండిపోయాడు గౌతమ్.

నిరంజనరావుగారు ఎంతో నచ్చ జెప్పారు.

ఊహూఁ. గౌతమ్ మెర్సీపిటిషన్ పెట్టు కునేందుకు ససేమిరా ఒప్పుకోలేదు.

"ఆలోచించు గౌతమ్! ఇది ఆషా మాషి వ్యవహారంకాదు. [illegible] సమస్య. ఏది పోగొట్టుకున్నా మళ్ళీ పొంద వచ్చు. ప్రాణాలుపోతే మాత్రం తిరిగి పొందడం మానవతరంకాదు. ఆ విషయం నాకన్నా డాక్టరువయిన నీకే బాగా తెలిసి ఉండాలి. లభించిన అవకాశాన్ని అంది పుచ్చుకోవడం బుద్ధిమంతుల లక్షణం. వారంరోజులు గడువుంది. ఆ గడువు దాటాక మళ్ళీ నువ్వెంత ప్రయత్నించినా ఫలితం ఉండదు. మళ్ళీ రేపు వస్తాను. ఈలోగా విచక్షణ ఉపయోగించి ఆలో చించు" అని వెళ్ళిపోయారు నిరంజన రావుగారు.

ఊచలు పట్టుకుని శూన్యంలోకిచూస్తూ ఎంతోసేపు అలాగే ఉండిపోయాడు గౌతమ్.

మధ్యాహ్నం జైలర్ వచ్చాడు.

అతడికి గౌతమ్ అంటే అభిమానం, గౌరవం.

అతనూ ఎంతో చెప్పి చూసాడు.

అలాగే ఉండిపోయాడు గౌతమ్.

సాయంత్రం స్పందన వచ్చింది.

వస్తూనే "గౌతమ్! ప్లీస్..." అంటూ ఏదో చెప్పబోయింది.

"నువ్వు చెప్పదలచింది మెర్సీపిటిషన్ విషయమే అయితే నువ్వు వెంటనే వెళ్ళి పోవడం మంచిది" కఠినంగా అన్నాడు గౌతమ్.

కన్నీరుకారుస్తూ మౌనంగా ఉండి పోయింది స్పందన.

మరో మూడురోజులు గడిచాయి.

ఈ మూడు రోజులూ విసుగు విరామం లేకుండా నిరంజనరావుగారు గౌతమ్‌కి నచ్చజెప్తూనే ఉన్నారు. కానీ గౌతమ్‌లో ఎటువంటి కదలికలేదు.

ఆరోజు పెద్దకొడుకుని వెంటబెట్టుకుని సుందరమ్మ వచ్చింది.

ఆమెనుచూసి గౌతమ్ దుఃఖం ఆపుకో లేకపోయాడు.

పసుపురాసిన నుదుట ధగధగ మెరిసే కుంకుమతో అయిదోతనానికి చిహ్న మయిన అలంకరణలతో కళకళ్ళాడు తుండే ఆమెను వితంతు వేషంలో చూసి అతడి హృదయం ఆక్రోశించింది.

కొడుకుని చూడగానే సుందరమ్మకు గుండెల్లోంచి ఏడుపు తన్నుకు వచ్చేసింది.

"వెళ్ళిపోయార్రా నాయనా... నన్ను ఒంటరిదాన్ని చేసి మీడాడీ వెళ్ళిపోయారు" అని బావురుమంది.

ఆమె కన్నీరు తుడుస్తూ, "పోయిన వాళ్ళు పుణ్యాత్ములమ్మా... బతికి ఉండి కష్టాలు, దుఃఖాలు మూటగట్టుకోవడం మినహా మనం ఏం సాధించగలుగు తున్నాం? బతికినన్నాళ్ళూ డాడీకి బతుకు తాపత్రయంతోనే గడిచిపోయింది. ఇప్పుడయినా మృత్యుదేవత చల్లని ఒడిలో ఆయనకు విశ్రాంతి లభిస్తుందేమో!" అన్నాడు గౌతమ్.

"చివరిక్షణం దాకా నిన్నే కలవరిస్తూ పోయారు" ముక్కుచీదేస్తూ అంది సుంద రమ్మ.

"నేను దురదృష్టవంతుడిని. ఆఖరి

చూపులకు నోచుకోలేకపోయాను. కనీసం దహన సంస్కారాలు చేసి పుత్రధర్మం నెరవేర్చలేకపోయాను. నాలాంటి కొడుకు పుట్టి ఏం ప్రయోజనం?"

గౌతమ్ చేతుల్లో మొహం దాచుకున్నాడు.

శ్రీధర్ అతడి భుజం మీద అనునయంగా నొక్కాడు.

ఏడుపులు, శోకాలు తగ్గాక సుందరమ్మ అసలు విషయానికి వచ్చింది.

"నాయనా! అదేదో మెర్సీపిటిషనుట. కాదనకుండా దాని మీద సంతకం పెట్టు తండ్రీ"

గౌతమ్ వదనంలో రంగులుమారాయి.

"ఊహూఁ... ఇప్పుడు మీరొచ్చింది అందుకేనన్న మాట?"

"అవును నాయనా. సూపర్నెంటు బాబుగారు ఫోనుచేసి చెప్పారు. ఈ అవకాశం జారవిడుచుకుంటేఇక అన్ని ఆశలూ వదులుకోవలసిందే అంటున్నారు ఆయన. మంచి మనిషి. మనమంటే అభిమానం చూపుతున్నారు. ఆయన మాట విను నాయనా! ఇప్పటికే కష్టాలకడలిలో గొంతు దాకా మునిగి ఉన్నాను. ఇంకా ఇంకా కష్టాలు ఎదుర్కొనే స్థయిర్యం నాకులేదు నాయనా. శోకతప్తయయిన ఈ ముసలి తల్లిని దృష్టిలో ఉంచుకుని నువ్వీ ప్రయత్నం చేయకతప్పదు"

గౌతమ్ మాట్లాడలేదు.

"చెప్పు నాయనా!"

"ఏం చెప్పమంటావమ్మా ? నాకు జీవించాలన్న ఆశ పూర్తిగా చచ్చిపోయింది"

మళ్ళీ ఏడుపు ఉప్పెనలా వచ్చేసింది సుందరమ్మకు.

"నాకు గర్భశోకం కలిగించేందుకే కంకణం కట్టుకున్నావన్న మాట ! ఏ జన్మలో చేసిన పాపమో ఇప్పుడు నన్నిలా పట్టిపీడిస్తున్నది. పసుపు కుంకుమలతో ఆయన ఒళ్ళో ఆఖరి శ్వాస వదలాలని ఆకాంక్షిస్తే నాకన్న ముందే ఆయన వెళ్ళిపోయారు. ఇప్పుడు నువ్విలావేధిస్తున్నావు. నేనింకే ఆశతో బతకాలి?"

గౌతమ్ చలించలేదు.

"తమ్ముడూ! ప్రాణాల మీదికి ముంచుకు వస్తుంటే ఏం పట్టనట్లు అలా ఊరుకుంటావేం? పరిస్థితిని అర్థంచేసుకో ఆఖరి ప్రయత్నం చేసి చూద్దాం. ఆ తర్వాత దైవనిర్ణయం ఎలాగుంటుందో!" కన్నీళ్ళతో అన్నాడు శ్రీధర్.

"హంతకుడని ముద్రపడ్డాక బతికి ప్రయోజనం లేదన్నయ్యా" తలవంచుకుని అన్నాడు గౌతమ్.

వ్యథగా చూసాడు శ్రీధర్.

సాటివారిలో ఈర్ష్యాసూయలు రగిలించేంత గొప్పగా, హోదాగా, దర్జాగా బతికిన తమ్ముడి జీవితంలో ఈ పరిణామమేమిటి? ఉన్నత వంశంలో పుట్టి, చేపట్టిన వృత్తిలో ఉన్నత శిఖరాలు అందుకుని సమాజంలో పరువుగా, గౌరవంగా బతికిన తన ఒక్కగానొక్క తమ్ముడి బతుకు తుదకు ఉరికంబం మీద అత్యంత హేయంగా అంతం కావలసిందేనా?

తను ఉండీ ఏం చేయలేని అసమర్థుడయిపోయాడు.

గుండెలు మెలిపెట్టే బాధ నణచుకుంటూ—"అసలు మెర్సీ పిటిషను పెట్టుకునేందుకు నీకభ్యంతరం ఏమిటి?" అన్నాడు.

"అన్నయ్యా ! ఈ క్షణాన నాకు జీవించాలన్న ఆశ లేశమాత్రంలేదు.ఎంత

త్వరగా ఉరికంబం ఎక్కిస్తే నాకంత మంచి చేసారనిపిస్తుంది. మెర్సీపిటిషన్ పెట్టుకున్న పిదప ఏమో, నాలో జీవితేచ్ఛ కలగచ్చు. ఆ తర్వాత రాష్ట్రపతి నిర్ణయం తెలిసేదాకా ఆశ నిరాశల మధ్య కొట్టుమిట్టాడుతుండాలి. అదే నా కిష్టంలేదు. రాష్ట్రపతి కరుణిస్తారని పూర్తిగా నమ్మకం లేనప్పుడు ఆశనిరాశల మధ్య మనస్సుని చితగ్గొట్టడం ఎందుకు? నా మనస్సు ఇప్పటికే బాగా అలసిపోయింది. నాకు విశ్రాంతి కావాలి అన్నయ్యా. మృత్యుదేవత ఒడిలోనే నాక్కావలసిన విశ్రాంతి లభిస్తుంది"

నీరసం, అలసట, వేదన... ఇంకా ఎన్నో కారణాల చేత శుష్కించి, నలిగి పోయినట్లున్న తమ్ముడి మొహంచూసి శ్రీధర్ విచలితుడయాడు.

"తమ్ముడూ... గౌతమ్!" ఆక్రోశిస్తున్నట్టే అన్నాడు "అదేనా నీ నిర్ణయం?"

"అవునన్నయ్యా! మనస్సు అంగీకరించని పనులుచేయడం నా కలవాటులేదు" స్థిరనిశ్చయ కంఠంతో అన్నాడు గౌతమ్.

అతడి ముఖంలోకి ఆర్తిగా, తపనగా చూడసాగాడు శ్రీధర్.

ఇద్దరికి సంబంధించిన ఎన్నెన్నో సంఘటనలు అతడి స్మృతిపథంలో గిర్రున తిరిగిపోతున్నాయి.

ఇద్దరూ కలసి స్కూలుకు వెళ్ళడం, ఆడుకోవడం, ఆటలో పోట్లాటలు కీచులాటలు, ఒకరిమీద ఒకరు కలయబడి కొట్టుకోవడం, మళ్ళీ కలసిపోయి ఆడుకోవడం.... చీకూ చింతాలేని ఆ రోజులు తిరిగి వస్తాయా....?

"అన్నయ్యా!" పిలిచాడు గౌతమ్.

ఆలోచనలనుంచి బయటపడి చూసాడు శ్రీధర్.

"వదిన, పిల్లలు కులాసా?"

తల ఊపాడు శ్రీధర్.

"పిల్లలు పెద్దయ్యాక నా గురించి చెడుగా అనుకుంటారేమో!" బాధగా అన్నాడు గౌతమ్.

"ఛ... ఎందుకనుకుంటారు?"

"ఎందుకనుకోరు? ఒకరిని గురించి మంచిగా అనుకోవడంకన్న చెడుగా అనుకోవడమే తేలిక...."

"నువ్వనవసరంగా ఏదేదో ఊహిస్తూ మనస్సు పాడుచేసుకోకు"

"సాలిటరీ కన్‌ఫైన్‌మెంటులో ఉంచబడిన నాలాంటివాడికి ఊహలు, ఆలోచనలే ఆత్మీయులు, ఆప్తమిత్రులు, జత వీడని సహచరులు... తెలుసా?"

"గౌతమ్!" వ్యధగా అన్నాడు శ్రీధర్.

టైమయిపోయిందని మర్యాదగా తెలియబరిచాడు ఒక వార్డర్ వచ్చి.

"తమ్ముడూ! ప్లీస్... మా అందర్నీ దృష్టిలో ఉంచుకుని మరోసారి ఆలోచించు" అర్థిస్తున్నట్లుగా అన్నాడు శ్రీధర్.

కటకటాలగుండా చేతిని లోపలికి పోనిచ్చి కొడుకు చెక్కిళ్లు సవరిస్తూ–

"మరోసారి నింపాదిగా ఆలోచించు నాన్నా" అని ఏడుస్తూ పెద్దకొడుకు వెంట వెళ్ళిపోయింది సుందరమ్మ.

వాళ్లు వెళ్ళిన కాసేపటికి స్పందన వచ్చింది.

"నీ వాలకంచూస్తే నువ్వసలు క్లినిక్కి వెళుతున్నట్లు లేవు?"

కాసేపు తర్వాత అడిగాడు గౌతమ్.

"నిజమే... వెళ్ళడంలేదు"

"ఎందుకని?" స్పందన కళ్ళలోకి గుచ్చిచూస్తూ అడిగాడు గౌతమ్.

"ఏమో, వెళ్ళబుద్ధి కాలేదు" నిర్లిప్తముగా అంది స్పందన.

"వైద్యవృత్తిని చేపట్టినవాళ్లు వృత్తిని నిర్లక్ష్యం చేయకూడదు''

"మనస్సుకన్న వృత్తి ముఖ్యం కాదు"

"నీ మనస్సుని వేధిస్తున్న సమస్య ఏమిటో నేను తెలుసుకోవచ్చా?"

"తెలుసుకుని మీరేం చేయగలరు?"

గాయపడ్డట్లు చూసాడు గౌతమ్.

"నిజమే. మరికొన్నాళ్ళలో బలవన్మరణం పొందబోతున్న నేను ఎవరికేమి చేయగలను? కనీసం మాట సాయమైనా చేయలేను. ఓహ్... హఠాత్తుగా నా జీవితం ఎంత విలువ కోల్పోయింది!"

సున్నితమయినచోట బలమైన దెబ్బ తగిలినట్లు గిలగిల్లాడిపోతూ చూసింది స్పందన.

"సారీ...అయామ్ రియల్లీ సారీ! అనాలోచితంగా మాట్లాడి మీ మనస్సు నొప్పించాను" వ్యధాభరితకంఠంతో అంది.

గౌతమ్ మాట్లాడలేదు.

అతడి మొహంలో స్పందన ఎన్నడూ చూడని ఏదో మార్పు....

భగవంతుడా! తనేం చేసింది. అతడి గాయంమీద కారం చల్లిందా?

అతడు తనను క్షమించి ఎప్పట్లా మాట్లాడుతాడా?

అతడిని పలకరించే సాహసం చేయలేకపోయిందామె.

చేయరాని నేరం చేసినట్లు గిల్టీగా ఫీలవుతూ మౌనంగా ఉండిపోయింది.

కొన్ని నిమిషాల నిశ్శబ్దం అనంతరం గౌతమ్ చెప్పాడు – "నేను థర్డియర్లో ఉన్నప్పుడనుకుంటాను–ఒకరోజు మరణశిక్షను రద్దుచేయాలా కొనసాగించాలా అన్న విషయంమీద మా స్నేహితుల మధ్య వాదోపవాదాలు జరిగాయి. సామాజికంగా, వైజ్ఞానికంగా, రాజకీయంగా అన్ని రంగాలలో ఎంతో ప్రగతిని సాధించిన ఈ స్పేస్ ఏజ్‌లో కంటికి కన్ను, రక్తానికి రక్తం, ప్రాణానికి ప్రాణం అని ప్రాచీనకాలంనాటి న్యాయ సూత్రాన్నే అమలుజరపాలనుకోవడం అన్యాయం, అమానుషం, అనాగరికం, అవమానకరమని చాలామంది వాదించారు. అసలు నేరం చేయడానికి ముఖ్యకారణం మానసికదౌర్బల్యం. అందుకే నేరస్థుడిలో మానసికంగా మార్పు వచ్చేలా సంస్కరించాలని, సభ్యసమాజంలో తనూ ఒక పౌరుడయి సామాజిక విధులు సక్రమంగా నిర్వర్తిస్తూ హాయిగా బతికే అవకాశం కల్పించాలి. అలాకాక మరణశిక్ష విధించి నేరస్థుడు తన ప్రవర్తన మార్చుకునే అవకాశం లేకుండా చేయడం అక్రమం అని సంఘసంస్కర్తలాంటి ఒక మిత్రుడు వాదించాడు. చాలామంది అతడిని సమర్థించాడు. కానీ నేను వారితో ఏకీభవించలేదు. మరణశిక్ష భయమే లేకుంటే నేరస్థులు మరింతగా విజృంభించవచ్చుననీ, నేరాలు మరింతగా పెచ్చు పెరిగే అవకాశాలున్నవనీ, అందుకే మరణశిక్ష కొనసాగింపబడాలనీ నొక్కి వక్కాణించాను. భవిష్యత్తులో నాకు ఉరిశిక్ష విధించబడుతుందని ఆనాడు తెలిసి వుంటే, బహుశా అలా వాదించి ఉండేవాడిని కానేమో..."

"మనస్సుని కెలికే ఇటువంటి ఆలోచనలు మనస్సులోకి రానివ్వకుండా ఉండలేరా?"

వ్యధగా అంది స్పందన.

శుష్కహాసం చేసాడు గౌతమ్. "ఆలో

చించకుండా ఉండాలని ఎంతగానో అను కుంటాను. కానీ మనస్సు మాట వినదు. ఏం చేయను? నా మీద ఉరిశిక్ష అమలు పరిచే ఆ విషాద సంఘటననే పదేపదే ఊహిస్తుంటుంది మనస్సు. జరగబోయే సంఘటన గురించి ఊహించుకోవడం సహజమేకదా. ఆ సంఘటన సంతోషం కలిగించేదయితే మనస్సు సంతోషంతో పరవశిస్తుంది. తద్భిన్నమయితే మనస్సు బాధతో ముడుచుకుపోతుంది. ఏది ఏమయి నప్పటికీ రానున్న కాలం గురించి ఆలో చించకుండా ఉండటం మానవ సాధ్యం



కాదు. ఇప్పటికన్న ప్రాచీనకాలంలో విధించబడ్డ మరణశిక్షలు క్రూరాతిక్రూరంగా ఉండేవట. అయితే శిక్ష సత్వరం అమలుపరిచేవారు. అందుకే ఆనాటి మరణశిక్ష ఖైదీకి ఈనాడు డెత్ సెల్లులో ఉన్న ఖైదీ అనుభవించే చిత్తక్షోభ ఉండేదికాదు. సెషన్స్‌కోర్టు తర్వాత హైకోర్టు, అటు పిమ్మట సుప్రీంకోర్టు, చిట్టచివరి ప్రయత్నంగా రాష్ట్రపతికి మెర్సీ పిటిషన్ దాఖలు చేసుకోవడం... అన్ని తతంగాలు పూర్తయి నేరస్థుడి మీద శిక్ష అమలు పరిచేందుకు దాదాపు సంవత్సరకాలం పడుతుంది. నూటికి తొంభయితొమ్మిదిమంది నేరస్తులు తప్పించుకున్నప్పటికీ ఒక నిర్దోషి అన్యాయంగా శిక్ష అనుభవించకూడదన్న తపనే ఈ ఆలస్యానికి కారణం కావచ్చు అయితే ఇంతకాలమూ ఆ నేరస్థుడు మానసికంగా అనుభవించే నరకం వాడికి తప్ప ఇతర్లకు అర్థంకాదు. చావుకన్నా చావుని గురించిన ఆలోచనలే అత్యంత బాధాకరమయినవని అనుభవపూర్వకంగా తెలుసుకున్నాను. నిజం చెబుతున్నాను - నువ్వే లేకుంటే ఇక్కడ జీవితం నాకింకా దుర్భరంగా ఉండేది. దుస్సహమయిన ఈ ఒంటరితనంలో మానసికంగా నాకు అండగా నిలిచావు. కన్నవాళ్లు, తోడబుట్టిన వాళ్ళు, ఆప్తమిత్రులు ఎవరూ చేయలేని ఉపకారం చేసావు ... చేస్తున్నావు. నీ ఋణం ఎలా తీర్చుకోను?"

సజల నేత్రాలతో ఏదో చెప్పబోయింది స్పందన. అంతలో ఆమె తండ్రి వచ్చారు.

"వెల్ మైడియర్ యంగ్ మాన్! ఏం నిర్ణయించుకున్నావు?"

"పదేపదే నిర్ణయాలు మార్చుకునే అలవాటు నాకులేదు"

కొన్నేళ్ళ క్రితం వెల్లూరులో మొట్టమొదటిసారి గౌతమ్‌ని చూసారు నిరంజనరావుగారు. ఎందుకో ఆయనకే తెలియదు. అతనంటే ఎంతో ఇష్టం ఏర్పడింది. పైగా అతను టెన్నిస్ ఆటగాడు కావడం ఆయన హృదయంలో అతనికి చోటు లభించింది. తర్వాతర్వాత క్లబ్బులో టెన్నిస్ ఆడేప్పుడు తరచుగా గుర్తొచ్చేవాడు. వెల్లూరు హాస్పిటల్లో కోర్సు పూర్తయ్యాక అతడి వివరాలు ఆయనకు తెలీలేదు. కానీ అతను ఎక్కడ ఉన్నప్పటికీ ఉన్నంతగా దర్జాగా హోదాగా బతుకుతాడనే ఆయన విశ్వాసం. కూతురు సమక్షంలో అతడిని గురించి ప్రశంసగా మాట్లాడేవారు. హఠాత్తుగా ఒకరోజు అతను భార్యను హత్యచేసి పరారీ అయ్యాడన్న వార్త పత్రికలో చూసి ఆయన మనస్సు తీవ్రమయిన అశాంతికి గురయింది. చట్టాన్ని అపరిమితంగా గౌరవించే ఆయన గౌతమ్ పోలీసులకు పట్టుబడకుండా ఏ విదేశాలో పారిపోతే బాగుండునని అనుకోకపోలేదు. అతడి పట్ల ఆయన అభిమానం అటువంటిది. హత్యజరిగిన మూడేళ్ళ తర్వాత అతను పట్టుబడ్డాడన్న సంగతి తెలిసి కృంగిపోయారు. పైగా మరణశిక్ష పొంది శిక్ష అనుభవించే నిమిత్తం తనున్న జైలుకే అతను రావడం...ఆయన మనస్సు తీవ్రమయిన సంఘర్షణకు గురయింది. పోలీసు అధికారుల్లాగే జైలు అధికారులూ సెంటిమెంట్స్‌కి మనస్సులో తావివ్వరాదని ఆయనకుతెల్సు. కానీ తన అభిమానం అమితంగా చూరగొన్న గౌతమ్ విషయంలో నిర్వికారంగా, కఠినంగా ఉండటం ఆయనకు చాతకాలేదు.

నేరం చేసాక శిక్ష అనుభవించాల్సిందేనని ఎప్పటిలా సరిపెట్టుకో లేకపోయారు. అతడి మరణ శిక్షను తనే అమలు పరచాలన్న యధార్థం ఆయన్ని మరింత అలమటింపజేసింది. ఈ స్థితిలో కూతురు అతడిని ప్రేమిస్తున్నదేమోనన్న అనుమానం ఆయన మనస్సుని మరింత అశాంతికి గురిచేసింది. ఈ స్థితిలో గౌతమ్ మెర్సీ పిటిషన్ మీద సంతకం పెట్టేందుకు నిరాకరించడం... కొన్నాళ్లుగా ఆయనకు మనస్సు మనస్సులో లేదు. అసలు ఇలా జరగటం ఆయనకు సరికొత్త అనుభవం. ఆయన రెండోసారి చెప్పనవసరంలేకనే ఎందరో నేరస్థులు దయాభిక్షనర్థిస్తూ రాష్ట్రపతికి విన్నపం చేసుకున్నారు. చివరి క్షణం దాకా ప్రాణాలకోసం పోరాడటం మానవ సహజమే. మరి ఇతనేమిటి ఇలా సతాయిస్తున్నాడు.

హఠాత్తుగా ఆయనలో కోపం బుసలుకొట్టింది.

"గౌతమ్...నువ్వు నా సహనం పరీక్షిస్తున్నావు!" అన్నారు తీవ్రంగా.

ఆయన కోపం గౌతమ్‌ని ఏమాత్రం కదిలించలేదు.

"నా జీవితం నా ఇష్టం. మధ్య మీ ప్రమేయమేమిటి?" అన్నాడు అంతకన్న తీక్షణంగా.

"నీ జీవితం మీద నువ్వెప్పుడో అధికారం కోల్పోయావు. ఇంకా నీ ఇష్టమేమిటి?"

నిర్లక్ష్యంగా చూసాడు గౌతమ్.

''గౌతమ్!నాకసలే సహనం తక్కువ. ఊరికే విసిగించావంటే..."

"ఏంచేస్తారు ?" తిరస్కారంగా అడిగాడు గౌతమ్.

అతడికి క్రోధంగా చూస్తూ పాంటు బెల్టు ఊడదీసారు నిరంజనరావుగారు.

"గౌతమ్! ప్లీస్...ఫర్ ది సేక్ ఆఫ్ గాడ్ సైన్ ది మెర్సీపిటిషన్ !"

తండ్రి కోపం తెలిసిన స్పందన భయంతో వణికిపోతూ అంది.

తల అడ్డంగా ఊపాడు గౌతమ్.

తాళంతీసి లోపలికి అడుగుపెట్టారు నిరంజనరావుగారు.

భయ విహ్వల నేత్రాలతో చూస్తోంది స్పందన.

గౌతమ్ చేతికి ఓ కాగితం అందిస్తూ, "సంతకంపెట్టు!" అధికారం ఉట్టిపడుతున్న కంఠంతో అన్నారు నిరంజనరావుగారు.

కాగితం అందుకుని ఓ మూలకు విసిరికొట్టాడు గౌతమ్.

మరుక్షణం నిరంజనరావుగారి చేతిలో బెల్టు పైకి లేచింది.

కొన్ని క్షణాలు బెల్టు నిర్విరామంగా గౌతమ్ శరీరం మీద నర్తించింది.

ప్రతిఘటించే ప్రయత్నమే చేయక శిలలా అలాగే నిశ్చలంగా నిలబడ్డాడు గౌతమ్. శరీరం అక్కడక్కడ రక్తసిక్తమయింది. ఆ గాయం మీద మళ్ళీ బెల్టు తగిలినప్పుడు కళ్లముందు నరకం ప్రత్యక్షమవుతోంది. అయినా పళ్ల బిగువున బాధ భరిస్తూ శరీరాన్ని బెల్టు కప్పగించి అలాగే నుంచున్నాడు గౌతమ్.

"డాడీ...ప్లీజ్ ..."

ఏడుస్తూ అంది స్పందన.

కొట్టి కొట్టి అలసిపోయారు నిరంజనరావుగారు. బెల్టుని దూరంగా విసిరికొట్టి రొప్పుతూ, "ఇప్పుడేమంటావు?"

ఎర్రగా చూసాడు గౌతమ్. "జైల్లో ఖైదీలను అమానుషంగాకొట్టి హింసిస్తారని

విన్నాను. ఆ మాట నిజమని ఈనాడు తెలుసుకున్నాను. అసలు జైల్ మాన్యువల్ ప్రకారం కూడా ఖైదీల మీద ముఖ్యంగా ఉరిశిక్ష పొందిన ఖైదీల మీద చెయ్యి చేసుకునే అధికారం మీకు లేదనుకుంటాను. అయినా మీరు నన్ను రక్తం కారేలా కొట్టారు. పోనివ్వండి. నా తండ్రి లాంటివారు. మాట మన్నించలేదని ఉక్రోషంతో కొట్టారు. అందుకు నేను బాధపడను. అయితే ఒక మాట గుర్తుంచుకోండి. సాక్షాత్తు దేవుడే దిగివచ్చినా నా కిష్టంలేని పని నాచేత చేయించలేడు"

"నీలాంటి జగమొండిని నా సర్వీసులో నేనింతవరకు చూడలేదు" నిస్పృహగా అన్నారు నిరంజనరావుగారు.

"నా మీద నాకు లేని శ్రద్ధ, నామీద ఉరిశిక్ష అమలు జరపాల్సిన మీకెందుకు?"

నిరంజనరావుగారు దుఃఖంతో కుమిలిపోతున్న కుమార్తెను చూసారు. తర్వాత గౌతమ్‌కి మాత్రమే వినిపించేంత మెల్లగా అన్నారు. "నా బహిః ప్రాణమయిన నా కూతురి ప్రాణంలో ప్రాణం నువ్వు. అందుకే నీ మీద నాకు శ్రద్ధ" అని వెళ్ళిపోయారు.




డాక్టర్ వచ్చి గాయాలకు మందువేసి ఇంజక్షన్ చేసి వెళ్ళాడు.

ఆ రాత్రి గౌతమ్‌కి అన్నంబదులు పాలు, బ్రెడ్డు ఇచ్చారు.

శరీరం మీది గాయాలవంక చూసుకున్నాడు.

శరీరానికయిన గాయాలు మందువేస్తే మానుతుంది.

మనస్సుకయిన గాయం?

నిట్టూర్చి వెల్లకిలా పడుకుని పైకప్పుకేసి దీర్ఘంగా చూడసాగాడు.

"నా బహిః ప్రాణమయిన కూతురికి ప్రాణంలో ప్రాణం నువ్వు...."

నిరంజనరావుగారి మాటలు అతడి చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నవి.

స్పందన తనను ప్రేమిస్తున్నదేమోననే తన అనుమానం నిజమేనని తెలిసిన ఆ క్షణంలో అతడి మనస్సు సంతోషంతో తేలిపోలేదు సరిగదా అనిర్వచనీయమయిన వేదనతో నిండిపోయింది. సహృదయురాలయిన స్పందన జీవితం తన కారణంగా వ్యర్థమవుతూందనుకుంటే అతడికి నిజంగా ఎంతో బాధనిపించింది.

తనను చూడకుంటే, తనతో పరిచయం ఏర్పడకుంటే గిరిధర్‌ని పెళ్ళిచేసుకుని అతడితో హాయిగా స్టేట్స్‌లో కాపరం చేస్తుండేది.

తనలో అంతగా ఏంచూసింది? తన కోసం కన్నెపిల్లలు కలలు గనే కమ్మని జీవితం కాదనుకుందేం?

గౌతమ్ గిరిధర్ ఫొటో చూసాడు. ఫొటోలోనే ఎంతో అందంగా, హుందాగా ఉన్నాడు. అలాంటివాడిని కాదని తనమీద మమతలు పెంచుకుందీమె. ఎందుకు? ఈనాడిలా ఆవేదనతో కుమిలిపోయేందుకా?

సాయంత్రం తండ్రి తనను కొడ్తుంటే గుండెలు చెదిరేలా ఏడుస్తున్న స్పందన రూపం అతడి స్మృతిపథం నుండి చెదిరి

పోలేదు.

'స్పందనా!'

బాధగా అనుకున్నాడు.

ఆమె మనస్సేమిటో తనకు ఆనాడే స్పష్టంగా తెలిసుంటే ఇంత అనర్థం జరిగి ఉండేదికాదేమో!

తను వివాహితుడు. అటువంటప్పుడు మనస్సులోని కోరికను పైకి ఎలా చెప్తుంది? అసలే ఇది ఇండియా!

అందుకే ఒకరిని ప్రేమిస్తూ, మరొకరిని పెళ్ళి చేసుకోవడం ఇష్టలేక అసలు పెళ్ళి మాటే తలపెట్టక జీవితంలో ఎటువంటి మాధుర్యమూ లేక అనుభవశూన్యంగా బతుకుతున్నది.

తనపట్ల ఆమెకున్న ప్రేమ అంత ప్రగాఢమయిందా?

తనసంతగా ప్రేమించే ఆమెతో జీవితం పంచుకునే అదృష్టానికి తను నోచుకోలేదు. తనెంత దురదృష్టవంతుడు!

బాధగా కణతలు నొక్కుకున్నాడు.

ప్రశాంతంగా సాగిపోయే జీవితాలనింతగా కల్లోలపరచే ప్రేమప్రభావానికి మనిషి లొంగకుండా ఉండలేడా?

చుట్టూ ఎందరో ఉండగా ఒక్కవ్యక్తి అంటే మాత్రమే మనస్సు ప్రణయభావంతో స్పందిస్తుందెందుకని?

కవులు, రచయితలు వర్ణించే జన్మజన్మల అనుబంధమే అందుకు కారణమా?

అందుకేనా అట్టే రూపసి కాని స్పందనకేసి తనింత గాఢంగా ఆకర్షితుడయాడు? ఆ కారణంగానేనా మృత్యునీడలో నిలిచి ఉన్న ఈ క్షణం సైతం ఆమె గుర్తొస్తే తన అణువణువు పులకరిస్తోంది? ఆమె ఊహా మాత్రాన తన మనస్సుకి చల్లగా హాయిగా అనిపిస్తోంది?

గౌతమ్‌కి నవ్వొచ్చింది.

ఒక చెంప మీదపడి కబళించేందుకు మృత్యువు పొంచి ఉంటే తను తీరిగ్గా ప్రేమతత్వం గురించి ఆలోచిస్తున్నాడు.

డాక్టరు ఇచ్చిన కాంపోస్ మాత్రలు మింగి కళ్ళుమూసుకున్నాడు.

నిరంజనరావుగారు గుర్తొచ్చారు.

పాపం పెద్దమనిషి!

ఒక్కతే కూతురు.

ఎంత గారాబంగా పెంచారో!

ఆమె చుట్టూ ఎన్ని ఆశలు అల్లుకున్నారో!

అల్లారుముద్దుగా పెంచిన కూతురు దాదాపుగా నిశ్చయమయిన పెళ్ళికాదని జీవితాంతం బ్రహ్మచారిణిగా ఉండిపోయేందుకు నిశ్చయించుకోవడం ... పాపం ఆ తండ్రి మనస్సు ఎంతగా క్షోభిల్లిందో!

అదిచాలక ఆమె అనురాగం చూరగొన్న వ్యక్తి మరణశిక్ష పొంది శిక్ష అనుభవించేందుకు తనున్న జైలుకే రావడం...

ఆ వ్యక్తికోసరం కూతురు తన కళ్ళ ముందే రాత్రింబవళ్ళు వ్యథతో కుమిలిపోతూ చిక్కి సగమవడం...

ఛ... తన కారణంగా ఎందరికి ఎన్ని విధాలుగా క్షోభ...

ఆలోచనల మధ్య ఎప్పుడో నిద్ర పట్టేసింది.

పొద్దున్న డ్యూటీకి రాగానే మొదటి పనిగా గౌతమ్‌ని పరామర్శించారు నిరంజనరావుగారు.

గౌతమ్ బాగా నీరసించి ఉన్నాడు.

"సారీ గౌతమ్! ఉచితానుచితాలు విస్మరించి పశువులా ప్రవర్తించాను"

పశ్చాత్తాపంగా అన్నారు నిరంజనరావుగారు.

"ఇట్సాల్ రైట్!" ముభావంగా అన్నాడు గౌతమ్. అతడివంక పరీక్షగాచూస్తూ "నీ నిర్ణయం"

"పదే పదే నిర్ణయాలు మార్చుకునే దుర్బల మనస్కుడినికాను నేను. ఆ మాట ఆరోజే చెప్పాను" నిరంజనరావుగారి మాటలమధ్య అందుకుని అన్నాడు గౌతమ్.

"ఈ జైలు గోడలకన్న కఠిన మయింది నీ మనస్సు" నిస్పృహగా అని వెళ్ళిపోయారు ఆయన.

రోజులాగే సాయంత్రం స్పందన వచ్చింది.

ఎన్నో జన్మలు, యుగాలు తర్వాత చూస్తున్నట్లు ఆమె మొహంలోకి ఆర్తిగా, తపనగా చూడసాగాడు గౌతమ్.

"ఏమిటలా కొత్తగా చూస్తున్నారు?" విస్మయంగా అంది స్పందన.

"ఒక విషయం విన్నాను" ఆమె మొహంలోకి అలాగే చూస్తూ అన్నాడు గౌతమ్.

"ఏం విన్నారు?"

"నా ప్రణయదేవత నన్ను ఆరాధిస్తున్నదని తెలిసింది"

విస్ఫారిత నేత్రాలతో చూసింది స్పందన.

"స్పందనా!"

గౌతమ కంఠంలో ఎన్నడూ వినిపించని మాధుర్యం, లాలన...

చప్పున కళ్ళు వాల్చేసింది స్పందన.

ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది.

"మీరు....మీరేం చెబుతున్నారు?"

"ఐ లవ్‌యూ!" ఆమె చెవిలో చెప్తున్నంత మెల్లిగా చెప్పాడు గౌతమ్.

ఆ మాటలు విన్న స్పందన మొహంలో మెరిసిన అపురూపమయిన దీప్తి...

జన్మజన్మలకు మరచిపోలేనిది.

చప్పున అతడి చేతిలో మొహం దాచుకుంది స్పందన.

"ఇలా చూడు!" లాలనగా అన్నాడు గౌతమ్.

తలెత్తి చూసింది స్పందన.

ఆమె నేత్రద్వయం ప్రణయదీప్తితో మెరుస్తోంది.

"నీ మనస్సేమిటో చాలా ఆలస్యంగా తెలుసుకున్నాను"

స్పందనకు ఏడుపు వచ్చేసింది.

"గౌతమ్...మీరు లేకుంటే నేను బతకలేను" ఏడుస్తూ అంది స్పందన. "నా ఆరాధన ఫలించి ఏదో ఒక రోజు మిమ్మల్ని చేరుకోగలనన్న నమ్మకంతోనే ఇన్నాళ్ళూ బతికాను. కానీ...కానీ విధి మీతోబాటు నన్నూ క్రూరంగా కాటేసింది"

"నువ్వలా మాట్లాడకూడదు" మృదువుగా అన్నాడు గౌతమ్.

"ఎందుకు మాట్లాడకూడదు?"

ఆ క్షణం స్పందనలో 'అలామాట్లాడకూడదమ్మా..., తప్పు' అని తల్లి వారిస్తే ఏం, ఎందుకు మాట్లాడకూడదు?' అని ఉక్రోషంగా అడిగే పదేళ్ళ పసిపాప కనిపించింది.

ఆమెను అలాగే హృదయానికి హత్తుకోవాలన్న కోరిక దిగమింగి, "ఎందుకంటే నీముందు ఇంకా ఎంతో జీవితం ఉంది. హత్యానేరానికి ఉరికంబం ఎక్కబోతున్నవాడిని నేను. నీ హృదయంలో నాకు అణుమాత్రం చోటుందని ప్రపంచానికి తెలిస్తే నీ భవిష్యత్తు దెబ్బతినే ప్రమాదముంది..."

"మీరు లేకపోయాక నాకు భవిష్యత్తు ఉంటుందనే అనుకుంటున్నారా?"

అతి మంద్రస్వరాన సూటిగా అడిగింది స్పందన.

"స్పందనా?" ఆందోళనగా అన్నాడు గౌతమ్.

ఏమిటీ విచిత్రం?

సమాజంలో అత్యున్నత స్థాయిలో ఉన్న స్త్రీ ఇంకా కొన్ని రోజుల్లో ఉరి కంబం ఎక్కబోతున్న నేరస్థుడి ముందు మోకరిల్లి నువ్వులేకపోతే నాకు భవిష్యత్తే ఉండబోదని విలపిస్తున్నది...తనను ప్రేమించి, ఆరాధించి, తనే సర్వస్వంగా బతికి ఉండవలసిన తన ధర్మపత్ని తనను ప్రేమించలేదు సరికదా తీరని ద్రోహంచేసింది. తనలో నిద్రపోతున్న దానవుడిని తట్టిలేపింది. తను హంతకుడయ్యేలా చేసింది. 'లైఫ్ ఈజ్ స్ట్రేంజర్ దేన్ ఫిక్షన్' అని అందుకే అన్నారా?

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

స్పందన వయిపు ఆర్తిగా చూసాడు గౌతమ్.

"ఫలితం ఇవ్వదని తెలిసీ వృక్షాన్ని పోషించడం అవివేకం కదూ!"

"ఫలితం ఇవ్వని వృక్షాలు సృష్టిలోనే లేవు"

"స్పందనా!"

"మీ గురించి ఆలోచిస్తూ మీ తలపులలో తేలిపోతూ నేనెంత ఆత్మానందం అనుభవిస్తానో మీకు తెలీదు...ఆనాడు మీరాబాయి కృష్ణుడిని ఆరాధిస్తూ ఇటువంటి ఆత్మానందమే పొందేదేమో...."

"స్పందనా! ఎందుకమ్మా నేనంటే నీకి పిచ్చి ప్రేమ. పదిజన్మలకు సరిపోయేంత వ్యధ తప్పితే నీకు నేను ఏమివ్వగలను?" వేదనగా అన్నాడు గౌతమ్.

అతడి చేతిని పెదవులతో స్పృశించింది స్పందన.

సెంట్రీ ఓరగా చూస్తున్నాడు.

శ్మశానం లాంటి ఈ కండెంబ్లాకులో ప్రణయసుమ సౌరభం గుబాళించడం వింతగానూ, గమ్మత్తుగానూ ఉందతనికి.

ప్రేమికులు ఒకరి కళ్ళలోకి ఒకరు తదేకంగా చూసుకుంటూ మౌనంగా చిత్తరువుల్లా ఉండిపోవడం గమనించి 'మంచి కాలక్షేపమే !' అనుకున్నాడు పైలా పచ్చీసులో ఉన్న ఆ సెంట్రీ తమాషాగా.

"గౌతమ్!"

"ఊ..."

"ఆ సెంట్రీని చూడండి-మనవైపెలా చూస్తున్నాడో!" మంద్రస్వరాన అంది స్పందన.

"మృత్యుసీడలో నిలిచిఉన్న ఖైదీ ప్రణయం జపిస్తుంటే అలా చూడక ఇంకెలా చూస్తాడు? ప్చ్...ప్రపంచ చరిత్రలో ఏ ప్రియుడూ నాతో పోల్చదగదేమో!"

ప్రశ్నార్థకంగా చూసింది స్పందన.

"సముద్రతీరాన వెన్నెల రాత్రిలో మనోజ్ఞ వాతావరణంలో ప్రియురాలి ఒడిలో మల్లెల సౌరభం ఆస్వాదిస్తూ చెప్పాల్సిన మాటలు ఈ శ్మశాన వాతావరణంలో మృత్యు వాసనతో నిండిన ఈ డెత్ సెల్లులో నిలబడి సెంట్రీ మిర్రి మిర్రి చూస్తుండగా చెప్పవలసి వచ్చింది"

"గౌతమ్!"

స్పందన కంఠంలో వేదన సుళ్ళు తిరిగింది.

"ఒక్కక్షణం ... ఒకే ఒక క్షణం కూడా మనకు ఏకాంతం లభించదు. మన ప్రతి మాట, ప్రతి కదలిక వేయి

కళ్ళతో కనిపెట్టి చూస్తుంటారు. నా దురదృష్టం నిన్నూ చుట్టుకుంటి. వెళ్ళిపో స్పందనా...నా గాలి సోకనంత దూరానికి వెళ్ళిపోయి సుఖంగా, సంతోషంగా జీవించు"

నిశ్శబ్దంగా రోదిస్తూ నుంచుంది స్పందన.

"వెళ్ళిపో స్పందనా!" మళ్ళీ అన్నాడు గౌతమ్.

"అలా వెళ్ళిపోయేదాన్నయితే మిమ్మల్నిక్కడ అసలు కలుసుకుని ఉండేదాన్ని కాను. గౌతమ్...నా సుఖం, నా సంతోషం, నా మనశ్శాంతి ఒక్క మీ సమక్షంలోనే లభిస్తుంది. దురదృష్టం మిమ్మల్ని వరిస్తే ఆ దురదృష్టాన్ని నేను వరిస్తాను" అని ఆగి అతడి కళ్ళలోకి వేదనగా చూస్తూ-"తరచి ఆలోచిస్తే మన జీవితం మనది కాదేమో అనిపిస్తుంది. ఎప్పుడో ఏ జన్మలోనో చేసిన పాప పుణ్యాల ఫలితం ఇప్పుడు ఈ జన్మలో అదృష్ట దురదృష్టాలుగా మన జీవితాలను శాశిస్తున్నదేమో అనిపిస్తుంది"

"నువ్వు కర్మసిద్ధాంతాన్ని నమ్ముతావా?"

"మీ జీవితాన్ని చూస్తుంటే నమ్మవలసివస్తున్నది"

గౌతమ్ మాట్లాడలేదు.

"ఒక మాట!" చిన్నగా అంది స్పందన.

ఆమె కళ్ళలోకి చూసాడు గౌతమ్.

"స్పెల్ ఇట్ మై డార్లింగ్!"

"నా మనస్సు మీరెలా తెలుసుకోగలిగారు?"

"రాత్రి దేవుడు కల్లోకి వచ్చి చెప్పాడు"

గౌతమ్ కంఠంలో చిలిపిదనం చిందులు వేసింది.

స్పందన మోహం ఎర్రబడింది.

"అబ్బ...చెప్పండి" గోముగా అంది.

"ఇప్పుడు నిన్ను చూస్తుంటే నాకేమనిపిస్తోందో చెప్పనా!" ఆమెవేపు పరవశంగా చూస్తూ అన్నాడు గౌతమ్.

"ఊఁ..."

"ముద్దులతో ముంచెత్తాలనిపిస్తోంది"

ఒంట్లో రక్తమంతా మొహంలోకి తన్నుకువచ్చినట్లు ఎర్రబడింది స్పందన మొహం.

అది చూసి గౌతమ్ హృదిలో దుస్సహమైన వేదన రగిలింది.

తన మనస్సు, అణువణువు నిండిన ప్రియబాంధవిని మనసారా ఒక పర్యాయం చేతుల్లోకి తీసుకుని మనస్సుతో అనురాగం వ్యక్తమయ్యేలా ముద్దు పెట్టుకోలేని తనకన్న దురదృష్టవంతుడు మరొకడు ఉంటాడా?

"నా ప్రశ్నకు జవాబు చెప్పనేలేదు"

"మీ డాడీ చెప్పారు" ఏదో ఆలోచిస్తూ అన్నాడు గౌతమ్

ఆశ్చర్యచకితయయింది స్పందన.

"డాడీ చెప్పారా ... ఆయనకెలా తెలుసు?"

"కూతురు శ్రేయస్సే జీవిత ధ్యేయంగా బతుకుతున్న తండ్రి ఆ కూతురు మనస్సేమిటో తెలుసుకోలేరా?"

కూతురు తనను ప్రేమిస్తున్నదని నిరంజనరావుగారు చెప్పడంలో అంతరార్థం హఠాత్తుగా బోధపడింది గౌతమ్‌కి.

ఒక స్త్రీ తనను ప్రాణాధికంగా ప్రేమిస్తూ ప్రేమ సాఫల్యం పొందలేక వ్యధతో జీవితం ఎడారి చేసుకుందని తెలిసినప్పుడు సహజంగా ఆమె మనస్సు స్వంతం చేసుకున్న పురుషుడి మనస్సు

మెత్తబడుతుంది. తనూ అలాగే మెత్తబడి తనను ఆరాధిస్తున్న స్త్రీ మనసులో తన కారణంగా ప్రజ్వరిల్లుతున్న విషాదాగ్ని జ్వాలలు చల్లబరచే ప్రయత్నం చేయవచ్చునని ఆయన ఎదురు చూసి ఉండవచ్చు.

"ఏమిటి ఆలోచిస్తున్నారు?"

గౌతమ్ చెప్పాడు.

స్పందన వదనం మ్లానమయింది.

"గౌతమ్! మీరు లేనినాడు నా బతుక్కి అర్థమే ఉండదు. ప్లీస్...నా కోసం..."

"ఊహూఁ..నా జీవితం కోసం నేనెవర్నీ ఎన్నడూ ప్రాధేయపడను" స్థిరనిశ్చయ కంఠంతో అన్నాడు గౌతమ్.



ఉబికివస్తున్న ఏడుపుని పెదవుల మధ్య నొక్కిపట్టి, "తెలిసి తెలిసి ఒక అవకాశాన్ని చేజార్చుకుంటున్నారు" అంది బాష్పరుద్ధకంఠంతో స్పందన.

ఆమెవయిపు ఆర్తిగా చూసాడు గౌతమ్

"మీరు... మీ మనస్సు నాదేనని కలలోనయినా ఊహించలేదు...." మళ్ళీ జన్మలో చూసే అవకాశం లభిస్తుందో లేదో అన్నట్లు అతడి మొహంలోకి తాదాత్మ్యంగా చూస్తూ అంది స్పందన.

ఆమెవయిపు అంతే తాదాత్మ్యంగా చూస్తూ అన్నాడు గౌతమ్—"నీ పరిచయమయిన మొదటి క్షణమే నా మనస్సు నీకంకితమయింది. ఆ నిజం నేను గ్రహించేటప్పటికి నీ నుండి మరలించుకోలేనంత తీవ్రంగా నా మనస్సు నిన్ను కోరుకుంటున్నది. చెబితే నమ్మవేమో-ఇరవయి నాలుగ్గంటలూ నీ ధ్యాసగానే రోజులు గడిచాయి. వివాహితుడయిన మగాడు మరో స్త్రీ మీద ప్రేమ పెంచుకుంటే ఎన్నో సమస్యలు తలెత్తే ప్రమాదముంది. పైగా నువ్వు మరొకరికి వాగ్దత్తమయ్యావని తెలిసింది. అందుకే నా ప్రేమను అట్టడుగు పొరల్లో దాచేసుకున్నాను..."

"ఇప్పుడెందుకు చెప్పారు?" అతడి ఆర్ద్రోక్తిలో అంది స్పందన.

"నీ ప్రాణంలో ప్రాణం నేనేనని తెలిసాక చెప్పకుండా ఉండలేకపోయాను...."

మెరుస్తున్న కళ్ళతో చూసింది స్పందన. "నేనదృష్టవంతురాలిని....."

"నేనూ అదృష్టవంతుడినే! రేపు నా శవం మీద పడి ఏడిచేందుకు నాకో ప్రియబాంధవి ఉంది"

"గౌతమ్!"

ఆమె హృదయం చీల్చుకుని వచ్చింది ఆర్తనాదం.

ఆమెవయిపు అనురాగార్ద్ర నయనాలతో చూసాడు గౌతమ్. "ప్రణయ తపస్వినివయిన నీ మనస్సులో ప్రణయదీప్తి వెలిగించగలిగిన నేను నిజంగా అదృష్టవంతుడిని. కానీ దురుద్దేశంతో నా జీవితంలోకి ప్రవేశించిన స్త్రీ మెళ్ళో మూడుముళ్ళు వేసి దురదృష్టవంతుడినయ్యాను. ఆ దురదృష్టం ఈ విశ్వం నుంచే నన్ను శాశ్వతంగా తరిమికొడుతోంది. ప్చ్... అందుకే ఈ జన్మలో నిన్ను కలుసుకోలేను. స్పందనా... మైలవ్! వచ్చే జన్మలోనయినా నిన్ను కలుసుకునే అదృష్టం ప్రసాదించమని నా జీవితంలో మిగిలిన ఈ కొద్దిరోజులూ ప్రార్థిస్తూ గడిపేస్తాను"

"గౌతమ్... గౌతమ్...."

ఏడుస్తూ అంది స్పందన.

వాత్సల్యంగా ఆమె తల నిమిరాడు గౌతమ్.

అరుణారుణ నేత్రాలతో చూసింది స్పందన "మృత్యుకోరల మధ్య ఇరుక్కుపోయిన మిమ్మల్ని ఎలా కాపాడుకోను?"

గౌతమ్ అనునయంగా ఏదో చెప్పబోయాడు.

ఇంతలో నిరంజనరావుగారు వచ్చారు.

"పాపా...నువ్వింకా ఇక్కడే ఉన్నావా? పద పోదాం!"

కళ్ళతోనే వీడ్కోలు చెప్పి తండ్రి వెంట వెళ్ళిపోయింది స్పందన.

* * *

"మిస్టర్ గౌతమ్!"

గతంనుండి వర్తమానంలోకి వచ్చాడు గౌతమ్.

జైలర్.

విసుగ్గా చూసాడు గౌతమ్.

"మీ వెయిట్ చూడాలి" సెల్ తలుపు తాళం తీస్తూ అన్నాడు జైలర్.

చేతులకు బేడీలతో సెల్ బయటికి వచ్చాడు గౌతమ్.

అతడికి అటుఇటు సాయుధులయిన కానిస్టేబిల్స్, ముందు జైలర్, వెనక వార్డర్...

అందరూ ఆఫీసురూంకి వెళ్ళారు.

ఇప్పుడు తన వెయిట్ చూడటం ఎందుకో గౌతమ్‌కి తెలుసు.

తన బరువున్న ఇసక మూటను ఉరి తాడుకి వేలాడదీసి ఉరితాడు దృఢత్వం పరీక్ష చేసి చూడాలి. రేపు తన బరువు మోయలేక తాడు తెగిపోతే రసాభాస అవుతుంది మరి. అందుకే ఈ ముందు జాగ్రత్త...

జైలుకి వచ్చాక తను పదికిలోల బరువు తగ్గాడు.

ఎంత శ్రద్ధగా శరీరాన్ని పోషించాడు! ఎంత జాగ్రత్తగా ఆరోగ్యం కాపాడు కున్నాడు. జాగింగ్ లాంటి సాధనలతో శరీరాన్నెంత దిమ్మగా చురుగ్గా ఉంచు కున్నాడు...

అంత శ్రద్ధగా జాగ్రత్తగా చూసు కున్న ఈ శరీరం చివరికి హీనాతి హీనంగా ఉరితాడుకి వేలాడదియ్య బడుతుంది.

నిట్టూర్చాడు గౌతమ్.

వెయిట్ చూసాక గౌతమ్ చేతికి మళ్ళీ హేండ్‌కఫ్స్ వేసాడు జైలర్.

"ఇప్పుడు నాచేతికి బేడీలు వేయాల్సిన అవసరం ఉందా?" కించిత్ కోపంగా అడిగాడు గౌతమ్.

జైలర్ మౌనంగా చూసాడు.

"సాయుధులయిన మీరు ఇందరు ఎస్కార్ట్ ఉండగా మీకళ్ళుగప్పి ఈజైలు నుండి నిజంగా తప్పించుకు పారిపో గలనా?"

"జైలురూల్స్..." అంటూ ఏదో గొణిగాడు జైలర్.

"హెల్ విత్ యువర్ జైల్‌రూల్స్!" కస్సుమన్నాడు గౌతమ్.

అతడి హృదయం రగిలిపోతున్నది.

"బంధితుడయిన నేరస్థుడిని అడు గడుగునా ఇలా అవమానించే హక్కు నిజంగా మీకుందా!"

ఒకసారి అతడివయిపు చూసి మౌనంగా ఊరుకున్నాడు జైలర్.

మరో ఖైదీ ఎవరయినా అలామాట్లాడి ఉంటే అతడి ఒంటిమీద వాతలు తేలి ఉండేవి. అయితే విద్యాధికుడయినగౌతమ్ అంటే జైలరుకేకాదు జైల్లో తక్కిన ఉద్యోగులందరికీ కూడా ఎంతో గౌరవం. గౌతమ్ ప్రవర్తనకూడా ఎంతోహుందాగా సంస్కారవంతంగా ఉంటుంది. మరి కొన్నాళ్ళలో అతడి మీద ఉరిశిక్ష అమలు జరపబడుతుంది. ఈ సమయంలో అతడి మానసికస్థితి ఎలాగుంటుందో అనుభవజ్ఞుడయిన జైలరు ఊహించగలడు. అందుకే గౌతమ్‌మాటలు అట్టే పట్టించుకో లేదు.

గౌతమ్‌ని మళ్ళీ సెల్‌లో బంధించి వెళ్ళేముందు "భగవద్ధ్యానం చేసుకోండి. మనశ్శాంతిగా ఉంటుంది" అని సలహా ఇచ్చి వెళ్ళాడు జైలర్.

'నాకు మనశ్శాంతినిచ్చేది భగవద్ధ్యానం కాదు. నా ప్రియబాంధవి నామస్మరణ!' అనుకున్నాడు.

'స్పందనా...మైస్వీట్ హార్ట్!'

తమకంగా అనుకున్నాడు.

తన ప్రేమతో అణువణువు నూత్న తేజంతో తుళ్ళి పడుతోంది. అందుకే

నేమో ఈ చివరి రోజులు మరీ అంత బాధాకరంగా అనిపించడం లేదు. ఆమెను వదిలి శాశ్వతంగా వెళ్ళిపోవాలనుకుంటే గుండెలు పిండినట్లవుతుంది. అయితే వచ్చే జన్మలో ఆమెను కలుసుకుని ఈ జన్మలో కోల్పోయిన మాధుర్యం రెట్టింపుగా పొంద వచ్చునన్న ఆశాభావం హృదయానికి ఉపశమనం కలిగించింది. ఆ ఆశాభావమే లేకుంటే అతడికి జీవితం మరింత దుర్భర మయి ఉండేదేమో!

మధ్యాహ్నం భోంచేసాక భగత్‌సింగ్ చరిత్ర చదువుతూ సాయంత్రందాకా గడిపాడు. ఉరితాడు మెడను కావలించు కున్నప్పుడు సైతం చెదరని భగత్‌సింగ్ ఆత్మస్థైర్యం గౌతమ్ హృదయాన్ని పులకరింపజేసింది.

తనూ మరణాన్ని అంత ధైర్యంగా ఎదుర్కోగలడా?

ఇప్పుడున్న గుండెనిబ్బరం రేపు జైలు అధికారుల వెంట ఉరికంబం వద్దకు నడచి వెళ్ళే సమయంలో ఉంటుందా?

తనను ఉరితీసే తతంగం ఊహా పథంలో మెదిలింది.

మనస్సంతా చేదుగా వికారంగా అయింది.

శరీరం మీద రోమాలు నిక్కబొడుచు కున్నవి.

ఒక్కోసమయం తన మనస్సే తనకు శత్రువవుతుందటారు.

ఎంత నిజం!

పరిపరి విధాలుగా ఆలోచించే ఈ మనస్సే లేకుంటే తప్పించుకునేందుకు వీల్లేని ఈ విషవలయంలో ఇలా చిక్కుకుపోయేవాడు కాడు.

ప్చ్...ఇప్పుడెంత గింజుకున్నా గతం తన స్వంతం కాదు.

మరికొన్ని రోజుల్లో తను బలవన్మ రణం పొందక తప్పదు.

హఠాత్తుగా ఏదో గుర్తొచ్చి సెంట్రీని పిలిచాడు.

సెంట్రీ ప్రశ్నార్థకంగా చూసాడు.

"టైమెంతయింది?"

గౌతమ్ వయిపు ఆదోలా చూస్తూ - "అయిదూ పంథొమ్మిది నిమిషాలు" అన్నాడు సెంట్రీ.

గౌతమ్ భ్రుకుటి ముడివడింది.

ఈరోజు స్పందన రాలేదు.

తనిక్కడికి వచ్చిన ఈ సంవత్సర కాలంలో రాకుండా ఒక్కరోజు మానలేదు.

ఈరోజు ఎందుకని రాలేదు? ఒంట్లో కులాసాగా లేదా??

అసలే ఆలోచనలతో సతమతమవు తున్న అతడి మనస్సు మరింతగా అశాంతికి గురయింది.

అస్థిమితంగా, ఆరాటంగా స్పందన కోసం నిరీక్షించాడు.

జైల్లో దీపాలు వెలిగాయి.

కానీ అతడి హృదయంలో ప్రణయ జ్యోతి వెలిగించిన స్పందన రాలేదు.

నిరాశా నిస్పృహలతో గౌతమ్ హృదయం కృంగిపోయింది.

ప్రియబాంధవి కోసం అణువణువు పరితపిస్తుంటే మోకాళ్ళ మీద తల వాల్చి కూర్చున్నాడు. తన జీవితంలో మిగిలింది ఇక ఏడురోజులే.

ఎంత చూసినా, ఎంత మాట్లాడినా ఈ ఏడు రోజులే. ఆతర్వాత తన ప్రియ సఖిని వదిలి శాశ్వతంగా వెళ్ళిపోవాలి.

ఆ మాట అనుకుంటేనే గుండెలు పిండినట్లయింది.

తను స్పందనను ప్రేమిస్తున్న సంగతి నెల్లూరులో ఎమ్.ఎస్. చేస్తున్న

ప్పుడే తెలుసుకున్నాడతను. అయితే ఆమె కూడా మనస్సు, ఆత్మ ఏకం చేసి మరీ తనను ప్రేమిస్తున్న సంగతి మొన్ననే గ్రహించాడు. ఆ నిజం గ్రహించాక మనోవేదన మరింత ఎక్కువయింది.

స్పందనా....ఇవ్వాళ ఎందుకమ్మా రాలేదు? నీ కోసం కళ్ళు కాయలు కాచేలా ఎదురు చూస్తానని తెలీదా నీకు? నిన్ను చూడని రోజు దుర్దినమని ఎరుగవా? తెలిసీ ఎందుకమ్మా రాలేదు?

మరి ఏడు రోజుల్లో తను బలవన్మరణం పొందబోతున్నాడన్న దిగులు కన్న ఈరోజు తన ప్రియురాలు తనను చూడరాలేదన్న వేదన ఎక్కువయిందతడికి.

అదే ప్రేమ భావం!

ప్రియురాలి స్మరణలో తనను తాను మరచే ప్రేమికుడు తనవాళ్ళు చీత్కరించుకున్నా లెక్కపెట్టడు. సమాజం వెలివేసినా ఖాతరుచేయడు. పిచ్చివాడిని చేసి రాళ్ళతో కొట్టి హింసించినా చలించడు. ఎదుట సాక్షాత్తు మృత్యుదేవతే నిలిచినా లక్ష్యపెట్టడు. అయితే ఒక్కరోజు ప్రేయసిని చూడకుంటే తల్లడిల్లిపోతాడు. జీవితమే శూన్యమయినట్లు పరితపిస్తాడు. ఆమె దర్శనంతో మాత్రమే అతడి మనస్సుకి శాంతి లభిస్తుంది. ఆమె ప్రియభాషణలు వింటేనే అతడి తప్తహృదయం ఉపశమిస్తుంది.

ఆరాత్రి దీర్ఘంగా, భారంగా గడిచింది.

మర్నాడు అతడి తల్లి, తోబుట్టువులు చూడవచ్చారు.

ఏడ్పులు, రోదనలు...

గౌతమ్ నిర్లిప్తంగా ఉండిపోయాడు.

అందరూ వెళ్ళిపోయాక నేలమీద వెల్లకిలా పడుకుని పైకప్పుకేసి దీర్ఘంగా చూస్తూ ఆలోచనాస్రవంతిలో మునిగాడు.

ఆరోజూ స్పందన రాలేదు.

గౌతమ్ మనస్సు మనస్సులో లేదు.

స్పందన ఎందుకు రాలేదు?

ఆమె తండ్రి రానివ్వలేదా?

ఛ, ఆయన మరీ అంత కఠినుడు కాడు.

మరెందుకు రాలేదు?

తెలీని నిజం గురించి ఎన్నో ఊహలు. ఆలోచనలు!

పొంచి చూస్తున్న మృత్యువుని గురించి అట్టే పట్టించుకోక నిరంతరం ప్రియురాలి ధ్యాసగానే ఉన్న ఆ విచిత్ర ప్రేమికుడి మనసులో ఒకే ఒక కోరిక.

ఒక రాత్రి....ఒకేఒక రాత్రి తన ప్రణయదేవతతో గడపగలిగితే...

విషాదంగా నవ్వుకున్నాడు.

తన జీవితంలో మిగిలిన ఈ కొద్ది రోజులు భగవన్నామస్మరణ చేస్తూ మనస్సుని రాగద్వేషాలకతీతంగా ప్రశాంతంగా ఉంచుకొమ్మని సలహా ఇస్తున్నారు. భగవద్గీత చదవమని ఉద్బోధిస్తున్నారు.

తనో...?

కోరికతో కాలిపోతున్నాడు.

ప్రియురాలితో ఒకరాత్రి గడపాలని తపించిపోతున్నాడు.

ఒక చెంప మృత్యువు తరుముతుంటే ప్రేయసి కౌగిలికోసం ఆరాటపడుతున్నాడు.

ప్చ్...

చితిమీద కాలి బూడిద అయ్యేదాకా తనలాంటివాడిని రాగద్వేషాలు, కోరికలు, కాంక్షలు వదలవేమో!

* * *

ఆ రాత్రి ఎలాగో గడిచి తెల్లవారింది.

తన జీవితంలో మిగిలింది ఇహ

అయిదురోజులే. 'జీవితం నిజంగా ఎంత చిన్నది' నిర్వేదంగా అనుకున్నాడు గౌతమ్.

'తననీ లోకంనుండి సాగనంపేందుకు చకచక ప్రయత్నాలు జరుగుతున్నయ్యేమో' ఉరికంబం ఉన్న దిశకేసిచూస్తూ అనుకున్నాడు.

క్షణాలు యుగాలుగా గడుస్తూ ఉదయం మధ్యాహ్నమయింది. మధ్యాహ్నం సాయంత్రమయింది. స్పందన రాలేదు!

గౌతమ్ గుండెలు దిగజారాయి.

స్పందన ఎందుకు రాలేదు?

తనమీద కోపం వచ్చిందా?

ఆమె మనస్సు నొచ్చుకునేలా తనేమయినా అనుచితంగా మాట్లాడేడా?

ఇన్నాళ్లుగా ఇద్దరూ మాట్లాడుకున్న మాటలు గుర్తుకు తెచ్చుకునేందుకు శతధా ప్రయత్నించాడు. ఎంత గుర్తుచేసుకున్నప్పటికీ ఆమెను ఆనందవివశను చేసే మాటలే మాట్లాడాడుతప్ప ఆమెకు కోపం తెప్పించే మాటలు, ఆమె మనస్సు నొచ్చుకునే మాటలు మాట్లాడినట్లు గుర్తులేదు.

అయినా ఈ నరకంలో ఆసరాగా నిలిచిన అనురాగదేవత మనస్సు నొప్పిస్తాడా తను? ఒకవేళ తన మనస్సుఉన్న అసవ్యస్థ స్థితిలో ఏదో ఒక మాట అని ఉంటేమటుకు ఈ సమయంలో తనమీద అలగాలా?

అసలే కల్లోలిత సాగరంలా ఉన్న గౌతమ్ మనస్సులో మరింత అలజడి.

ఈ రెండురోజుల్లో అతడిలో అనూహ్యమయిన మార్పు.

అతడిలో మార్పుకి కారణం అతడిమీద ఉరిశిక్ష అమలుజరిపేరోజు అతి దగ్గరలోకి రావడమేనసుకున్నారు జైలు సిబ్బంది. విద్యాధికుడయిన అతడి ఉరిశిక్ష ఖాయమవడం వాళ్ళ మనస్సుకెంతో కష్టంగా ఉంది. బాధపడుతూనే అతడిని ఉరికంబం ఎక్కించే ప్రయత్నాలు చేస్తున్నారు.

వాళ్ళ చూపుల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తున్న సానుభూతి గౌతమ్‌ని మానసికంగా మరింత హింసకు గురిచేస్తున్నది.

తనకోసం కాచుకునున్న చావుగురించి ఊహించకుండా ఉండలేకపోతున్నాడు.

ఉరికి ముందురోజు రాత్రి తనసలు ప్రశాంతంగా నిద్రపోగలడా?

ఉహుఁ...ఎంతయినా తను సామాన్యుడే. చావు భయం తననిమాత్రం వదిలిపెడుతుందా? చీమ చిటుక్కుమన్నా ఉలికిపడుతూ, తన నీడనుచూసి తానే హడలిపోతూ తనను ఉరికంబం వద్దకు తీసుకువెళ్ళే జైలు ఉద్యోగుల రాకకోసం ఎదురుచూస్తూ క్షణాలు యుగాలుగా గడుపుతూ...

ఓహ్...హారిబుల్!

గౌతమ్ ఒళ్లు జలదరించింది.

కళ్లు మూసుకుని కళ్ళమీద చేతులు అడ్డం ఉంచుకున్నాడు.

ఒక్క క్షణం...ఒకే ఒక క్షణం ఎటువంటి ఆలోచనలేక మనస్సు ప్రశాంతంగా ఉంది. మరుక్షణం నిరాయుధుడయిన సైనికుడిని చుట్టుముట్టే సాయుధులయిన శత్రుసైనికుల్లా అతడిని ఆలోచనలు చుట్టుముట్టాయి.

మెడను ఉరితాడు కావలించుకుంటున్నపుడు తన మానసికస్థితి ఎలాగుంటుందో?

ఉరివేస్తే మరణం సులభంగా సంభవిస్తుందంటారు. మెడచుట్టూ ఉరితాడు బిగుసుకున్న మరు క్షణం స్పృహతప్పి

పోతుంది. స్పృహ తప్పిన ఆ స్థితిలోనే మరణం సంభవిస్తుంది. కాబట్టి అట్టే బాధాకరంగా ఉండదంటారు.

అదెంతవరకు నిజం?

ఏది చెప్పినా ఊహించి చెప్పడమేగా. అసలు నిజం ఎవరికి తెలుసు?

ఉరిశిక్ష అమలుజరపబడిన ఏ వ్యక్తీ మళ్ళీ బతికివచ్చి ఆ క్షణాల అనుభవం చెప్పలేదు కాబట్టి ఎవరు ఏదిచెప్పినా ఊహించి చెప్పడమేతప్ప అసలు నిజం ఎవరికీ తెలీదు.

మరణం ఎలా సంభవించినా బాధాకరమే – శారీరకంగా, మానసికంగా కూడా.

అది ఎవరూ కాదనలేని నిజం!

మరణం అనాయాసంగా వస్తుందో, రాదో ఆ విషయం తెలీదుకానీ ఉరితియ్యబడి మరణించిన వ్యక్తి మొహం వికృతమవుతుంది.

వృత్తిరీత్యా డాక్టరయిన గౌతమ్‌కి ఆ విషయం తెలుసు.

కళ్లు బయటికి పొడుచుకువచ్చి,నాలుక వెళ్లుకువచ్చి మొహం పరమవికారంగా, భయంకరంగా, జుగుప్సగా ఉంటుంది.

భగవాన్...రేపు తనూ...

ఊహించేందుకే భయం వేసిందతనికి.

తను చేసిన తప్పుకి మరణశిక్షే తగిన శిక్ష అని ప్రభుత్వంయొక్క అభిప్రాయమయితే తనమీద మరణశిక్షను మరోలా అమలు పరచవచ్చుగా అనాగరికంగా హేయంగా ఉరి తీసే బదులు తుపాకీతో కాల్చి చంపచ్చు. ఏ విషమో ఇంజక్షన్ చేయవచ్చు. లేక ఎలక్ట్రిక్ చెయిర్ మూలంగా మరణం సంభవించేలా చేయచ్చు. మరణశిక్ష అనాగరికమే, అమానుషమే. అయినప్పటికీ ఉరికన్నా ఆ పద్ధతులు కొంచెం నాజూగ్గా, నాగరికంగా అనిపిస్తుంది. అయినప్పటికీ మన దేశంలో ఉరిశిక్షనే అమలుజరుపుతున్నారెందుకు...

ఆలోచనలతో బుర్ర వేడెక్కిపోయింది.

ఆలోచించకుండా మనస్సుని ప్రశాంతంగా వుంచుకోవాలని ఎంత ప్రయత్నించినా అతడి చాతకాలేదు. ఉరికంబంకేసి పరుగులుతీస్తూ పారిపోతున్న మనసుని పట్టి అదుపులో ఉంచడం అతడి శక్తికిమించిన పనయింది. మనస్సుని ఛిద్రం చేసే ఆలోచనలకు మనస్సులో చోటు ఇవ్వకుండా ఉండలేకపోతున్నాడు.

ఈ విషమఘడియలలో భగవద్ధ్యానం చేస్తే మనశ్శాంతిగా ఉంటుందని-అందరూ సలహా ఇస్తున్నారు. అయితే ఎంత ప్రయత్నించినా తన మనస్సు దేవుని మీద లగ్నం కావడంలేదు. తను నాస్తికుడు కాడు. దేవుడున్నాడని పరిపూర్ణంగా విశ్వసిస్తాడు. అయితే జీవితంలో ఏనాడూ పట్టుమని పదినిమిషాలు భగవంతుడి కోసం వినియోగించలేదు. దేవుడి ముందు ప్రణమిల్లలేదు. ఎన్నో పుణ్యక్షేత్రాలు సందర్శించాడు. ఎన్నో దేవాలయాలు వెళ్ళాడు. ఆ దేవాలయాల్లో ప్రతిష్ఠింపబడిన విగ్రహాలలో శిల్పకళా సౌందర్యం చూసాడే తప్ప దేవుడిని చూడలేకపోయాడు. అష్టకష్టాలు పడి అమరనాథ్‌యాత్ర వెళ్ళినప్పుడు సైతం అక్కడ స్వతఃసిద్ధంగా ఏర్పడే మంచు లింగం చూసి తక్కిన యాత్రికులందర్లాగా భక్తి పారవశ్యంతో వివశుడుకాలేదు. తనను పుట్టించిన ఆ భగవంతుడికి తను మాత్రం దూరంగానే ఉండిపోయాడు.

భగవంతుడిని ఒక్కరోజయినా తరచి ఆలోచించలేదు. ఎంతసేపూ మనస్సు చదువు, టెన్నిస్, ప్రేమ, పెళ్ళి, వృత్తి అంటూ ఐహిక విషయాల చుట్టూ పరిభ్రమించిందే తప్ప ఇహమేమిటి, పరమేమిటి అని ఏనాడూ ఆలోచించలేదు. అందుకే ఎవరి పాపం వాళ్ళనే కుడుతుందని ఊరుకోక తనో పాపం చేసి ఆ పాప ఫలితం ఈనాడు అనుభవిస్తున్నాడు...

బాధగా కణతలు నొక్కుకున్నాడు.

* * *

డ్యూటీనుండి అపుడే ఇంటికి వచ్చారు నిరంజనరావుగారు. యూనిఫాం విప్పేసి లుంగీ చుట్టుకున్నారు. ఆర్డర్లీ ఇచ్చిన టీ సిప్ చేస్తూ – "అమ్మాయిగారేం చేస్తున్నారు?" అని అడిగారు.

"గదిలో ఉన్నారు" వినమ్రంగా అన్నాడు ఆర్డర్లీ.

టీ తాగేసి కూతురు గదికి వెళ్లారు.

కటికనేలమీద బోర్లా పడుకుని ఉంది స్పందన.

ఆమె వీపు, భుజాల కదలిక చూసి ఏడుస్తున్నదని గ్రహించారు.

ఆమె వయిపు తదేకంగా చూస్తూ కొన్ని క్షణాలు అలాగే నిలబడ్డారు.

ఆయన హృదయం దుస్సహమయిన వేదనతో నిండిపోయింది.

దుఃఖంతో కుమిలిపోతున్న కూతుర్ని చూడలేకపోతున్నారు.

అధికారం ఉంది, పలుకుబడి ఉంది, ఐశ్వర్యం ఉంది....

కాని ఏదీ తన కూతురు దుఃఖం పోగొట్టదు.

ఆమె ప్రియుడిని కాపాడజాలదు.

అందుకే కూతురుతోబాటు కుమిలిపోవడం మినహా మరేమీ చేయలేక పోతున్నారు. మెల్లిగా వెళ్ళి స్పందన పక్కనే నేలమీద కూర్చుని – "బేబీ!" అన్నారు లాలనగా. చప్పున ఆయన ఒళ్లో తలపెట్టి "డాడీ" అంది స్పందన గద్గదికంగా.

ఆమె తల నిమురుతూ, "టీ తాగావా అమ్మా?" అన్నారు వాత్సల్యంగా.

లేనన్నట్లు తల అడ్డంగా ఊపింది స్పందన.

"కొద్దిగా తాగు తల్లీ!"

"వద్దు డాడీ!"

"నాలుగురోజులయింది. పచ్చిగంగ ముట్టలేదు. నువ్విలా నిరాహారదీక్ష పూనితే నీమీదే ప్రాణాలు పెట్టుకు బతుకుతున్న నేను బతికేదెలా? చెప్పు తల్లీ!"

"హెపిష్టిదాన్ని మిమ్మల్ని బాధ పెడుతున్నాను. నన్ను క్షమించండి డాడీ" వ్యధగా అంది స్పందన.

ఆమె తల నిమురుతూ మౌనంగా ఉండిపోయారు నిరంజనరావుగారు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

"డాడీ!" పిలిచింది స్పందన.

"ఏం తల్లీ?"

"గౌతమ్ ఎలా ఉన్నారు?" సంకోచంగా అడిగింది.

నిట్టూర్చారు నిరంజనరావుగారు. "ఎలా ఉండాలో అలాగే ఉన్నాడు" అని ఆగి ఆమె మొహంలోకి పరిశీలనగాచూస్తూ "ఒకసారి వెళ్ళి అతడిని పలకరించు అమ్మా!" అన్నారు.

"అతడి సమక్షానికి వెళ్ళే మన స్తయిర్యం నాకు లేదు డాడీ!" ఏడుస్తూ అంది స్పందన.

ఏడ్చి ఏడ్చి ఆమె మొహం ఉబ్బి

పోయింది. కళ్ళు వాచిపోయాయి.

రూపుదాల్చిన శోకంలాగున్న ఆమెను చూస్తుంటే నిరంజనరావుగారికి గుండెలు పిండినట్లయింది.

సంతోషంగా, హాయిగా సాగిపోతున్న కూతురు జీవితంలో ఈ పరిణామమేమిటి?

ఈ నాలుగు రోజుల్లోనే ఎంత మార్పు. ఇలాగే చూస్తూ ఊరుకుంటే తన కూతురు తనకు దక్కుతుందా?

దీర్ఘంగా నిట్టూర్చారు.

చూస్తూ ఊరుకోవడం మినహా తనేమి చేయగలడు?

శారీరకంగా ఆమెకేదయినా జబ్బుచేసి ఉంటే తన సర్వస్వం వెచ్చించి అయినా



ఆమెకు నయం అయేలా చూసేవాడు. కానీ ఆమెది మనోవ్యథ. ఆమె వేదన పోగొట్టి ఆమెను మామూలు మనిషిని చేయాలంటే ఆమె ప్రియుడి ప్రాణాలు కాపాడాలి.

అతడిమీద మరణశిక్ష అమలు జరపాల్సిన గురుతరమయిన బాధ్యత తన భుజస్కంధాలమీద ఉండగా అతడి ప్రాణాలు తనెలా కాపాడగలడు? కానీ కూతురు దుఃఖం చూడలేకపోతున్నారు....

మరణశిక్ష పొందిన గౌతమ్ ఇక్కడికి వచ్చింది మొదలు స్పందన జీవన సరళిలో అనూహ్యమయిన మార్పు...

సహజంగా ఆడంబరాల వెనక పరుగులు తీసే స్వభావంకాదు ఆమెది. అయినప్పటికీ సుఖంగా సాగిపోతున్న జీవితంలో ఒక చిన్న అసౌకర్యం ఎదురయినా ఆమె సహించదు. అది ఆమె తప్పుకాదు. ఒక్కగానొక్క కూతురు. కాలు కింద పెడితే కందిపోతుందేమో అన్నంత గారాబంగా, అపురూపంగా చూసుకుంటున్నాడు. ఆమె మార్గంలో చిన్న కంటకం ఎదురయినా తన ప్రాణం గిలగిల్లాడిపోతుంది. అటువంటిది కూతురు తనను తాను శిక్షించుకుంటుంటే చూస్తూ ఊరుకోవడం మినహా ఏమీ చేయలేక పోతున్నాడు.

గౌతమ్ మరణశిక్ష అనుభవించే నిమిత్తం ఇక్కడికి వచ్చినరోజే స్పందన కటిక నేలమీద పడుకోవడం ప్రారంభించింది. రోజుకి పిడికెడు అన్నం మాత్రం తిని ప్రాణాలు నిలుపుకుంటోంది. కాఫీ, టీ, పాలు, పళ్ళు... వేటికేసీ కన్నెత్తి చూడదు. కనీస సుఖాలు, సౌకర్యాలు సైతం కాదనుకుని విరాగినిలా బతుకుతున్న కూతురుని చూస్తూ మనశ్శాంతిగా ఉండగలడా?

చీకటి ముసురుకున్న జీవితాలలో వెలుగు ప్రసరిస్తుందా?

ఆయన మనస్సు భారమయింది.

స్పందన గౌతమ్‌ని ఎంత గాఢంగా ప్రేమిస్తున్నదో ఆయనకిప్పుడే అర్థమవుతోంది.

అందుకే ప్రస్తుతం ఆమె మానసిక స్థితిని అర్థం చేసుకుని ఆమె ఇష్టానికి వదిలేసారు. అనుభవజ్ఞుడయిన ఆయనకు తెలుసు....

వ్యథ ఈ క్షణం ఎంత దుస్సహంగా ఉన్నప్పటికీ కాలంగడిచేకొద్దీ బాధ తీవ్రత తగ్గిపోతుంది. విషాదం మనస్సులో శాశ్వతంగా తిష్టవేసుకు ఉండిపోవచ్చు. అయితే ఆ విషాదం అట్టే బాధించదు...

"డాడీ!" పిలిచింది స్పందన.

"ఏం తల్లీ?"

"గౌతమ్ ధైర్యంగా ఉన్నారా?"

"ఆఁ అతను ధైర్యస్థుడనే చెప్పాలి"

"అతని తల్లి,తోబుట్టువులు వచ్చేరా?"

"రాకుండా ఉండగలరా?"

స్పందన ఏదో చెప్పబోయింది. అంతలో ఆర్డర్లీ వచ్చాడు ఎస్.పి.గారు వచ్చారంటూ. నిరంజనరావుగారు డ్రాయింగ్ రూంకి వెళ్ళారు.

స్పందన మొహం కడుక్కొని బట్టలు మార్చుకుంది. తల దువ్వుకుంటుండగా చేతిలో టీ కప్పుతో ఎస్.పి. గోపాలరావు గారు వచ్చారు.

"కూర్చోండి అంకుల్!" చిరునవ్వుతో అంది స్పందన.

సోఫాలో కూర్చుంటూ, "ఏమిటమ్మా, అలాగున్నావు? ఒంట్లో కులాసాగాలేదా?" వాత్సల్యంగా అడిగారు.

"కొద్దిగా తలనొప్పిగా ఉంది"

ముభావంగా అంది స్పందన.

టీ సగం సాసర్లో పోసి ఆమెకిస్తూ, "తీసుకో" అన్నారు గోపాలరావుగారు.

మౌనంగా అందుకుంది స్పందన.

"క్లినిక్కి వెళ్ళడమే మానేసినట్లున్నావ్?" కప్పు టీపాయ్‌మీద ఉంచుతూ అన్నారు గోపాలరావుగారు.

"వెళ్ళకేం... వెళ్తూనే ఉన్నాను"

"ఏమో మరి మీ ఆంటీ చెప్పింది. ఎప్పుడు చూసినా క్లినిక్ మూసే ఉంటుందని"

"అన్నట్లు ఆంటీ ఎలా ఉన్నారు?"

గోపాలరావుగారు నవ్వి, "ఆ మాట మీ ఆంటీనే అడుగు - పెద్దలిస్టు చదువుతుంది" అన్నారు.

"ఏం లిస్టు?" అమాయకంగా అంది స్పందన.

మరింత పెద్దగానవ్వి అన్నారు గోపాలరావుగారు "ఏముంది నడుం నొప్పి, మోకాళ్ళ నొప్పి, గుండెల్లో దడ, కడుపులో మంట, నీరసం....ఓహ్ ఇంకా ఎన్నో కంప్లయింటులు. అవునూ నాకు తెలీక అడుగుతాను - నిజంగా ఆమెకు అన్ని బాధలు ఉన్నయ్యా లేక ఊహించుకుంటుందా?"

స్పందన నవ్వి "లేని నొప్పులు ఎందుకు ఊహించుకుంటారు?" అంది.

"లేకపోతే ముప్పొద్దులా సుష్టుగా తింటూ మధ్యలో పళ్లు, పళ్ళరసాలు, హార్లిక్సులతో కడుపు నింపుకుంటూ ఆ సమానం నీరసం అంటుందేమిటి? రోజూ తినే మటన్, ఫిష్, చికెన్‌లు ఏమవుతున్నట్లు?"

"ఏమిటోయ్ అడిగేవారు లేరనా మా చెల్లాయిని ఆక్షేపనిగా కించపరుస్తున్నావ్?" మిథ్యాకోపంగా అన్నారు నిరంజనరావుగారు.

"మహాప్రభో, నువ్విక్కడే ఉన్న సంగతి మరచి మీ చెల్లెలి ఊసు ఎత్తాను. ఈ ఒక్కసారికి క్షమించు. జన్మంతా ఋణపడి ఉంటాను...."

స్పందన పక్కున నవ్వింది.

తాత్కాలికంగా ఆమె తన జీవితాన్ని చుట్టేసిన విషాదం గురించి మరచిపోయింది. ఎన్నో రోజుల తర్వాత ముద్దుల కూతురు ముఖంలో హాసచంద్రికలుచూసి నిరంజనరావుగారి ముఖం వికసించింది.

రాత్రి తొమ్మిదిగంటలదాకా సరదాగా గడిచిపోయింది.

నిరంజనరావుగారి కోరికమీద గోపాలరావు కూడా అక్కడే భోంచేశారు.

నాలుగురోజులు నిరాహారదీక్ష తర్వాత స్పందన కొద్దిగా పాలు, అన్నం తింది.

నిరంజనరావుగారి మనస్సు శాంతించింది.

కూతురు మనస్సుకయిన గాయం కొంచెం ఆలస్యమయినప్పటికీ మాని తీరుతుందన్న నమ్మకం చిక్కింది.

"అన్నట్లు...డాక్టర్ గౌతమ్ ఎలాగున్నాడు?" గోపాలరావుగారు అడిగారు.

విషణ్ణవదనంతో చూశారు నిరంజనరావుగారు.

"బ్లాక్‌వారంట్ అందుకున్న అభాగ్యుడు ఎలాఉంటాడో అలాగే ఉన్నాడు"

గోపాలరావుగారు నిట్టూర్చారు. "బెజవాడలో ఉండగా అతడితో స్నేహం కలిసింది. వయస్సు తేడా చూడక అందరితోనూ కలుపుగోలుగా, స్నేహంగా, సరదాగా ఉండేవాడు. తను నవ్వుతూ తక్కిన అందరిని నవ్విస్తూ హుషారుకి మారుపేరులాగుండేవాడు.

ముఖ్యంగా టెన్నిస్ అద్భుతంగా ఆడే వాడు. అటువంటి వ్యక్తి చివరికి.. మరణ శిక్ష ఉండితీరాలని వాదించేవారిలో నేను ప్రథముడిని. కానీ సమాజానికెంతో ప్రయోజనకారి అయిన అత్యంత ప్రతిభా వంతుడయిన ఆ సర్జనుకి మరణశిక్ష పడిందని తెలిసినప్పుడు నేనెంత క్షోభి ల్లానో చెప్పలేను. హి ఈజ్ సచ్ ఎ నైస్ యంగ్‌మాన్! అతడంత అమాను షంగా, క్రూరంగా హత్యలు చేసాడంటే నమ్మలేకపోయాను. కానీ పరిస్థితులు మనిషిచేత ఎంత దారుణకృత్యమయినా చేయించగలవు. భార్యకు మరో మగాడితో సంబంధం ఉందని తెలిస్తే పౌరుషవంతు డయిన మగాడు సహించి ఊరుకోలేడు. నిజమే-కానీ చదువు సంస్కారాలున్న వ్యక్తి మరీ అంత ఆడవిమనిషిలా ప్రవర్తించక రవ్వంత నిగ్రహం పాటించిఉంటే....ప్చ్, ఇప్పుడేమనుకుని ఏం ప్రయోజనం? కనీసం రాష్ట్రపతి అయినా సర్జనయిన అతడి మూలంగా సమాజం పొందిన ప్రయోజనాలు దృష్టిలో ఉంచుకుని కనికరించి ఉంటే, ప్రతిభావంతుడయిన ఒక సర్జన్ దేశానికి దక్కేవాడు!"

"అతడసలు ప్రాణభిక్ష పెట్టమని రాష్ట్రపతికి దయావిన్నపం చేసుకోనే లేదు" విషాదంగా అన్నారు నిరంజన రావుగారు.

ఆశ్చర్యంగా చూసారు గోపాలరావు గారు. "ఎందుకని?"

"ఏమో!"

ఏదో ఆలోచిస్తూ మౌనంగా ఉండి పోయారు గోపాలరావుగారు.

కాసేపు తరువాత గుడ్‌నైట్ చెప్పి వెళ్ళిపోయారు.



స్పందన తనగదికి వెళ్ళిపోయింది.

పడుకునే ముందు ఆమె గది గుమ్మం వద్ద నిలిచి లోపలికి చూసారు నిరంజన రావుగారు. గుండెలమీద మంచుముద్ద పెట్టి నొక్కుతున్నట్లుఫీలయ్యారు. ధనుర్మాసం చలి ఎముకలు కొరికేస్తున్నది. కాలు నేల మీద పెడితే మంచుగడ్డమీద పెట్టిన అను భూతి....ఈ శీతల వాతావరణంలో కటిక నేలమీద తలకింద దిండయినా లేక పడు కుని ఉన్న కూతుర్ని చూస్తుంటే ఆయనకు ఆనాటి గాంధారి గుర్తొచ్చింది. గుడ్డివాడయిన భర్త చూడని ప్రపంచం తనుమాత్రం ఎందుకు చూడా లనిబతికి నన్నాళ్లు కళ్ళకు గంతలు కట్టుకు బతికిన మహాసాధ్వి. ఆమె రక్తమే తన ముద్దుల కూతురిలోను ప్రవహిస్తున్నదా. అందుకేనా ప్రియుడు కోల్పోయిన సుఖాలు, సౌకర్యాలు తనూ త్యజించింది? ప్రణయ భావం అంత ఉదాత్తమయినదా?

ఆలోచిస్తూ తన గదికి వచ్చేసారు.

ఉద్యోగంలో చేరాక మొదటిసారిగా జైళ్ళ స్థితిగతులను గురించి తీవ్రంగా ఆలోచించసాగారు.

నిజమే! మన దేశంలో జైళ్ళలో నెలకొనిఉన్న వాతావరణం చెప్పాకో దగ్గంత సంతృప్తికరంగా లేదు. నేరస్థుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు సంకెళ్ళువేసి బంధుమిత్రులకు, సమాజానికి దూరంగా బంధించాక వాళ్ళ మంచిచెడ్డల పూర్తి బాధ్యత ప్రభుత్వానిదే. అది ఎవరూ కాదనలేని నిజం. అయితే ఆ బాధ్యత ఎంతవరకు సక్రమంగా నిర్వర్తించబడు తోంది? తక్కిన విషయాలు ఏమోకానీ ఖైదీల ప్రాథమికావసరాలు తీర్చునేం దుకు సైతం ఆరోగ్యకరమయిన వాతా వరణం ప్రస్తుతం జైళ్ళలో లేదు. ఖైదీల ఆత్మగౌరవాన్ని కించపరిచే పరిస్థితులే

నెలకొని ఉన్నవి. ప్రస్తుత పరిస్థితులలో మార్పురావాలి. ముఖ్యంగా మరణశిక్ష పొందిన ఖైదీల విషయంలో ఆ మార్పు అవశ్యం వచ్చితీరాలి. మరణశిక్ష పొందిన ఖైదీది ఏ రీత్యా చూసినా దయనీయ మయిన స్థితి. అహరహం మృత్యువుని ఎదురుచూస్తూ బతికే అతడికి దుర్భర మయిన జైలు వాతావరణం నరక సదృశంగానే ఉంటుంది. అతడికి ప్రాణభిక్ష ఎలాగూ పెట్టలేరు. కనీసం చివరిరోజులు ప్రశాంతంగా గడిచిపోయేలా చుట్టూ పరి శుభ్రమయిన వాతావరణం కల్పిస్తే, అతడికిష్టమయిన ఆహారం ఇస్తే అందు వలన ఎవరికేమి హాని కలుగుతుంది?

డెత్ సెల్‌లో మగ్గిపోయే అభాగ్యుడి ఆహార స్నానాది విషయంలో జైలు రూల్స్ ఖచ్చితంగా పాటించితీరాలా?

అతడి విషయంలో రూల్సు కాస్తంత సడలిస్తే ప్రపంచం తల్లకిందులవుతుందా?

ఆలోచిస్తూనే మర్నాడు డ్యూటీకి వెళ్లారు.

వధ్యస్థలానికి వెళ్ళి మరోసారి అంతా సరిచూసారు.

అక్కడ ఏర్పాట్లు చూస్తుండగా గుండెల్లో సన్నగా నొప్పి బయలుదేరింది.

తన ఒక్కగానొక్క కూతురుకి ప్రియాతి ప్రియతముడయిన వ్యక్తి జీవితం రేపు ఉదయం ఈ ఉరికంబం మీద అంతం కాబోతున్నది. అతడి జీవితం అలా అంతమయేలా చూసే బాధ్యత తనది. బిడ్డ కన్నీరు తుడవాల్సిన తండ్రి ఆమె గుండెల్లో దుఃఖాగ్ని రగిలిస్తున్నాడు. ఆమె బతుకులో విషాదం గుమ్మరిస్తున్నాడు.

ఆ దిగులే ఆయనను కృంగదీస్తున్నది.

భోజనానికి ఇంటికి వెళ్ళేముందు గౌతమ్ దగ్గరికి వెళ్లారు.

గౌతమ్ మొహంలో మృత్యుకళ కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నది.

నిరంజనరావుగారు నిట్టూర్చారు.

ప్రారబ్ధకర్మ ఎవరిని విడిచిపెట్టింది!

"స్పందన రావడం...మానేసింది?" సంకోచంగా అన్నాడు గౌతమ్.

చివరిసారిగా ఆమెను చూడలేకపోతా నేమోనన్న దిగులు రేపు ఎదుర్కొబోయే బలవన్మరణంకన్న ఎక్కువగా అతడిని కృంగదీస్తున్నది.

"ఈరోజు వస్తుంది!" సానుభూతిగా అన్నారు నిరంజనరావుగారు.

"మీకభ్యంతరం లేకుంటే ఆమెకో ఉత్తరం రాస్తాను" అన్నాడు గౌతమ్.

"ష్యూర్!"

అని ఒక తెల్లకాగితం, పెన్ను ఇచ్చారు నిరంజనరావుగారు.

ఉరికి ముందురోజు ఖైదీపట్ల సూప ర్నెంటు మొదలు సెంట్రీదాకా అందరూ ఉదారంగానే ఉంటారు. జైలు రూల్సు నతిక్రమించనంతవరకు అతడి కోరికలు కాదనరు. అతడిని చూడవచ్చే బంధు మిత్రులను వాళ్ళకిష్టం వచ్చినంతసేపు అతడి సమక్షంలో ఉండనిస్తారు.

తన ప్రణయదేవతకు మొదటిది, ఆఖరుది అయిన ప్రేమలేఖ అప్పుడు రాసాడు గౌతమ్. ఉత్తరం మడిచి నిరంజనరావుగారికిస్తూ – "క్షమించండి. మీ అమ్మాయికి ఉత్తరం రాసి అందివ్వ మని మీ చేతికే ఇస్తున్నాను" తల వంచు కుని అన్నాడు గౌతమ్.

అతడి భుజం మీద మృదువుగా తట్టి "ఇట్సాల్‌రైట్!" అన్నారు నిరంజనరావు గారు.

"స్పందన. ." అని ఏదో చెప్పబో

యాడు గౌతమ్.

"ఈరోజు తప్పక వస్తుంది" అని వెళ్ళిపోయారు నిరంజనరావుగారు.

* * *

తండ్రి ఇచ్చిన ఉత్తరం ఉద్వేగంగా అందుకుంది స్పందన.

"స్పందనా... నా ప్రాణమా.

ఈ నరక కూపంలో మగ్గుతున్న నిర్భాగ్యుడికి నీ రాక, అనురాగపూరిత మయిన నీ పలకరింపు ఎంత ఉపశమనం కలిగిస్తుందో తెలిసీ ఎందుకమ్మా రావడం లేదు. రోజులో ఇరవయి రెండుగంటలు జీవచ్ఛవంలా బతికే నేను నీతో గడిపే రెండు గంటలు మాత్రమే నిజంగా బతుకు తాననితెలీదా నీకు!నీ రాకకోసం నేనెంతగా ఎదురుచూస్తుంటానో తెలిసీ రావడం మానేసావు. మృత్యునీడలో నిలిచిఉన్న నా మీద కోపం వచ్చిందా? నీ మనస్సు నొప్పించేవిధంగా ఏమయినా మాట్లా దేనా!ఏమో..నా మనసిప్పుడున్న స్థితిలో చికాగ్గా ఏమయినా మాట్లాడి నిన్ను విసి గించానేమో. చేతులు ఎత్తి మొక్కి వేడుకుంటున్నాను. నేను తెలియక చేసిన తప్పు క్షమించి ఒక్కసారి కనిపించి వెళ్లు. ఈరోజు నిన్ను చూడలేకపోతే మరణ సమయంలో నాకు మనశ్శాంతి ఉండదు. ప్లీస్...స్పందనా! నీ జీవితంలో కొన్ని నిమిషాలు నువ్వే ప్రాణంగా బతుకుతున్న నా కోసం వెచ్చించ లేవా? ఈరోజు నా జీవితంలో ఆఖరి రోజని నీకు గుర్తుందనుకుంటాను. మృత్యువు ఒడిలోకి వెళుతున్న వ్యక్తి తన కపకారం తలపెట్టినవాడే అయినప్పటికీ దయతో అతనిపట్ల హృదయం ఆర్ద్ర మవుతుందంటారు. నా విషయంలో ఆమాత్రం ఆర్ద్రత నీ హృదయంలో కరువయిందా?నీ సాహచర్యంలోకలకాలం చల్లగా, హాయిగా బతికే అదృష్టానికి ఎలాగూ నోచుకోలేకపోయాను. చివరి సారిగా నిన్ను కళ్ళారా చూసుకునే అదృష్టమయినా నాకుప్రసాదించు.తప్పక వస్తావు కదూ. నీ కోసం ఒళ్ళంతా కళ్ళు చేసుకు ఎదురుచూసే నీ వాడు...

గౌతమ్"

ఉత్తరం చదివి గుండెలు పగిలేలా ఏడవసాగింది స్పందన.

"బేబీ" ఆవేదనగా అన్నారు నిరంజన రావుగారు.

ఏడుస్తూ ఆయన హృదయం మీద వాలిపోయింది స్పందన.

తనిప్పుడు ఏం చెప్పినా ఆమె దుఃఖం ఉపశమించదని నిరంజనరావుగారికి తెలుసు.

అందుకే ఆమె వెన్ను నిమురుతూ మౌనంగా ఉండిపోయారు.

ఏడ్చిఏడ్చి అలసిపోయింది స్పందన.

ప్రాణంలో ప్రాణంలాంటి కూతురు అలా ఏడుస్తుంటే చూస్తూ ఊరుకోవడం మినహా మరేమీ చేయలేని తన నిస్సహాయ స్థితికి కుమిలిపోయారాయన.

స్పందన దుఃఖం కొద్దిగా తగ్గాక-

"ఒంటిగంటనుండి విజిటర్స్‌ని రానిస్తారు. గుండె నిబ్బరం చేసుకుని వెళ్ళి ఒకసారి అతడిని పలకరించిరా తల్లీ! లేకుంటే అతడికి మనశ్శాంతి ఉండదు" అన్నారు మృదువుగా.

స్పందన మౌనంగా సోఫాలో వాలి పోయింది.

మధ్యాహ్నం డ్యూటీకి వెళ్ళేముందు-

"ఇప్పుడు నాతోబాటు వస్తావా?" అని అడిగారు.

"మీరు వెళ్ళండి డాడీ... నేను ఆనక

వస్తాను"

"నీ ఇష్టం!" అని వెళ్ళిపోయారాయన.

* * *

తెల్లని మేక్సీలో శాంతి మూర్తిలా ఉన్న స్పందనను ఆర్తిగా,తపనగా చూస్తున్నాడు గౌతమ్.

అంతకన్న తమకంగా అతడిని చూస్తున్నది స్పందన.

నోరు విప్పి మాట్లాడితే పొంచిఉన్న మృత్యువు తమ మాటల సవ్వడికి ఇద్దరి మధ్య ఉరికి విడదీస్తుందేమో అని భయపడుతున్నట్లు ఇద్దరూ మూగగా,మౌనంగా ఒకరివయిపొకరు చూసుకుంటూ చెక్కిన శిల్పాల్లా నిలబడిపోయారు.

నీరసం, వ్యధ, మృత్యుభయం... వాడిపోయి, నలిగిపోయి ఎలాగో ఉన్న గౌతమ్‌ని చూస్తుంటే స్పందనలో దుఃఖం కట్టలు తెంచుకుంది.

"ఇలా ఏడుస్తూకాదు.నవ్వుతూ గుడ్‌బై చెప్పాలి" ఆమె కన్నీళ్ళు తుడుస్తూ అన్నాడు గౌతమ్.

స్పందన ఏడుపు మరింత ఎక్కువయింది.

"ఇన్నాళ్ళూ ఎందుకు రాలేదు?" లాలనగా అడిగాడు గౌతమ్.

"మీ ముందుకు వచ్చే మనఃస్థయిర్యం లేక" వెక్కుతూ అంది స్పందన.

"అందుకోసం రావడం మానేసినన్నేడిపించావా? నన్ను చుట్టేసిన చీకటిలో ఒకే ఒక వెలుగు కిరణం నువ్వు. రావడం ఎందుకు మానేసావో కారణం తెలీక ఎంతగా తల్లడిల్లిపోయానో తెలుసా? మళ్ళీజన్మలో నిన్ను చూస్తాననుకోలేదు" ఆర్తిగా అన్నాడు గౌతమ్.

అతడి మొహం స్పృశిస్తూ, "సారీ డార్లింగ్... అసలే సంక్షుభిత మనస్కులయిన మిమ్మల్ని మరింత బాధించాను" వ్యధగా అంది స్పందన.

"స్పందనా!" ఆమె కళ్ళలోకిచూస్తూ అన్నాడు గౌతమ్.

"ఊఁ" అతడి చూపులతో చూపులు కలిపింది స్పందన.

"ఆఖరి క్షణంలో ఏదోవిచిత్రం జరిగి నా ఉరిశిక్ష రద్దయి నన్ను విడుదలచేసేస్తే అప్పుడు నువ్వు, నేను... ఓహ్... తలచుకుంటేనే ఎంత పులకరింతగా ఉంది"

సజల నేత్రాలతో చూసింది స్పందన.

"అంత అదృష్టానికి మనం నోచుకోలేదు..."గద్గకంఠాన అంది.

ఆమె అరిచేతిని ముద్దుపెట్టుకుంటూ, "ఐ లవ్‌యూ డార్లింగ్" అన్నాడు గౌతమ్.

అతడి చేతిలో మొహం దాచుకుంది స్పందన.

ఆమె కన్నీటితో అతడి చెయ్యి తడిసింది.

"నాకు ధైర్యం చెప్పాల్సింది పోయి నువ్వే ఏడిస్తే ఎలా?"

"మీతోబాటు నేనూ వచ్చేస్తాను గౌతమ్! మీరు లేని ప్రపంచంలో నేనుండలేను" ఏడుస్తూ అంది స్పందన.

ఆమె వయిపు చూసాడు గౌతమ్.

ప్రణయభావంతో సమ్మిళితమయి విషాదం, శోకం...

తమకన్నా దురదృష్టవంతులయిన ప్రేమికులు ఉంటారా సృష్టిలో.

తుప్పు పట్టిన మేకు దిగేసినట్లు గుండెల్లో దుస్సహమయిన బాధ....

సర్దుకుని "అలా మాట్లాడకు స్పందనా! నీమీదే పంచప్రాణాలు పెట్టుకు బతుకుతున్నారు మీడాడీ. ఆయనకోసం నువ్వు... నన్ను మరచిపోయి సంతోషంగా

బతకాలి. నాకారణంగా నువ్విలాగే ఒంటరిగా ఉండిపోతే నాకు ఆత్మశాంతి ఉండదు. స్పందనా.. నా మాట విని అన్ని విధాలా నీకు తగిన వ్యక్తిని పెళ్ళి చేసుకుని నిండుగా నూరేళ్ళు జీవితా న్ననుభవించు...నీకు పుట్టే బాబుకి నా పేరుపెట్టు"

"ఇంకాసేపట్లో ఈలోకానికే గుడ్‌బై చెప్పబోతున్న నేను పెళ్ళి చేసుకోవడం... పుట్టేబాబుకి మీ పేరు పెట్టుకోవడం... జరిగేపనేనా?"

"స్పందనా... నువ్వేమంటున్నావ్?" ఆందోళనగా అన్నాడు గౌతమ్.

"మీరులేని ప్రపంచంలో ఉండలేను అంటున్నాను"

"ఏమీ అఘాయిత్యం తలపెట్టనని మాట ఇవ్వు..."

"ఊహూ..."

"అంతిమ సమయంలో నాకు మనశ్శాంతి లేకుండా చేస్తున్నావు" వ్యథగా అన్నాడు గౌతమ్.

"ప్రేమికులకు మనశ్శాంతి ఎప్పుడూ ఉండదు. ప్రేమికులకు దేవుడు ఇచ్చిన శాపం అది" విరక్తిగా అంది స్పందన.

ఆమె ముఖంలోకి తదేకంగా చూస్తూ మౌనంగా ఉన్నాడు గౌతమ్.

"గౌతమ్" కాసేపు తర్వాత పిలిచింది స్పందన.

"ఊఁ...."

స్పందన తన పక్కనే నిలిచిఉన్న సెంట్రీని చూసింది.

అతడు నిస్సంకోచంగా వాళ్ళను గమనిస్తున్నాడు. వాళ్ళ మాటలు అక్షరం పొల్లు పోకుండా వింటున్నాడు. అతడు తన బాధ్యత నిర్వర్తిస్తున్నాడు మరి!

"సైనైడ్‌కాప్సూల్ తెచ్చాను" సెంట్రీకి అర్థం కాకుండా తమిళంలో చెప్పింది.

ఆశ్చర్యంగా చూసాడు గౌతమ్. "ఎందుకు?" తమిళంలోనే అడిగాడు.

"మీరు.... మీరు హేయంగా ఉరి తియ్యబడి మరణించడం నాకిష్టం లేదు. ప్రపంచంనుండి మీరు నిష్క్రమించడం తప్పనిసరి అయితే మీ జీవితాన్ని మీరే అంతం చేసుకోండి" ఏడుస్తూ అంది స్పందన.

"స్పందనా?"

"అవునండీ! మీ కరచరణాలు బంధించి నిస్సహాయులను చేసినిర్దయగా వధించడం... వద్దండి. ఆ ఆలోచనే భరించలేకపోతు న్నాను. అంతకన్న మీ బతుకుని మీరే అంతం చేసుకోవడం నా మనస్సుకి శాంతిగా ఉంటుంది"

స్పందన కళ్ళల్లోకి చూస్తూ ఆలోచిస్తూ మౌనంగా ఉండిపోయాడు గౌతమ్.

ఇద్దరి మధ్య నిశ్శబ్దం చోటుచేసుకుంది

"పాపిష్టిదాన్ని. నా జీవన సర్వస్వ మయిన మిమ్మల్ని ఆత్మహత్య చేసు. కొమ్మని కోరుకుంటున్నాను. నాలాంటి స్త్రీ ప్రపంచంలో మరొకరై ఉంటుందా?"

వెక్కివెక్కి ఏడుస్తూ అంది స్పందన.

హఠాత్తుగా వాళ్ళు తనకు అర్థంగాని భాషలో మాట్లాడుకోవడం చూసి మరింత అప్రమత్తతగా వాళ్ళను గమనిస్తున్నాడు సెంట్రీ.

అతడివయిపొకసారి చూసి "కాప్సూల్ ఏదీ?" అన్నాడు తగ్గుస్వరాన గౌతమ్.

"మీకు అంగీకారమేనా?" ఆత్రుతగా అడిగింది స్పందన.

"ఊఁ..."

సెంట్రీ చూడకుండా స్పందన లాకెట్టు

తెరచి అందులోంచి రెండు కాప్సుల్స్ తీసింది. మళ్ళీ లాకెట్టు మూసేస్తుండగా నిరంజనరావుగారు, యస్. పి. గోపాల రావుగారు వచ్చారు. వాళ్ళు సెల్ ముందుకి వచ్చేలోగా ఒక కాప్సుల్ గౌతమ్ చేతిలో పెట్టేసింది స్పందన.

మరుక్షణం కాప్సుల్ గౌతమ్ నోట్లో ఉంది.

ఆ కాప్సుల్‌లోదాగిన విషం నాలికకు తగలడం ఆలశ్యం అంతవరకు శరీరాన్ని అంటి పెట్టుకుని ఉన్న ప్రాణం శరీరాన్ని వదిలి పారిపోతుంది.

"హల్లో!" గౌతమ్ వంక ఆర్ద్రంగా చూస్తూ అన్నారు గోపాల్రావుగారు.

"గుడ్‌బై చెప్పడానికి వచ్చారా?" పేలవంగా నవ్వి అన్నాడు గౌతమ్.

మౌనంగా అతడి చేతిని నొక్కి వదిలారు గోపాల్రావుగారు.

కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

స్పందనవేపు చూసారు గోపాల్రావు గారు.



ఏడ్చిఏడ్చి ఉబ్బిపోయి కళావిహీన మయిన స్పందన మొహం చూసి ఆయనలో ఆశ్చర్యం చోటు చేసుకుంది.

"మీకిద్దరికీ పరిచయం ఉందని నాకు తెలీదు!" విస్మయంగా అన్నారు గోపాలావుగారు.

"వెల్లూరులో నేను మెడిసిన్ చదువు తున్నప్పుడు గౌతమ్‌గారు అక్కడే ఎమ్.ఎస్. చేసారు"

ముభావంగా అంది స్పందన.

"అలాగా!"

ఇద్దరిని మార్చిమార్చి చూస్తూ అన్నారు గోపాలావుగారు.

"ఎన్నో పనులు మధ్య నన్ను గుర్తుంచుకుని వచ్చారు. వెరీమెనీథాంక్స్!" గౌతమ్ అన్నాడు.

అతడి వయిపు ఆర్ద్రంగా చూసారు గోపాలావుగారు.

మృత్యుగుహలో నిలిచివున్న గౌతమ్‌తో ఏం మాట్లాడాలో ఆయనకు తోచలేదు. తన మాటలు అతడిని నొప్పించు వచ్చునన్న భయం ఆయనను మాట్లాడ నివ్వలేదు. కాసేపు తర్వాత గౌతమ్ చెయ్యినొక్కి వెళ్ళిపోయారు.

ఆయన ననుసరించారు నిరంజనరావు గారు.

వెళ్ళేముందు స్పందనను చూసి, "బేబీ! నువ్వు..."

"మరికాసేపుండి వెళ్ళిపోతాను డాడీ" అంది స్పందన.

ఒకసారి గౌతమ్‌ని చూసి వెళ్ళిపోయారు నిరంజనరావుగారు.

ఆయన వెళ్తున్న వయిపు బాష్పరుద్ధ నేత్రాలతో చూసింది స్పందన.

ఆమెకు తెలుసు-తన నిర్ణయం తండ్రి గుండెలను ముక్కలు చేస్తుందని! అయితే ఒకదశలో-

స్త్రీకి కన్న తల్లిదండ్రులకన్న, పుట్టించిన భగవంతుడికన్న, పరువు ప్రతిష్టలకన్న, ఆస్తి అంతస్థులకన్న మనసు కోరుకునే వ్యక్తిఎక్కువవుతాడు. అతడికోసం ప్రాణత్యాగం చేసేందుకు సైతం సిద్ధపడుతుంది...

''స్పందనా!"

గౌతమ్ వయిపు చూసింది స్పందన.

తడి కళ్ళతో చూస్తున్నాడు గౌతమ్.

"నేను నిజంగా చాలా దురదృష్ట వంతుడిని" కంపితగాత్రంతో అన్నాడు గౌతమ్.

అతడి చేతివేళ్ళను పెదవులతో స్పృశించి, "బాధపడకండి. మన దుర దృష్టం ఈరోజుతో అంతమవుతుంది. ఈ జన్మలో కలుసుకోలేక పోయిన మనం వచ్చే జన్మలో తప్పక కలుసుకుందాం. ఈ జన్మలో కోల్పోయిన జీవన మాధుర్యం రెట్టింపుగా పొందుతూ చూసే వారి కనులవిందుచేస్తూ కలకాలం కల కళ్ళాడుతూ బతుకుదాం" మెరుస్తున్న కళ్ళతో చూస్తూ అంది స్పందన.

విషాదంగా నవ్వాడు గౌతమ్ "ఎంత అందమయిన కల!"

''ఈనాటి ఈ అందమయిన కల వచ్చే జన్మలో తప్పక నిజమవుతుంది"

''నువ్వెంత ఆశాజీవివి'' ఆర్ద్రంగా అన్నాడు గౌతమ్.

"ఆశాజీవిని కాబట్టే ఇన్నాళ్ళూ బతకగలిగాను''

''స్పందనా!'' ప్రణయోద్విగ్న కంఠంతో అన్నాడు గౌతమ్.

అతడివయిపు పరవశంగా చూసింది స్పందన.

కాసేపు యధార్థం మరచి సుందర

స్వప్న సీమల్లో తేలిపోయిందామె మనస్సు. హఠాత్తుగా ఆమెచేతిని పట్టుకుని, "గుడ్‌బై డార్లింగ్!" అన్నాడు గౌతమ్.

ఉలికిపడి చూసింది స్పందన.

"గుడ్‌బైస్వీట్! వచ్చేజన్మలో కలుసుకుందాం"

"గౌతమ్!"

బావురుమంది స్పందన.

"పెదవుల మీద చిరునవ్వు చెదరకుండా మరణించడమే ధీశాలుల లక్షణం"

"గుడ్‌బై!" కంపిత గాత్రంతో అంది స్పందన.

నోటిలో క్యాప్సూల్‌ని పంటితో కొరికాడు గౌతమ్.

అదే క్షణం తన నోటిలో క్యాప్సూల్‌ని కొరికింది స్పందన.

ఇద్దరూ ఒకేసారి నేలమీదకి కూలిపోయారు.

పక్కనే నిలిచిఉన్న సెంట్రీ కంగారుగా వంగి చూశాడు.

అప్పటికే స్పందన ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసిపోయాయి.

ఆమె ప్రాణాలు వెనువెంటే పరుగులు తీస్తూ పారిపోయాయి గౌతమ్ ప్రాణాలు. భయాందోళనలతో గజగజ వణికిపోతూ నిరంజనరావుగారి వద్దకు పరుగు తీశాడు సెంట్రీ. అమాంతం ఆయన కాళ్ళమీద వాలిపోయాడు.

"ఏమి...ఏమిటిది? ఏం జరిగింది?" ఆదుర్దాగా అడిగారు నిరంజనరావుగారు.

సెంట్రీ నోట మాట రాలేదు. అలాగే పెను తుఫానులో చిక్కిన ఆకులా వణికిపోతూ నుంచున్నాడు.

అతడు డ్యూటీలో ఉండగా రేపు ఉదయం ఉరి తియ్యబడాల్సిన ఖైదీ ఆత్మహత్య చేసుకున్నాడు. రూల్స్ ప్రకారం అతడి ఉద్యోగం తక్షణం ఊడిపోతుంది.

నిరుద్యోగం స్వైరవిహారం చేస్తున్న ఈరోజుల్లో ఎంతో పాటుపడితే ఈ ఉద్యోగం లభించింది. ఈ ఉద్యోగం పోతే... తను రోడ్లమీద పడాల్సిందే.

అతడికి ఏడుపు వచ్చేసింది.

"బాస్టర్డ్. ఏం జరిగిందో చెప్పమంటే వెధవముండలా ఏడుస్తావేం!" కసురుకున్నారు.

జైలరు, వార్డర్లు పరిగెత్తుకువచ్చి జరిగిన సంగతి చెప్పారు.

"మైగాడ్..మైగాడ్!" ఒంట్లో సర్వశక్తులూ హరించుకుపోయినట్లు నిస్తేజంగా కుర్చీలో కూలబడిపోయారు నిరంజనరావుగారు.

ప్రశాంతంగా ఉన్న సరోవరంలో రాయి పడ్డట్లు జైల్లో చెప్పలేనంత అలజడి చెలరేగింది. జైలుసిబ్బంది యావన్మంది మొహంలో భయం, ఆందోళన, కంగారు.

రేపు ఉదయం నాలుగుగంటల ముప్ఫయి నిమిషాలకు ఉరితియ్యబడాల్సిన ఖైదీ ఈరోజు సాయంత్రం అయిదు గంటలకు ఆత్మహత్య చేసుకున్నాడంటే..

అది సామాన్య విషయం కాదు.

ఉరిశిక్ష విధించబడ్డ ఖైదీ ఉరి తియ్యబడి చావవలసిందే.

అతను మరోలా మరణించేందుకు వీల్లేదు.

ఎన్నడో రాబోయే బలవన్మరణం ఎదుర్కొనే ధైర్యసాహసాలు లేక ఆత్మహత్య చేసుకుని దుస్సహమయిన నిరీక్షణకు స్వస్తిచెప్పడం కొందరు ఖైదీల విషయంలో జరిగింది. అలా ఆత్మహత్యా ప్రయత్నాలు చేయకుండా డెత్ సెల్స్‌లో ఖైదీలకు ఇరవయి నాలుగ్గంటలు గట్టి

కాపలా ఉంటుంది. అతడిని చూడవచ్చే విజిటర్స్‌నిసైతం క్షుణ్ణంగా చెక్ చేసిన అనంతరమే అతడితో మాట్లాడనిస్తారు. అతడికిచ్చే ఆహారం ఏ కుక్కకో, పిల్లికో వేసి ఆహారంలో ఎటువంటి విషపదార్థం కలపబడలేదని నిర్ధారణ అయాకే ఖైదీ కిస్తారు. ఉరిశిక్షపొందిన ఖైదీ ప్రాణాలను అంత పదిలంగా చూసుకుంటారు జైలు



అధికారులు. దురదృష్టవశాత్తు వాళ్ళ కళ్ళుగప్పి నేరస్థుడు ఆత్మహత్య చేసు కుంటే...

అందుకు పూర్తిబాధ్యత జైలు అధికారులే వహించవలసి ఉంటుంది.

తలమీద పిడుగులు పడ్డట్లు కూర్చుండి పోయిన నిరంజనరావుగారి భుజంమీద చెయ్యివేసారు అనునయంగా గోపాల్రావు గారు.

"పద...ఏం జరిగిందో చూద్దాం!" మృదువుగా అన్నారు గోపాల్రావుగారు.

పాలిపోయిన నిరంజనరావుగారి మొహం చూస్తుంటే ఆయనకు ఎంతో జాలనిపించింది. ఒక్కగానొక్క కూతురు.. మరికొన్ని గంటల్లో ఉరితియ్యబడాల్సిన

నేరస్థుడు ఆత్మహత్య చేసుకునేందుకు సహకరించడమేకాక అతడితోబాటు తనూ ఆత్మహత్య చేసుకుందంటే...

ఆ తండ్రి మనస్సు ఆ క్షణం ఎంత అలజడికి గురయిఉంటుందో ఆయన ఊహించగలరు.

ఇద్దరూ వెళ్ళారు.

అప్పటికే గౌతమ్,స్పందనల శరీరాలు నీలివర్ణంలోకి మారాయి.

చూడగానే "సైనైడ్" అన్నారు గోపాల్రావుగారు.

"యూ ఆర్ కరెక్ట్" అన్నాడు జైలు డాక్టరు.

శవాలను తన ఆధీనంలోకి తీసుకుని విచారణ ప్రారంభించారు ఎస్. పి. గోపాల్రావుగారు. ముందుగా సెంట్రీతో ప్రారంభించారు.

"స్పందనాదేవి ఖైదీని కలిసేందుకు వచ్చినప్పుడు నువ్వేనా డ్యూటీలో ఉన్నది?''

"ఎస్సార్!" అటెన్షన్‌లో నిలబడి అన్నాడు సెంట్రీ.

"వెరీగుడ్! వాళ్ళిద్దరూ ఏం మాట్లాడుకున్నారో చెప్పగలవా?"

కూతురు తలను ఒళ్ళో పెట్టుకుని కన్నీరుకారుస్తున్న తన పైఅధికారిని చూసాడు సెంట్రీ. అతడి గొంతుకకు ఏదో అడ్డు పడ్డట్లయింది...

దుఃఖ వివశులయిన నిరంజనరావుగారు అతడి వంక చూసి, "పర్వాలేదు. చెప్పు" అన్నారు.

స్పందన వచ్చిన క్షణం నుండి ఆ ప్రేమికులు మాట్లాడుకున్నదంతా అక్షరం పొల్లుపోకుండా చెప్పాడు సెంట్రీ.

విని సాలోచనగా తల పంకించారు గోపాల్రావుగారు.

పోలీసు డిపార్ట్‌మెంటు ఉద్యోగులు బిలబిలమంటూ వచ్చేసారు.

హడావుడి ప్రారంభమయింది.

ఫొటోగ్రాఫర్ చకచక శవాలను ఫొటోలు తియ్యసాగాడు.

ఫొటోలు తియ్యడం పూర్తయాక శవాలను పోస్టుమార్టం చేసే నిమిత్తం హాస్పిటల్‌కి తరలించారు.

నిరంజనరావుగారి దుఃఖం చూడ శక్యంగావడంలేదు.

ఆయనను అనునయించి గౌతమ్ బంధువులకు కబురంపారు గోపాల్రావుగారు.

"సర్! అమ్మాయిగారి హేండ్‌బాగులో ఈ ఉత్తరం ఉంది" అని ఎస్.ఐ. ఒక కవరిచ్చాడు.

ఉత్తరం ఆయనకే అడ్రస్ చేయబడి ఉంది.

''అంకుల్!

ఈ ఉత్తరం మీరందుకునేటప్పటికి నేను బహుశా ఈ లోకంలో ఉండను. ఈ లోకంనుండి శాశ్వతంగా వెళ్ళిపోయే ముందు మీతో ఒక నిజం చెప్పాలి. అంకుల్...రేపు ఉదయం డాక్టర్ గౌతమ్ ఉరితియ్యబడతారని మీకు తెలుసుకదూ? మీకుతెలిని నిజం ఏమిటో తెలుసా? డాక్టర్ గౌతమ్ నా ఆరాధ్య దైవం. ఆశ్చర్యంగా ఉందా? దాదాపు పదేళ్ళక్రితం వెల్లూరులో అతడిని మొట్టమొదటిసారి చూసినప్పుడే నా మనస్సునతడి కర్పించాను. అప్పటికే అతను వివాహితుడు. అతని భార్య లావణ్య అపురూప సౌందర్యవతి. భార్య అంత రూపవతి అయినప్పుడు నాలాగా సామాన్య రూపురేఖలున్న స్త్రీ ప్రేమకు విలువ ఇవ్వడనుకుని నా ప్రేమను నాలోనే దాచుకున్నాను. నా జీవితంలో నేనుచేసిన

పెద్ద పొరబాటు అదే. నేను అతడికేసి ఆకర్షింపబడిన క్షణమే అతనూ నాకేసి గాఢంగా ఆకర్షింపబడ్డాడు. మా దురదృష్టంకొద్దీ ఆ నిజం అతను భార్యను హత్యచేసిన నేరానికి ఉరిశిక్షపొంది ఇక్కడికి వచ్చాకే తెలిసింది. తెలిసాక సంతోషంతో తేలిపోవాలో, విషాదంతో కృంగిపోవాలో తెలీలేదు. అయితే రోజులు గడిచేకొద్దీ, అతడు చావుకి ఒక్కో అడుగు దగ్గరవుతున్నకొద్దీ విషాదమే నా జీవితం మీద ఆధిపత్యం వహించింది. సుప్రీం కోర్టులో అతడికేసు తోసివేసాక బతుకు మీద అనురక్తి పూర్తిగా నశించింది. ఆ రోజే నాలో ఒక పథకం రూపుదిద్దుకుంది. నా ఆరాధ్యదైవమయిన గౌతమ్ కరచరణాలు బంధింపబడి అత్యంత హేయముగా ఉరితియ్యబడతాడన్న ఆలోచన నాలో పెనుతుఫానులు చెలరేగేలాచేస్తోంది. జీవితమే నరకమయింది. అవమానకరమయిన ఆ బలవన్మరణంనుండీ అతడిని తప్పించాలన్నది నా జీవితధ్యేయమైంది. అలా చేయడం నేరం...ఒప్పుకుంటాను. అయితే న్యాయ న్యాయాల గురించి ఆలోచించే స్థితిలో లేదు నా మనస్సు. పరిస్థితులు అంతా సవ్యంగా ఉన్నప్పుడే న్యాయాన్యాయాలు, పౌరధర్మాల గురించి పట్టించుకోవడం జరుగుతుంది. గౌతమ్ భార్యను, ఆమె ప్రియుడిని దారుణంగా హత్యచేసి నేరం చేసాడు. నిజమే. అయితే అంతకుముందుసర్జనుగా అతడు ఎందరికో ప్రాణదానం చేశాడు. రోగుల సేవకే జీవితం అంకితం చేశాడు. పేదలనుండి పైసా ఎదురుచూడక ఎన్నో మేజర్ ఆపరేషన్లు చేశాడు. అతడికి ఉరిశిక్ష విధించిన న్యాయమూర్తులు అతడి వలన గతంలో సమాజానికి జరిగిన మేలునుగురించి ఎందుకు పట్టించుకోలేదు? అతడు తన తప్పు సవరించుకునే అవకాశం ఎందుకు ఇవ్వలేదు? సెషన్స్ కోర్టు నుండి సుప్రీంకోర్టుదాకా ఒకటే తీర్పు... అతడికిహ ఈ సమాజంలో బతికిఉండే అర్హతలేదు. ఏం...బతికుంటే అతడు [illegible] సమాజంలో అందరినీ చంపే[illegible]డా?సాటిమనుషుల ప్రాణాలుతియ్యడం అతడికి వినోదమా? అంకుల్... ఈ క్షణం నా మనస్సెంతగా రగులుతున్నదో చెప్పినా మీకర్థం కాదు. ప్రేమించడమే తప్ప ద్వేషించడం ఎరుగని నేను ఈనాడు గౌతమ్ డెత్ సెల్ లో ఉండేందుకు కారకులయిన న్యాయమూర్తులను ఎంతగా ద్వేషిస్తున్నానో మాటలతో చెప్పలేను. అందుకే వాళ్లు విధించిన మరణశిక్ష అతడి మీద అమలుజరపకుండా చేసేందుకే నిర్ణయించుకున్నాను. ఈరోజు గౌతమ్‌ని చూడవెళ్తూ సైనెడ్ కాప్సుల్స్ తీసుకువెళ్తున్నాను. గౌతమ్‌లేని ప్రపంచంలో నేనుండలేను. అందుకే అతడితో బాటు నేనూ వెళ్ళిపోతున్నాను. కానీ నా ఈ చర్య ఎంతో సిన్సియరిగా తమ ఉద్యోగధర్మం నిర్వహిస్తున్న కొందరు జైలు ఉద్యోగుల ఉద్యోగాలకు ముప్పు తెస్తుందేమోనని ఆరాటంగా ఉంది. అందుకే ఇన్నాళ్ళు తటపటాయించాను. అయితే నా స్వీట్ హార్ట్‌ని అవమానకరమయిన బలవన్మరణంనుండి తప్పించాలన్న తపన ఇతరుల మంచిచెడ్డల గూర్చి ఆలోచించాలన్న విచక్షణను అణచివేస్తున్నది.

అంకుల్...గౌతమ్ ఆత్మహత్య చేసుకున్నందుకు పూర్తి బాధ్యత నాదే. నా మూలంగా నన్నెంతో అభిమానించి గౌరవించే జైలు సిబ్బంది ఇబ్బందులకు

గురయ్యారంటే నాకు శాంతి ఉండదు. నన్నెంత అభిమానిస్తున్నప్పటికీ గౌతమ్‌ని కలుసుకునేందుకు వచ్చే ప్రతిసారి నన్ను క్షుణ్ణంగా చెక్ చేసాకే గౌతమ్‌తో మాట్లాడనిచ్చేవారు. నేనున్నంతవరకు వేయి కళ్ళతో మమ్మల్ని కనిపెట్టి ఉండేవారు. ముఖ్యంగా సెంట్రీ...ఏనాడూ తన ఉద్యోగ ధర్మం విస్మరించలేదు. అంకుల్...నేనెంతో అభిమానించే జైలు ఉద్యోగులను ఈ ఇబ్బందినుండి ఎలా గట్టెక్కిస్తారో మీదే బాధ్యత.

అంకుల్...మరో మాట. పుట్టిన వెంటనే కన్నతల్లిని పోగొట్టుకున్న దురదృష్టవంతురాలిని నేను. అయితే అమ్మ లేదన్న దిగులు తప్పితే ఆమె లేని లోటు నేనెన్నడూ అనుభవించలేదు. అందుకు కారణం మీకు తెలుసు. తానే తల్లితండ్రి అయి నన్ను అల్లారుముద్దుగా, అపురూపంగా సాకారు డాడీ. నాకోసం ఎన్నో సుఖాలు, సరదాలు త్యాగంచేసారు. తన జీవితాన్నే నా కాళ్ళకింద తివాచీగా పరచారంటే అతిశయోక్తికాదేమో. నన్నంత అపురూపంగా చూసుకునే డాడీ గుండెల్లో చిచ్చురగిలించి వెళ్ళిపోతున్నాను. అంకుల్....డాడీని మీరే ఆదుకోవాలి. అంకుల్..సమాజం దృష్టిలో నేను గౌతమ్‌కేమీకాను. అంకుల్... మీరిప్పటికే గ్రహించి ఉంటారు... గౌతమ్ నా జీవన జ్యోతి. మానసికంగా ఎప్పుడో అతడి భార్యనయ్యాను. మేము ఒకరినొకరు ఎంతగా కోరుకుంటున్నప్పటికీ ఈ జన్మలో కలసి జీవించే అదృష్టానికి నోచుకోలేదు. కనీసం అంతిమయాత్ర అయినా ఇద్దరం కలసి చేయాలన్నది నా ఆకాంక్ష. గౌతమ్‌తోపాటు నన్ను ఒకే చితిమీద ఉంచి దహనం చేయించాలి. ఈ లోకం నుండి నిష్క్రమిస్తూ కోరుకుంటున్న కోరిక. సహృదయులయిన గౌతమ్ బంధువులు నా మనస్సునర్థంచేసుకుని నా ఈ చివరి కోరిక నెరవేర్చుతారని ఆశిస్తూ వీడ్కోలు తీసుకుంటున్నాను. గుడ్‌బై అంకుల్...."

ఉత్తరం చదవడం పూర్తిచేసి కళ్ళకు చేతులడ్డం ఉంచుకుని కుర్చీలో వెనక్కి జేరగిలబడి కూర్చున్నారు గోపాల్రావు గారు. మనస్సంతా విషాదంగా, బరువుగా, చేదుగా ఎలాగో ఉంది. స్పందన పుట్టిన రోజే ఆమె తండ్రితో కలసి హాస్పిటల్‌కి వెళ్ళి పాపాయిని చూసారు. అప్పటినుండి ఈరోజుదాకా స్పందన జీవితంలో జరిగిన ప్రతి సంఘటన ఆయనకు తెలుసు. అహ....తెలుసునని ఆయన అనుకున్నారు. అయితే ఆమె జీవితంలో చీకటి గురించి ఇప్పుడీ ఉత్తరం చదివాకే తెలిసింది.

ఆయన హృదయం చీల్చుకుని వేడి నిట్టూర్పొకటి బయలువెడలింది.

ప్రేమాగ్నిలో మరో రాగమయి జీవితం దగ్ధమయింది।

గోపాల్రావుగారు హాస్పిటల్‌కి వెళ్ళేటప్పటికి నిరంజనరావుగారితోపాటు గౌతమ్ బంధువులు ఉన్నారు. శోకపరితప్తులయిన వారిని పత్రికా విలేఖరులు ప్రశ్నలతో వేధిస్తున్నారు.

శ్రీధర్‌ని పక్కకు పిలిచి స్పందన తనకు రాసిన ఉత్తరం ఇచ్చారు గోపాల్రావుగారు.

ఆయనవైపు ఆశ్చర్యంగాచూసి ఉత్తరం చదవసాగాడు శ్రీధర్.

ఉత్తరం చదివి నిట్టూర్చి "స్పందన కోరిక తప్పక నెరవేరుతుంది!" అన్నాడు రుద్ధకంఠంతో. ★

# పాస్

పార్కులోకి వస్తున్న రేఖను చూడగానే హుషారుగా ఈల వేశాడు రవి.

రేఖ దగ్గరికి రాగానే "ఏమయింది... మీ నాన్నగారిని అడిగావా?" అన్నాడు ఆత్రుతగా.

"ఊ... అడిగాను"

"ఏమన్నారు? గొడవ చేశారా?"

"ఎందుకు చేయరూ. అందరు తండ్రుల లాగే ముందు కాస్త అరిచారు. తర్వాత నీ గురించి వివరాలు అడిగారు."

"తర్వాత?"

"ఈ సంవత్సరం బి.కామ్ పాసవు తావా అని అడిగారు"

"ఊ..."

"ఏమో నాకు అంతగా సమ్మకం లేదు పాసవుతానని అన్నాను"

"......"

"అయితే బి.కామ్ పాసయ్యాకే మీ పెళ్ళి అన్నారు"

"అలాగా" రవి డీలా పడిపోయాడు.

[illegible] బి.కామ్ ఫైనలియర్ చదువు తోంది. ఆమె కాస్టింగ్, అకౌంటెన్సీ చాలా వీక్. ఏదన్నా అద్భుతం జరిగితే తప్ప ఆమె పాసవడం జరగదు.

రవి కాలేజీలో లెక్చరర్. ఉన్నట్టుండి ఆతనికి ఒక ఐడియా తట్టింది.

"రేఖా...ఓ పని చెయ్యి. నా దగ్గరకి నలుగురు అమ్మాయిలు ట్యూషన్‌కి వస్తు న్నారు. నువ్వుకూడా చేరు. నేను నీకు కోచింగ్ ఇస్తాను'' అన్నాడు.

"ఫీజు ఎంత మాస్టారూ?'' చిలిపిగా అడిగింది రేఖ.

"[illegible]...నాది'' [illegible]మీద చి[illegible]



వేస్తూ నవ్వాడు రవి.

పరీక్షలు అయిపోయాయి.

ఆశ్చర్యం...! రేఖ ఫస్ట్‌క్లాస్‌లో పాసయింది. పైగా కాస్టింగ్‌లో డిస్టింక్షన్ కూడా వచ్చింది. పరీక్షా ఫలితాలు తెలిసిన సాయంత్రమే రేఖ రవి దగ్గిరకు వచ్చింది.

రవి సంతోషంగా అభినందనలు తెలిపాడు. "నేనే నీకు థాంక్స్ చెప్పాలి. ఈ క్రెడిట్ అంతా నీదే" మనస్ఫూర్తిగా అంది రేఖ.

"అబ్బ... అవన్నీ వదిలేయి. ముందు మన పెళ్ళి గురించి మాట్లాడుకుందాం" అన్నాడు రవి.

"అదే.... పెళ్ళి సంగతి చెబుదామనే వచ్చాను మాష్టారూ!. ఫెయిలయితే హాయిగా పెళ్ళిచేసుకోవచ్చు అనుకున్నాను. ఇప్పుడు డిస్టింక్షన్ కూడా వచ్చిందికదా. చదువు ఇంతటితో ముగించాలనిపించడం లేదు. ఇంకా పైకి చదివి డాక్టరేట్ సంపాదించి లెక్చరర్ నవాలి. ఇప్పుడు పెళ్ళి గురించి ఆలోచించే తీరికే లేదు నాకు" కళ్ళల్లో భవిష్యత్ తాలూకు కలలు మెరుపుల్లే మెరుస్తోంటే ఉత్సాహంగా అన్నది రేఖ.

రవికి నోట మాటరాలేదు. అచేతనంగా రేఖను చూస్తూ ఉండిపోయాడు.

—తుషార

# కతలు

## ఎవరికీ చెప్పకండి

తెల్లని పంచె, కళ్ళీ లాల్చి, నుదుట కుంకుం బొట్టూ, భుజం మీద చక్కగా మడత పెట్టిన ఉత్తరీయంతో...

హడావిడిగా నడుస్తున్నారు విష్ణుశర్మ గారు.

ఆయన ఆవూరి కాలేజీలో సంస్కృతం లెక్చరర్.

ఆయనకి సంస్కృతంలో ఎమ్మే పట్టానే కాకుండా ఉభయ భాషా ప్రవీణ డిగ్రీ కూడా ఉంది.

ఆయనంత హడావిడిగా నడవడానిక్కారణం లేకపోలేదు. ఆరోజు మొదటి పీరియడ్‌లోనే ఆయనకి క్లాసుంది. తొమ్మిదిన్నర బస్సుకెళ్తే ఆయనా పీరియడ్‌కి అందుకోగలరు. అప్పుడే తొమ్మిదీ ఇరవైఅయిదయిపోయిందిమరి.

ఒక చేత్తో పంచెకొసా, మరో చేత్తో గొడుగూ పట్టుకొని హడావిడిగా నడుస్తున్న ఆయన పక్కనే అనుకోకుండా ఓ కారు వచ్చి ఆగింది.

ఆ కారులోని స్టీరింగ్ ముందు పెదాలకి లిప్‌స్టిక్‌తో, చీర, స్లీవ్‌లెస్ జాకెట్టుతో కూర్చొని ఉందో స్త్రీ.

ఆమె మిస్ నళిని! విష్ణుశర్మగారు పనిచేసే కాలేజీలోనే ఇంగ్లీషు లెక్చరర్. కేంబిడ్జి యూనివర్సిటీనించి ఎమ్మే పట్టా పొంది ఈమధ్యనే ఆ కాలేజీలో చేరింది- చదువుకున్నది మరచిపోకుండా, వృధా కాకుండా ఉంటుందని. ఆమె ఇంగ్లీషు గురించి చాలా మంది చాలా రకాలుగా అనుకోడం విన్నారు విష్ణుశర్మగారు. అయినా ఎప్పుడూ పట్టించుకోలేదు. కారణం ఆయనకా భాషలో అంతగా పాండిత్యం లేదు. అలాగే ఆవిడ కేరక్టర్ మంచిదికాదని ప్రచారమూ ఉంది. అదాయనకు అసలే అనవసరం. కారు కిటికీ



లోంచి తల బయటకు పెట్టి చూస్తూ విష్ణుశర్మ గారినడిగింది ఆమె, "కాలేజీకేనా? రండి. నా కార్లో దిగబెడతాను"

మొహమాటంగానున్నా టైం అయిపోతోందని ఎక్కి కూర్చున్నారు విష్ణుశర్మ గారు.

ఇంగ్లీషులో మాట్లాడలేకపోయినా ఇంగ్లీషు బాగానే అర్థమవుతుందాయనకి.

మిస్ సోని కన్నడ పిల్లైనా తెలుగు బాగానే అర్థమవుతుంది. ఎంతో కొంత తెలుగు కూడా మాట్లాడగలదు.

ఆమె చనువుగా ఇంగ్లీషులో ఏమేమో అడుగుతోంది విష్ణుశర్మను.

ఆయన ఒకటిరెండు ఇంగ్లీషు పదాలు మధ్యలో దొప్పిస్తూ తెలుగులోనే జవాబులు చెప్తున్నారు-చూసీ చూడనట్లు ఆమె మొహం వైపు, చేతులవైపు చూస్తూ.

కాలేజీ వచ్చేసింది. పార్కింగ్ దగ్గర ఆగింది కారు.

"థాంక్యూ" అన్నారు విష్ణుశర్మగారు కార్లోంచి దిగి.

"డోంట్ మెన్షన్ ఇట్" అందామె చిరునవ్వుతో ఆయనవైపు చూస్తూ.

ఆశ్చర్యపోలేదు విష్ణుశర్మగారు - ఆవిడ్ని గురించి చాలానే కథలు విని ఉండటాన.

"అమ్మమ్మ...ఎంతమాట! మీరిలా నన్ను కార్లో తీసుకొచ్చినట్లు ఎవ్వరితోనూ చెప్పను. ఈ విషయంలో మీరు నిశ్చింతగా ఉండండి" అనేసి గబగబా తన క్లాసు వైపు నడిచారాయన.

ఆమె తెల్లబోయి చూస్తూ కూర్చుంది.

పాపం ఆయనకి తెలియదు....

'థాంక్యూ' అనగానే ఆమె ఇండియాలోలాగ 'నో మెన్షన్' అనడానికి బదులు తన కేంబ్రిడ్జి అలవాటు ప్రకారం 'డోన్ట్ మెన్షన్ ఇట్' అందని!

—అవధానుల విజయలక్ష్మి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

